"చెప్తుంటే ఏమిటమ్మా? పద... కాస్త యెంగిలి పడుదువుగాని; నువ్వు భోంచేస్తేనే నేనూ భోజనం చేసేది!"

సుశీల నిర్జీవంగా లేచింది, చీర చెంగుతో కళ్ళను ఒత్తుకుంటూ ముందుకునడిచింది. వెంకట్రామయ్య బాధగా ఓ నిట్టూర్పు విడిచి, మేనకోడల్ని అనుసరించాడు.

* * *

సుశీల తండ్రి చనిపోయి, రెండేళ్ళు కావస్తో[illegible] అప్పట్నుంచీ సుశీల, ఆమె తల్లి వరలక్ష్మి, వెంకట్రామ[illegible] దగ్గరే వుంటున్నారు. క్రితం సంవత్సరమే సుశీల స[illegible] ఫైనల్ ప్యాసయ్యింది. కూతురు స్కూలుఫైనల్ [illegible] నందుకు, యెంతగానో మురిసిపోయింది వరలక్ష్మి[illegible] క్షణంలో ఆమె అంతరంగం ఆవేదనతో నిండిపో[illegible] పరలోకంలో వున్న తన భర్త ఆమె స్మృతిపథంలో[illegible] లాడు. ఆయనే సజీవంగా వుంటే, కూతురు స్కూలుఫైన[illegible] ప్యాసయినందుకు యెంతగా ఆనందించేవారో! అంటూ[illegible] తలపోసింది

"సుశీలా! నువ్వు స్కూలుఫైనల్ ప్యాసయ్యావు. యింతవరకూ బాగానే వుందమ్మా! ఇప్పుడు నీ అభిప్రాయం యేమిటో చెప్పు. పై చదువు చదవాలన్న సంకల్పం వుందా?" ప్రశ్నించాడు వెంకట్రామయ్య.

సుశీల, వెంటనే జవాబు చెప్పలేదు. ఆమెకు ఇంకా చదవాలన్న అభిప్రాయమే వుంది. వూరికనే యింట్లో కూచునే బదులు, ఆ సమయాన్ని సద్వినియోగం చెయ్యా

లన్న అభిలాష వుంది. అయితే తన అభిమతాన్ని మావ య్యతో వెల్లడిచేసేందుకు కాస్తంత జంకింది. అందుకే, తల్లి కేసి చూసింది. వెంకట్రామయ్య యిది కనిపెట్టేశాడు.

"మీ అమ్మవేపు చూస్తావెందుకే! చెప్పదల్చుకొన్న దేమిటో, నాతో చెప్పరాదూ?" నవ్వుతూ అన్నాడు.

"అదేం చెపుతుందిలే అన్నయ్యా! మీ బావగారు యాక, మమ్మల్ని ఆదుకున్నావు. అమ్మాయి చదువుకి తరాయం కలుగకుండా ప్రయత్నించావు. నీ ప్రయత్న మా అంటూ, అది స్కూలుఫైనల్ ప్యాసయ్యింది. గరకూ చాలును. ఇంక దానికి పై చదువులు ఎందుకు ..." సుశీల చెప్పడానికి అవకాశం యివ్వకుండా, చెప్పింది వరలక్ష్మి

"అదేమిటమ్మా అలా చెస్తావు? నేను నీ అన్న య్యను. ఒకే రక్తం మనలో ప్రవహిస్తోంది. నేను నిన్ను ఆదుకోపోతే, యింకెవరు ఆదుకొంటారు చెప్పు? అది నా కర్తవ్యం. ఆ విషయాన్ని మరి గుర్తుచెయ్యకు. ఇకపోతే, సుశీల చదువు విషయం అంటావా—దానికి చదవాలన్న వుబలాటం వుంటే, చదివించాలనే వుంది నాకు. నాకు మాత్రం యింకెవరున్నారు? ఒక్కగానొక్క కొడుకేగా! వున్న డబ్బంతా ఏం చేసుకోను? ఈ విధంగానైనా వుప యోగపడనీ!"

"పైచదువు చదివిమాత్రం ఏంచేస్తుంది అన్నయ్యా? ఉద్యోగం చేస్తుందా; ఊళ్లేలుతుందా?"

# సుశీల

"అక్కడే పొరబడుతున్నావు చెల్లమ్మా! చదుః కోవడమన్నది, కేవలం ఉద్యోగం చెయ్యడానికే కాదు విజ్ఞాన సముపార్జనకి..."

"సరే! నాకెందుకూ మధ్య అమ్మాయ్, నీ అః ప్రాయం చెప్పే!" కూతురుకేసి తిరిగి అంది వరలక్ష్మి

"చదవాలనే వుందమ్మా!" వుత్సాహంగా బిచ్చింది సుశీల.

వెంకట్రామయ్య ముసిముసి నవ్వు నవ్వాడు.

"నేను చెప్పానుగా! దానికి ఆ అభిలాష వుం

"అయితే, యింక నేనెందుకు అవరోధపచ్చ ము త్కసరిగ అంది వరలక్ష్మి,

సుశీల మొహం వికసించింది. తన ఆనుగుణంగా నిర్ణయం జరిగినందుకు ముసిపో కళ్లల్లో ఆనందపు జ్యోతులు వెలిగాయి.

నౌకరు వీరన్న చరచరావచ్చి 'సుశీలమ్మగోరు తమరికోసం యెవురో వచ్చినారమ్మా!" అన్నాడు.

"ఎవర్రా?" ప్రశ్నించాడు వెంకట్రామయ్య.

"ఎవురో అమ్మాయిగోరండీ! అప్పుడప్పుడూ మాఇం టికి వత్తూవుంటారు లెండి..."

"నా స్నేహితురాలు 'పద్మ'. అయ్యుంటుంది మావయ్యా! ఇప్పుడే వస్తానుండండి" అంటూ వెళ్ళిపో యింది సుశీల.

"మర్చేపోయాను సుశీలా, క్షణం ఆగు. ఇదిగో - ను హ్యాండ్ పైనలు ప్యాసయినందుకు యీ రిష్టువాచీ

బహుమతి' జేబునుండి ఓ కొత్త వాచీని తీసి అందించాడు వెంకట్రామయ్య.

సుశీల ఆనందం, అపరిమితం. ఊయలలూగే ఉల్లా సంతో ఆ వాచీని వెంటనే చేతికి తగిలించుకొంది.

"నువ్వు యెంత మంచివాడివి మావయ్యా!" స్తూ చకచకా అక్కణ్ణించి నిష్క్రమించింది. వీరన్న డా అక్కణ్ణించి జారుకున్నాడు.

కూతురు వాచీని తగిలించుకుని అనుభవించిన ఆనం కళ్ళారా కనిపెట్టిన వరలక్ష్మి మురిసిపోయింది. వాచీ ఓ సారి కూతురు అనడం యిప్పుడు ఆమెకు ంది.

ందుకు అన్నయ్యా, యిప్పుడు దానికి ఆ వాచీ" దానో అనాలికాబట్టి.

వెంకట్రామయ్య, చిన్నగా నవ్వేడు. 'మంచిదానివే! ఇప్పుడు కాకపోతే యింకెప్పుడు సరదా తీరేది? అయినా, నేనుమాత్రం యింక యెవరికి పెట్టాలి? అసలు నీతో ఓ విషయం చెప్పాలి. ఇంతసేపూ సుశీల వుందని చెప్పలేదు గాని, నా మనోవాంఛ ఏమిటో తెలుసుగా?"

"ఏమిటి అన్నయ్యా?"

"సుశీలను మా యింటి కోడలుగా చేసుకోవాలని వుందమ్మా! అందుకే దానికి పై చదువులు చెప్పించాలన్న ఆసక్తి నాలో మొలకెత్తింది."

వరలక్ష్మి క్షణంసేపు నిరుత్తర అయ్యింది. ఆమె! ఆశ్చర్యంతోపాటు ఆనందంకూడా కలిగింది. తన కూతురి! అంత అదృష్టం పడుతుందని, ఆమె కలలోకూడా వూహించ లేదు తను వూహించని విషయం, అన్నయ్య నోటవిన్నది. గాబట్టి, ఆశ్చర్యపోయింది

చెల్లెలి మౌనానికి అర్థం తెలుసుకోలేకపోయాడు వెంకట్రామయ్య.

"ఏమిటాలోచిస్తున్నావు చెల్లమ్మా?" ప్రశ్నించాడు

"ఆలోచన కాదన్నయ్యా! సుశీల అదృష్టం పండిన దుకు ఆనందిస్తున్నాను. ఎప్పుడన్నా అనుకున్నామా, మ రెండు కుటుంబాలకూ వియ్యం ఏర్పడుతుందని."

ఈ మాట వెంకట్రామయ్య అంతరంగంలో శూలపు పోటులా గుచ్చుకొంది. అయితే దా దాంట్లో అబద్ధం లేదనిపించింది. అప్పట్లో మరోలా వుండేవి.

"అది నిజం చెల్లెమ్మా! బావ బ్ర యీ విషయం గురించి ఆలోచనే లేకపో ఒకవిధమైన అంతస్థు ఒకటి అగాధంలా ముం ఆయన చనిపోయాక, మీ అసహాయత నన్ను జేసింది. నాలో ఆక్రమించుకొన్న ఆధిక్యత క్రమంగ పోయింది. సుశీలను నా కోడలుగా చేసుకోవాలనే యం, చాలా రోజుల్నించి నాలో మొలకెత్తింది, పరాయి పిల్ల కోడలుగా వచ్చి, మమ్మల్ని వుద్ధరిస్తే

దేవిటీ... అనిపించింది. భారీ కట్నాలు పొందాలన్న కాంక్ష మొదట్లో వున్నా, యిప్పుడు ఆ భావన అంతమయింది. నా కున్న ఐశ్వర్యం చాలదా, అనిపించింది. అందుకే యీ నిర్ణయానికి వచ్చాను."

"నీ సహృదయతకు యిదో తార్కాణమన్నయ్యా. కాని, యీ నిర్ణయానికి వచ్చేముందు, రాజుతో ఓ సారి సంప్రదించడం మంచిదేమో! వాడి అభిప్రాయం కూడా తెలుసుకోవడం చాలా అవసరం." అని వరలక్ష్మి అంటూ వుండగా ఆమెకు తగ్గుతెర వచ్చింది. క్షణంసేపు ఆ దగ్గుతో ...కుపోయింది.

"ఏవిటి చెల్లెమ్మా, దగ్గు వుధృతంగా వుందే! ...సుకువస్తానుండు..." కాస్తంత గాభరాపడు ...డు వెంకట్రామయ్య.

...తండానికి డాక్టరు యెందుకులే అన్నయ్యా! ...ందేమో, దగ్గు వుధృతమయ్యింది. నువ్వు ...కు" పొడిగా నవ్వుతూ అంది వరలక్ష్మి.

...నే, నీ దంతా చాదస్తం. చెప్పిన మాట ...వపోయాక మరీ దిగులుతో కృంగిపోతున్నావు. ...నాకేం నచ్చలేదుసుమా. నువ్వేం చెప్పినా, ఈ ...నేను వినేది లేదు. రేపు డాక్టర్ని తీసుకొస్తాను."

"వద్దని చెపుతున్నా కదన్నయ్యా! నాకు బాధాకరంగా వున్నా నేనే చెప్తాను" అంది.

"అదే తగ్గుతుందిలేవే! ఈ మాత్రందానికి డాక్టరెం దుకూ?" అనేసింది చాలా తేలిగ్గా.

సుశీల అప్పటికి మరేమీ మాట్లాడలేకపోయింది.

మరుచటిరోజు అర్ధరాత్రివేళ, వరలక్ష్మికి విపరీతమైన దగ్గుతెర వచ్చింది. ఆ దగ్గు వుధృతానికి తట్టుకోలేకపోయింది. గుండెల్లో పోటు ప్రారంభమయింది బాధతో చుట్టుకుపోయింది. కూతుర్ని కేకవెయ్యాలని ప్రయత్నించింది. కాని మాట పెగల్లేదు. ఆ బాధతో అసహాయస్థితిలో ప్రాణాలు విడిచేసింది. చివరిసారి ఆమె దగ్గు శబ్దానికి సుశీలకు మెలకువ వచ్చింది. తల్లిని సమీపించేసరికే అంతా ముగిసింది. సుశీల మ్రాన్పడిపోయింది. బావురుమంటూ తల్లి ప్రా దేహంమీద పడి యేడవసాగింది. ఆమె ఆర్తనా వెంకట్రామయ్య ఆత్రుతగా వచ్చారు. ఇంకేముంది? అంత హఠాత్తుగా పోయినందుకు కుమిలిపోయారు మాటలు నమ్మి, డాక్టర్ని తీసుకురాకుండా తను ఉపే మరీ బాధపడ్డాడు.

* * *

ఆరోజునుండి సుశీల మనసు వికలమయింది. ఈ ప్రపంచంతో ఆమెకి యేమీ సంబంధంలేనట్టుగా ప్రవర్తింపసాగింది ఈ విశాల హృదయంలో 'నా' అనేవాళ్ళెవరూ లేకపోయాక యింక జీవించి ప్రయోజనమేముందన్న వైరాగ్య భావానికి, ఆమె హృదయంలో ఓచోట చోటు దొరికింది. అయితే వెంకట్రామయ్య తన వాత్సల్యపు అమృతాన్ని ఆమెపై చిలకరించి, అటువంటి నైరాశ్యం ఆమెలో

స్థిరంగా పాతుకుపోకుండా చేశాడు. కన్నకొడుకు రామరాజు కంటె, సుశీలనే అధిక వాత్సల్యంతో చూస్తున్నాడు.

## 2

రామరాజు యిరవైనాలుగేళ్ళ యువకుడు. మనిషిలోని ఆకర్షణకంటె, అతను వేసుకొనే దుస్తుల్లోనే అధిక ఆకర్షణ వున్నట్టు కనిపిస్తుంది. తండ్రి వెంకట్రామయ్య లానే క్క-పలచగా పొడుగ్గా వుంటాడు. కాల్టెక్స్‌లో అకౌంటెం పనిచేస్తున్నాడు. అతని మొహంలో సర్వదా చిరు నులాడుతూ వుంటుంది. జీవితమంటే, సరదాగా పే వుద్యానవనం లాంటిదని అతని అభిప్రాయం. న్నామా, హాయిగా, నిశ్చింతగా, నిత్యం నవ్వుతూ జీవించడమే జీవితానికి పరమావధిగా భావించే వ్యక్తి.

వెంకట్రామయ్యకి, కొడుకంటే యెనలేని ప్రేమాభిమానాలు వున్నాయి. ప్రతి తండ్రికీ కొడుకుపట్ల ప్రేమ వుండటం సహజమే! అయితే వెంకట్రామయ్యకి యీ ప్రేమ మోతాదుకు మించివుంది. అందుకుగల కారణాలు రెండు: ఒకటి—ఒక్కగాని ఒక్క కొడుకు. రెండు—తల్లి లేనిపిల్లవాడు. అందుకే కొడుకును యెంతో, ముద్దుగా మురిపెంగా చూసుకొస్తున్నాడు. కొడుకు యింటికి రావడం, నిర్ణీత సమయం దాటితే, ఆ ముసలాయన మనస్సు, అల్ల

ల్లాడిపోయింది. అందుకే రామరాజు సాధారణంగా ఆఫీసు నుండి నేరుగా యింటికి వచ్చి, ఆ తర్వాతనే యెక్కడికైన వెళ్ళడం అలవర్చుకున్నాడు.

ఓ రోజు రామరాజు యిల్లుచేరడం కాస్త ఆలస్యం అయింది. కొడుకు రాకకోసం, ఆతృతతో, ఆసక్తితో యెదురుచూస్తున్న వెంకట్రామయ్య హృదయం కుదుట పడింది.

"ఏంరా యింత ఆలస్యమయింది?" ప్రశ్నించాడు.

రామరాజు చిన్నగా నవ్వేడు. "ఆఫీసులో వుండటంవల్ల వుండాల్సి వచ్చింది నాన్నా! అయినా యెందుకంతగా ఆరాటం చెందుతారు! నేనింకా వాణ్నా యేమిటి చెప్పండి?"

"నువ్వు ఆ మాట యెంతో సులువుగా అనేశా అబ్బాయ్ కాని, నాలోని ఆరాటం నీకేం తెలుసు? యమ్మ చనిపోయినదగ్గర్నించి తండ్రినీ తల్లినీ నేనే అయి, నిన్ను పువ్వుల్లో పెట్టి పెంచాను. అందుకేనా, నాలోని మమత నీ చుట్టూ పరిభ్రమిస్తూ వుంటుంది...నిర్ణీత సమయానికినువ్వు రాకపోతే, నాకేమిటో అదోలావుంటుంది."

రామరాజు మళ్ళీ నవ్వేడు మెల్లగా. "బూడిద వారీ చాదస్తం నాన్నా!" అనేస్తూ తన గదికి దారితీశాడు.

రామరాజు దుస్తులు మార్చుకుని, నాలుకుర్చీలో చేరబడ్డాడు. సుశీల కాఫీ తెచ్చి అందించింది.

"ఇవ్వాళ కాఫీ నువ్వు తెచ్చి యిచ్చావేం సుశీలా?" అడిగాడు.

"వంటమనిషి రాలేదు."

"నౌకరు యేమయ్యాడు?"

"బజారుకి పంపాను."

"అయితే ఈ రోజు వంటపనంతా నీదేనన్నమాట?"

"ఏం - నేను వండకూడదా?"

"అలాగని నేను అన్నానా?" నవ్వేశాను.

"నీతో మాట్లాడ్డం కష్టం బావా!"

"నా మాటలు అంత కష్టం కలిగిస్తాయా?"

"అలాగని నేను అన్నానా బావా?" నవ్వింది సుశీల.

రామరాజు కూడా నవ్వకుండా వుండలేకపోయాడు.

నామాట, నాకే అప్పజెప్పావన్నమాట! సరేగాని, నీ చదువు యెట్లా సాగుతోంది?"

"కాలేజీ జీవితం కొత్తగా వుంది బావా!"

"అయితే యింతకీ నువ్వు మెడిసిన్ చదువుతావా? ట్రిప్స్ అవుతావా?"

"అది యిప్పుడెలా చెప్పగలను బావా! ఈ సంవత్సరం గడవనీ"

"మెడిసిన్ చదువు. లేడీ డాక్టరయి, లక్షలు గడించవచ్చు" పరిహాస ధోరణిలో అన్నాడు.

"సుశీల, మొహం ముడుచుకుంది బావ, తనని హేళన చేస్తున్నాడేమోనని కించపడింది.

"నా చదువంటే, యెప్పుడూ నీకు వేళాకోళంగానే ఉంటుంది బావా! ఏదో ఒకటి చదువుతాలే!" విసుక్కుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

రామరాజు నవ్వుకున్నాడు. 'సుశీల బొ[illegible] అమాయకురాలు' అనుకున్నాడు మనసులో. కాఫీతీసుకుని, మళ్ళీ దుస్తులు వేసుకొని, వీధిలోకి వెళ్ళిపోయాడు.

మరికాస్సేపటికి వెంకటాద్రియయ్య సుశీలను కేక వేశాడు.

"ఏం మావయ్యా?"

"అబ్బాయి కాఫీ తీసుకొన్నాడా!"

"తీసుకున్నాడు మావయ్యా!"

"ఎక్కడికి వెళుతున్నట్టు చెప్పాడేమిటి?"

"ఆ విషయం నాతో చెప్పనేలేదు"

"నువ్వు అడగాల్సింది"

"అడిగితే కోపగించుకుంటాడని భయం"

"ఎందుకు కోపగించుకుంటాడు? కోపగిం[illegible] విధంగా అడగాలి. ఆఫీసునుండి వచ్చి, కాస్సేపు యింట్లో కూచోడుకదా? రోజూ ఎక్కడికో వెళుతూనే వుంటాడు. ఎల్లకాలం యిట్లా అయితే యెలా?"

"సాయంకాలపు వేళల్లో, విరామంకోసమో, వినోదంకోసమో, తిరగకపోతే, యింట్లో యెవరు యెంతసేపని కూచోగలరు మావయ్యా, మీది మరీ పురాతన పద్ధతి. రోజంతా అఫీసులో గడిపి నేరుగా యింటికివచ్చి, ఇంట్లోనే కూచోవడం, మరో వ్యాసంగమేదీ లేక, ఒక తరగతి వ్యక్తులకు సాధ్యపడుతుందేమో!"

"ఇకసరి! వాణ్ణి నువ్వు వెనకేసుకొస్తుంటే, యింక నేనేం చెప్పగలను? నీవంటి అమాయకులు మరెవ్వుండరేమో! ఆఁ, నేను అలా రంగారావుగారింటికి వెళ్ళొస్తాను.

బ్బయివస్తే వాణ్ణి భోజనం చేసెయ్యమను. నాకోసం
రీక్షిస్తూ కూచోవద్దని చెప్పు"

"అలాగే మావయ్యా" అంది సుశీల.

వెంకట్రామయ్య బయిటకి నడిచాడు.

* * *

సుశీల టేబులు ముందు కుర్చీలో కూచొని ఆలోచనలో మునిగింది. మావయ్య బావ విషయంలో కలిగించుకోమన్న ధోరణిలో చెప్పాడే! కాని బావ విషయం తను యెందుకు పట్టించుకోవాలో ఆమెకి ఓ పట్టాన అర్థంకాలేదు. ఆయన అభిప్రాయం యేమైవుంటుందో... తీవ్రంగా ఆలోచించింది. ఒక్కటే సమాధానం స్ఫురించింది. బహుశా తనని తను యింటికోడలుగా చేసుకోవాలన్న తలంపు మావయ్యకి వుందేమో!... ఈ అభిప్రాయం ఆమెలో తలెత్తేసరికి, ఆమె శరీరం ఒక్కసారి పులకించింది. బావ, తన జీవిత భాగస్వామి కాబోతాడా? యింత అదృష్టం తనకి వుందా? ఈ విషయం గురించి తను యెప్పుడూ ఆలోచించలేదు. అసలు, ఆలోచించే ధైర్యమూ లేకపోయింది. బావ అంతస్థు ఏమిటి? తన అంతస్థు ఏమిటి? ఎంతో అంతరం వుంది. అందుకే, యేనాడూ ఈ ఆలోచన రావడానికి, అవకాశం లేకపోయింది ఒకవేళ మావయ్య అభిప్రాయం యిలా వున్నా బావ ఒప్పుకుంటాడో లేదో? ఎందుకు ఒప్పుకోడు. తనంటే, బావకి అభిమానమే! తనతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతాడు. కాని... కాని... తన అదృష్టం యెలా వుందో?

సుశీల

"ఔను మావయ్యా!" బాధగా అంది.

"అదిగో, ఆవిషయమే ఆట్టే గుర్తుకు తెచ్చుకొని బాధ పడవద్దని యెన్నోసార్లు చెప్పాను. జ్ఞప్తికి తెచ్చుకుని బాధ పడి ఫలితం లేదని తెలిసికూడా, యెందుకు మనస్సుని వికలం చేసుకోవడం చెప్పు...?"

సుశీల మౌనం దాల్చింది.

"సరేలే! అబ్బాయి యింకా రాలేదు. నాకు వడ్డించమ్మా!" అన్నాడు వెంకట్రామయ్య.

"లేచిరా మావయ్యా!" వంటగదికేసి నిష్క్రమించింది సుశీల.

## 3

బీచ్‌కి వచ్చిన వాళ్ళు వస్తూవుంటే, అక్కణ్ణించి యిళ్ళకు పోయేవాళ్ళు పోతున్నారు రాత్రి యేడున్నర దాటింది కొందరు, గుంపులు గుంపులుగా కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు, మధ్య మధ్య,కడుపులు చెక్కలయ్యేలా నవ్వుకుంటున్నారు. కొందరు ఒంటరిగా కూచుని ఆత్మ తృప్తికోసం, మెల్లగా పాడుకుంటున్నారు మరికొందరు జంట వున్నా, మౌనంగా కూచుని, మాటల కోసం వెదుక్కొంటున్నారు. అటువంటి వారి జాబితాకి వస్తారు - రామ

రాజు, జలజాను; వాళ్ళిద్దరూ ఓ చోట కూచుని భరించలేని మౌనం వహించారు.

సముద్ర తరంగాలు ఒడ్డుకు కొట్టుకుంటూ, వింత శబ్దాన్ని సృష్టిస్తున్నాయి. చంద్రుడు సముద్రంలోకి తొంగి చూస్తున్నాడు.

"ఇలా యెంతసేపు మౌనంగా కూచుంటాం జలజా?" నిశ్శబ్దాన్ని ఛేదించాడు రామరాజు.

"ఆ!..." పరధ్యానంగా అంది జలజ. ఆమె దృష్టి, మనస్సూ యెక్కడో వున్నట్టున్నాయి.

"అంతపరధ్యానంగావున్నా వేవిఁటి జలజా?" చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"ఏం లేదండీ! ఆ సముద్రపుటలల మీద చంద్రుడు యెలా ప్రతిఫలిస్తున్నాడో చూశారా? అదే నా దృష్టిని ఆకర్షించింది..." ఒక విధమైన అనుభూతిని అనుభవిస్తూ అంది జలజ.

"నిజం జలజా ! ఆ దృశ్యం యెంతో మనోజ్ఞంగా వుంది. ఇంత చక్కని వాతావరణాన్ని, మనం యెట్లా మౌనంతో వృధా చేస్తున్నామో చూశావా ?"

"వృధా యేమిటండీ ?"

"వృధా కాక మరేవిఁటి జలజా? మనసుకి వుల్లాసం కలిగించేమాటలుకూడా మనకి దొరక లేదంటే యింకేవిఁటి?" ఆమె మొహంలోకి చూశాడు రాజు.

జలజ మాట్లాడలేదు. మెల్లగా నవ్వింది. ఆ వెన్నెల కాంతిలో, ఆమె మొహంలోని హాసరేఖలు, విద్యుల్లతల

వలె తళుక్కున మెరిశాయి. చంద్ర బింబాన్ని సహితం ధిక్కరించేట్లుగా వుందా మోము. ముగ్ధుడయ్యాడు రామ రాజు.

"నువ్వు జవాబు చెప్పకపోయినా, నీ మందహాసం మాత్రం నన్ను మైమరపింపి, మంత్ర ముగ్ధుణ్ణి చేస్తోంది జలజా!" నవ్వుతూ, తన్మయుడై అన్నాడు.

"చాల్లెండి, ఎవరైనా వింటే, నవ్వుతారు..." సిగ్గుతో మొహం దించుకుంది జలజ.

"నవ్వడానికేముంది జలజా ? నీ నవ్వులో యింతటి మహత్తర శక్తి వుందని, నా ఒక్కడికే తెలుసునేమో." అంటూ ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు. మరింత సిగ్గుపడిపోయింది. మెల్లగా చేతిని తీసుకుంది.

"అన్నీ బాగానే వున్నాయిగాని, మా నాన్నగారే కొరకరాని కొయ్యగా వున్నారు...."

"అంటే...?"

"అంటే మరేంకాదు మహారాజా! ఆయన మన వివాహానికి అంగీకరించరేమోనని భయంగా వుంది."

రామరాజు చకితుడయ్యాడు.

"కారణం ?"

"ఆయన అభిప్రాయం యేమైనా, మన యిద్దరి పరిచయం ఆయనకి సుతరామూ యిష్టం లేనట్టు సూచించారు ఆ మధ్య. అసలు, మన యిద్దరికీ యెలా పరిచయమయ్యిందా, అన్న సందేహం కూడా వెలిబుచ్చారు..."

"అలాగా ! మరి, నువ్వేం చెప్పావు ?"

"ఏం చెప్తాను ? వున్నది వున్నట్టుగానే చెప్పాను. ఆరోజు మీరు బస్సుస్టాండు దగ్గర నా మర్యాద యెలా కాపాడిందీ, యెంతటి ధైర్య సాహసాలు ప్రదర్శించిందీ చెప్పాను..."

"అంతా విని యేమన్నారేవిటి ?" వుత్సుకతతో అడిగాడు రాజు.

"చాలా సంతోషించారు కదూ !"

"అదే జరగలేదండీ !"

"మరి...?"

"ఆ సంఘటనని మానాన్నగారు చాలా తేలిగ్గా [తీసుకు]న్నారు. ఆయన యేమన్నారో తెలుసునాండీ?" నవ్వింది పెంకిగా.

"ఏమన్నారేవిటీ?"

"ప్రత్యేకించి, అల్లరిమూకవారు అటువంటి ధైర్య సాహసాల్ని ప్రదర్శిస్తారని, తేలిగ్గా అనేశారు".

"అయితే నేనో పోరంబోకునని మీనాన్నగారి అభిప్రాయమా?"

"ఆయన అభిప్రాయం, అదే అయ్యుండొచ్చు... అయినా దాన్ని మనం పట్టించుకోవడం, అనవసరం."

"ఆ మాట నా పరోక్షంలో అన్నారుగాబట్టి సరిపోయిందిగాని లేకపోతేనా...?" ఉక్రోషంతో పళ్ళు కొరికాడు రాజు.

"అదిగోండి! ఇంతమాత్రానికే మీరు కోపం తెచ్చుకుంటే యెలా చెప్పండి? అది మనకి శ్రేయోదాయకం కాదు కూడాను"

"అంటే, ఆత్మాభిమానంలేని చవటలా అన్నీ సహించి, వూరుకోవాలన్నమాట..."

"తప్పదు మరి. మన పరిచయం, మనప్రేమ, పుష్పించాలంటే, మీరు సహనం వహించడం, చాలా అవసరం."

"సహనం వల్ల, సార్థకం వుంటుందంటే, అలాగే కానియ్... అయితే, యీ సహనానికి టైమ్‌లిమిట్ లేదా?"

"ఉంటుంది. ఆ విషయం నేను చూసుకుంటాను లెండి...ఆఁ...యిప్పటికే చాలా వేళవుతోంది. పోదా పదండి..." లేచింది జలజ.

రామరాజు, ఆమె చేతిని పట్టుకొని, మళ్ళీ కూచో బెట్టడానికి ప్రయత్నించాడు. కాని, లాభం లేకపోయింది. "అబ్బ! లేవండి. నా పరిస్థితి మీకు తెలీదు. ఇంకా ఆలస్యమైతే, మా నాన్నగారు కోపగించుకుంటారు."

రామరాజు గట్టిగా నిట్టూర్చి లేచాడు. ఇరువురూ మెల్లగా నడుస్తున్నారు దూరంలో యెక్కడో చక్కని పాట వినిపిస్తోంది.

"మళ్ళి యెప్పుడు కలుద్దాం...?" అడిగాడు రాజు.

"శనివారం...యిక్కడికే వస్తాను...."

"అబ్బ! అంతవరకే" విరహవేదన భరించలేనంత బాధగా అన్నాడు రాజు.

జలజ నవ్వింది.

"బావుందండీ మీ వరస! అప్పుడే విరహం ప్రదర్శిస్తే ఎలా?"

"నీకేం? నువ్వు అలాగే అంటావు. నేను అనుభవిస్తున్న బాధ నీకేం తెలుసు? త్వరలో మన వివాహవిషయం తేల్చుకోవడం, మంచిది"

"ఆ! ఆ!... అంత ఆతృత వద్దండీ! నిదానంగాపోతే, అన్నీ సక్రమంగా జరుగుతాయి. వీలుచూసుకుని మా నాన్నగారితో నేనే మాట్లాడతాన్లెండి."

"అదీ! అలా నువ్వు కాస్త శ్రద్ధచూపితే, నా మనసుకి వుపశమనం కలుగుతుంది" తృప్తిగా అన్నాడు.

"అక్కడికి, నా కేమీ శ్రద్ధలేనట్టుగా చెప్తారేవిం [illegible] నవ్వుతూ అని "మా ఇల్లు దగ్గరపడుతుంది... మరి నే వస్తా..." అంది జలజ.

"సరే! మనం శనివారం కలుసుకోవడం నిశ్చయమేగా?"

"నిశ్చయమే! వస్తా మరి..." వడివడిగా అడుగులు వేసి వెళ్ళిపోయింది జలజ.

రామరాజు, ఆమె నడకలోని సోయగం గమనిస్తూ, లోలోన మరిసిపోయ్యాడు. జలజ తనకు భార్యకాబోతున్నందుకు; ఎక్కడలేని సంతోషంపొంది, వుక్కిరి బిక్కిరి అయ్యాడు. జలజ స్వరూపాన్ని తన మనోఫలకం మీద పదిలపర్చుకుంటూ, వుత్సాహంతో యింటికేసి నడిచాడు.

* * *

జలజ, యిల్లు చేరేసరికి, గడియారం యెనిమిది కొట్టింది. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ లోప లికిపోతున్న జలజ, తండ్రి దగ్గురిని గతుక్కుమంది. అయినా ధైర్యం కూడగట్టుకుని, ముందుకు పోబోయింది.

"అమ్మాయ్..." మెల్లగా కేకేశాడు సుబ్బారావు.

జలజ ప్రాణవాయువు, సగం అనంతాకాశంలోకి పోయినట్టుగా ఫీలయ్యింది. నీరసంగా, నిరుత్సాహంగా తండ్రిదగ్గరకు నడిచింది.

"ఇంతవరకూ యెక్కడున్నావమ్మా?" ప్రశ్నించాడు.

"స్నేహితురాలింటికి వెళ్ళొస్తున్నా నాన్నా" పచ్చి అబద్ధం చెప్పింది. చెప్పక తప్పింది కాదు.

"నువ్వు చెప్తోంది నిజమేనా?" సందిగ్ధంగా అడిగాడు.

"ఔను నాన్నా!"

"స్నేహితురాలంటే శారదేనా?"

"కాదు నాన్నా! అనసూయ...!" తడబడకుండా చెప్పింది.

సుబ్బారావు అదోలా నవ్వేడు.

"అనసూయ యిక్కడికే వచ్చిందమ్మా! మరి, వాళ్ళింటికి నువ్వు వెళ్ళినట్టు చెప్తున్నావేవిఁటి?"

జలజ స్తంభించి పోయింది.

"ఇక్కడికి వచ్చిందా నాన్నా!" దిగాలుగా అంది. తన అబద్ధం బైటపడినందుకు మరీ బాధపడింది.

"ఔనమ్మా!"

జలజ మొహాం దించుకుంది. తండ్రి తనను గురించి యేవిధమైన అభిప్రాయానికి వచ్చి వుంటాడోనన్నదే ఆమె బాధ.

"అదేవిటమ్మా, అలా ముఖం వాడిపోయిందేం? అబద్ధం చెప్పినందుకు, పశ్చాత్తాప పడుతున్నావా?" అన్నాడు గంభీరంగా.

సుబ్బారావు కోపగించుకో లేదుగాని, మెల్లగా నవ్వేడు.

"అబద్ధం చెప్పడం, అంత సులువు కాదమ్మా జలజా! అబద్ధాన్ని నిజంగా నమ్మించే చాకచక్యంవుంటేనే, అబద్ధం చెప్పాలి. అయినా అబద్ధం యెప్పుడూ నిజం కాలేదు. ఎప్పటికైనా అది బైటపడక తప్పదమ్మా! నిజం చెప్పు... ఎక్కడికి వెళ్ళావు?" సౌమ్యంగానే అడిగాడు;

జలజకి మరో మార్గం కనుపించ లేదు. మరో అబద్ధం చెప్పడానికి, మనస్కరించ లేదు. క్షణం మౌనందాల్చి మెల్లగా చెప్పింది.

"రామరాజుగారితో అలా బీచ్‌కి వెళ్ళాను నాన్నా" మొహాం దించుకునే చెప్పింది.

"నేను ఊహించిందే నిజమయ్యిందమ్మా! అతనితో నీ పరిచయం యిలా వృద్ధిచెందడం, నాకేం నచ్చలేదు. ఈ విషయం యింతకు ముందోసారి హెచ్చరించాను కూడాను. నీ చదువుకు మధ్యలో యెందుకు అంతరాయం కలిగించడమా, అని ఆలోచిస్తున్నాను గాని, లేకపోతే చదువు

మాన్పించి వివాహం చేసేద్దును. మీ మావయ్య తొందర చేస్తున్నాడు కూడాను.

తండ్రి మాటలు వింటుంటే, జలజకి కళ్ళు చీకట్లు క్రమ్మినయ్. ఇంతకుముందు తల్లి రెండుమూడుసార్లు యీ ప్రస్తావన తీసుకువచ్చినా తండ్రిమాత్రం యెప్పుడూ అనలేదు. ఆయన నోట యీ మాటలు వినడం, యిదే ప్రధమం. అందుకే జలజ కాస్తంత ఆశ్చర్యపోయింది. ఆ లేతహృదయంలో తుపాను చెలరేగింది. భగవాన్ ఏమిటీ పరీక్ష?... అనుకుంది. ఆమె నయనాలు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?" కూతురు మొహంలోకి చూస్తూ అడిగాడు సుబ్బారావు. ఆమె కళ్ళల్లో గూడుకట్టిన అశ్రువులు, అతనికి కనిపించలేదు.

"ఆలోచన యేమీ లేదు నాన్నా! రామరాజుగురించి మీ అభిప్రాయాన్ని మార్చుకోలేరా?" బాధగా అంది. ఇంతకు ముందోసారి తండ్రి రామరాజుని విమర్శించివుండటం వల్లనే ఆమె యిలా అంది.

"నీ తెలివితక్కువ తనానికి, యేమనాలో అవగాహన కావడం లేదమ్మాయ్! మీ మావయ్య రామమోహన్ కంటె, రామరాజు యే విధంగా అధికుడో, కాస్తయినా ఆలోచించావా? రామమోహన్ విదేశాలు తిరిగివచ్చిన డాక్టరు. అనతికాలంలోనే వూహించలేనంతగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. రామరాజు విషయంలో అదెప్పుడైనా సాధ్యమవుతుందా? కాదు. కలయినా నిజ వుతుందిగాని, యిది మాత్రం జరగదు. అయినా,

రామమోహన్ అంతస్థేవిటి? రామరాజు అంతస్థేవిటి? పిచ్చిపిచ్చి వూహాలు మనసులో పెంచుకోకుండా ఆతణ్ణి మర్చిపో జలజా!” కొంచెం విసురుగానే చెప్పాడు సుబ్బారావు.

జలజకి, దుఃఖం ప్రవాహంలా ముంచుకొచ్చింది. మొహం ప్రక్కకి తిప్పుకుంది.

“కేవలం అంతస్థులే చూస్తే, మరి మనస్సుల మాటేవిటీ నాన్నా?” రుద్ధస్వరంతో అంది.

“మనస్సు, మన చేతిలో కీలుబొమ్మ జలజా! మనం యెటుతిప్పితే, అటే తిరుగుతుంది. నీ శ్రేయస్సుకే చెప్తున్నాను. బాగా ఆలోచించుకు, ఇంతకంటె తండ్రిగా యింకేం చెప్పగలను?” అనేసి పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

జలజ దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది. కన్నీరు చెక్కిళ్ళ మీదుగా జాలువారింది. రెండు చేతులతో మొహాన్ని కప్పుకుంటూ, చరచరా అక్కణ్ణించి జారుకుంది. తన గదిలోకి పోతూనే, గావురుమంటూ మంచం మీద వాలిపోయింది. ఎక్కణ్ణించో ఓ విషాద గీతం వినిపిస్తోంది.

## 4

వెంకట్రామయ్య భోజనం ముగించి, బైట వరండాలో కూచున్నాడు. కొడుకు యింకా యిల్లు చేర లేదన్న ఆత్ర,

అతణ్ణి గాభరాపెట్టింది. మరి కాస్సేపటిలో రామరాజు రానే వచ్చాడు.

"ఒరేయ్ రాజూ! ఇంతవరకు నువ్వు యిల్లు చేరక పోవడం, యేమీ బాగులేదురా! వేళకి సరిగ్గా భోజనం లేక పోతే, ఆరోగ్యం యింకేం బావుంటుంది చెప్పు? ఎన్నిసార్లు చెప్పినా, వినిపించుకోవడంలేదు. ఏదో నే నీ ప్రపంచంలో వున్నంతవరకే, యిటువంటి హితవులు చెప్తూ వుంటాను. నువ్వూ చిన్నవాడివేం కాదు. కాస్త ఆలోచించు. నాకూ రోజురోజుకీ కనిపించని బలహీనతలు చుట్టు ముట్టుతున్నాయి. వయస్సు వస్తోందిగా! అందుకే, అప్పుడప్పుడూ అనిపిస్తూ వుంటుంది - నిన్ను ఓ యింటివాణ్ణి చేసేస్తే, నా భాధ్యత తీరిపోతుందని; సరేలే! ముందు నువ్వుపోయి భోజనం చెయ్యి. తర్వాత యిక్కడికిరా నీతో మాట్లాడాలి..." అన్నాడు వెంకట్రామయ్య.

రామరాజు మారుమాటాడకుండా, లోపలికి నడిచాడు తండ్రి యేం మాట్లాడాలని అనుకుంటున్నాడో వూహించ డానికి ప్రయత్నించి, విఫలుడయ్యాడు.

చొక్కా విప్పుకుంటున్న రామరాజును వుద్దేశించి సుశీల అంది.

"వడ్డించేసేదా బావా?" అని.

"ఆ!" ముక్తసరిగ జవాబిచ్చి కాళ్ళు కడుక్కొందుకు నూతి దగ్గరకు పోయాడు రాజు.

సుశీల వంటగదికేసి నిష్క్రమించింది.

భోజనం ముగించి, నేరుగా తండ్రి దగ్గరకు వచ్చి, ఆయనకి ఎదురుగా వున్న కుర్చీలో కూలబడ్డాడు రామరాజు.

"భోంచేశావా ?" వెంకట్రామయ్య ప్రశ్న.

"ఔను నాన్నా !"

క్షణం నిశ్శబ్దం. వెంకట్రామయ్య, మళ్ళీ ప్రారంభించాడు.

"ఈ మధ్య నా ఆరోగ్యం యేమీ బాగుండటం లేదుగా అబ్బాయ్! అందుకే, నీ వివాహ ప్రసక్తి నా తలపుకి వచ్చింది. త్వరలోనే, యేదో శుభముహూర్తం చూసి నీ చేత ఆ మూడు ముళ్ళూ వేయించేయాలనుకుంటున్నాను. నీ అభిప్రాయం యేమిటి ?"

తండ్రి నిర్ణయానికి విస్తుపోయాడు రాజు. సంబంధం యేదీ నిశ్చయం కాకుండానే, వివాహం చేసెయ్యాలని నాన్న యెలా అంటున్నారో, అతని వూహాకి అందలేదు.

"మీ యిష్టమే కానీయండి నాన్నా! కాని, సంబంధం యేదో నిశ్చయమవ్వాలిగా ?" అన్నాడు రాజు.

వెంకట్రామయ్య మెల్లగా నవ్వేడు. "నీవంటి అమాయకుడు, ప్రపంచంలో యింకెక్కడా వుండడురా రాజూ! ఇంట్లోనే వున్న పెళ్ళికూతుర్ని, యింక నిశ్చయించేదెవరు?"

రామరాజుకి అర్థమయ్యింది. అతని మొహం వాడిపోయింది.

"ఏమిటి నాన్నా మీరు అంటున్నది ?"

"ఔరా! సుశీలను నీ భార్యగా యేనాడో నిశ్చయించాం. ఇందులో ఆశ్చర్య పోవల్సింది యేమీ లేదే!"

రామరాజు స్తబ్ధుడయ్యాడు సుశీల తనకు భార్య అవుతుందని యెప్పుడూ అతడు అనుకోలేదు.

"మీరు...." అని రామరాజు యింకేమో చెప్పాలని ప్రారంభించేసరికి, వెంకట్రామయ్య చప్పున అందుకున్నాడు.

"ఇంక నీ సందేహమేమిటో అర్థం కావడం లేదురా! సుశీల పరాయిపిల్లకాదు. స్వయానా నీకు మేనత్తకూతురు. అరమరికల్లేని సన్నిహిత సంబంధం. పరాయిపిల్ల మనింటికి కోడలుగావచ్చి వుద్ధరించే దేమిటి? అన్ని విషయాల్లోను సుశీల నీకు భార్యగా తగినవ్యక్తి అనడంలో సందేహం వుండదు అందుకే, నేను యీ నిర్ణయానికి వచ్చేశాను.

రామరాజుకి, తండ్రి చెప్పినదంతా అరణ్యరోదన అయ్యింది. అతనిలో అసహనం క్రమంగా పుంజుకుంది.

"ఇది నా జీవితానికి సంబంధించిన సమస్య. ఆ సమస్యను పరిష్కారం చేసే ముందు నాకు ఆ వివరాలు తెలిపి నా అభిమతం తీసుకోవల్సిన బాధ్యత మీ మీద వుందని మీరు ఒప్పుకుంటారనుకుంటాను నాన్నా!" విసురుగానే అన్నాడు.

"ఔను; ఒప్పుకుంటాను ఇంతకీ. యిప్పుడు ఏం జరిగిందని?"

"ఇంకేం జరగాలి చెప్పండి? నన్నో అస్వతంత్రుడిగా భావించి, మీరీ నిర్ణయానికి రావడం, నాకు నచ్చలేదు. ఇంతవరకూ మీ మాటకి యేనాడూ యెదురు చెప్పలేదు. కాని, యీ విషయంలో మీతో యేకీభవించలేక పోతున్నందుకు విచారిస్తున్నాను నాన్నా!"

"అంటే?" ఆశ్చర్యపోతూ అన్నాడు వెంకట్రామయ్య.

"అర్థంకాని విషయమేమీ కాదిది నాన్నా! సుశీలను పెళ్ళిచేసుకోవడం నాకు యిష్టంలేదు. ఇది నా నిర్ణయం..." ఖచ్చితంగా చెప్పేశాడు.

వెంకట్రామయ్య నిర్ఘాంతపోయాడు. ఏనాడు కూడా కొడుకు అంత ధైర్యంగా యెదిరించలేదు. అటువంటిది, ఇప్పుడిలా మారిపోయాడంటే, కారణం యేమిటో వూహించుకోడానికి ప్రయత్నించి, విఫలుడయ్యాడు అంత మొండిగా యెదిరించినందుకు కొడుకుపై, పట్టరాని కోపం వచ్చింది. అతని కళ్ళు కోపంతో యెర్రదనాన్ని నింపుకున్నాయి.

"ఏమిట్రా నువ్వంటున్నది?" కోపంగానే అన్నాడు.

"నా అభిప్రాయం, నేను చెప్పాను నాన్నా!" మొహందించుకున్నాడు రాజు కోపోద్రేకంలో వున్న తండ్రి మొహంలోకి చూడ్డానికి అతనికి ధైర్యం చాలిందికాదు.

"నీ నిరాకరణకు కారణాలు?"

"ఆమె నాకు తగిన భార్య కాదని..."

"అంటే? ఆమెలో వున్న లోపాలు యేమిటి?

చదువు తక్కువ, అందం తక్కువ. ఆర్థికంగాకూడా మన అంతస్తుకి సరితూగదు."

వెంకట్రామయ్య చిన్నగా నవ్వేడు. అవి పెద్ద కారణాలుగా అతనికి తోచలేదు.

"పి.యు సి. చదుతోంది. ఇంకేం చదువు కావాలా? అందం అంటావా-నీ దృష్టికి యెట్లా కనిపిస్తుందో గాని,

సలక్షణమైన గృహిణికి కావల్సిన అందం వుంది. ఆడంబరాలు లేకపోయినంత మాత్రాన, అందం లేదని అనుకోకు. ఇకపోతే ఆర్థిక అంతస్తు చూడ్డం అనవసరం. ఎందుకూ అంటే, దానికి యింక ఎవరున్నారు? పెద్దదిక్కును నేనే! అయినా, యెదుటివారి ఆర్థిక సంపద మన కెందుకు? మన సంపద మనకి చాలు. మీ అత్తయ్యకి నేను వాగ్దానం చేశాను. అరమరికలు లేని సంబంధం. నిరాకరించకురా రాజూ! కనీసం, నా తృప్తికోసం అంగీకరించు" సౌమ్యంగా అన్నాడు. అది ఒక విధంగా ప్రాధేయత అనిపించుకొంటుంది కూడా.

రామరాజు యిరుకున పడ్డాడు. ఒక వేపు తండ్రి ప్రాధేయతకు లొంగిపోతున్నాడు; మరొక వేపు, తన ప్రేమదేవతకు అన్యాయం చేయ్యాల్సి వస్తుందేమోనని కుమిలిపోతున్నాడు. ఎంత ఆలోచించినా, సుశీలను వివాహం చేసుకొనేందుకు, అతని మనస్సు అంగీకరించడం లేదు. నిజానికి, సుశీలపట్ల అతనికి నిరసన లేదుగా! ప్రేమించలేని ఒక బలహీనత వుంది. బహుశా, ఆ బలహీనత వెనుకగల కారణం, జలజే అయ్యుంటుంది.

"మీ తృప్తికోసం, యింకేం చెయ్యమన్నా చేస్తాను గాని, యీ విషయంలో మాత్రం, నన్ను బలవంతం చెయ్యకండి నాన్నా!"

వెంకట్రామయ్య; బాధగా నిట్టూర్పు విడిచాడు.

"ఈ వయస్సులో నన్ను తృప్తిపరచే విషయం,

యింకోహటివుండదురా! నీ బాధ్యతవలెనే, సుశీల బాధ్యత కూడా నా మీద వుందన్న విషయాన్ని మర్చిపోకు. దూరంగా ఆలోచించు."

"సుశీల బాధ్యత మీమీదే వుందన్న విషయాన్ని నేనూ కాదనను నాన్నా! కాని, మీ బాధ్యతను నిర్వర్తించుకునే పద్ధతి యిది కాదేమో కాస్త ఆలోచించండి. సుశీలకు మరో సంబంధాన్ని చూసి, మీ బాధ్యతను తీర్చుకోగలరు. కాని, నాకు యిష్టంలేని యీ వివాహం జరపడం, బాధ్యతాయుతమైన మీ కర్తవ్యానికి వ్యతిరేకమోనని నా అభిప్రాయం."

ఎంత చెప్పినా, కొడుకు ఒక మార్గానికి రాకపోతున్నందుకు, వెంకట్రామయ్యకు కోపం వచ్చింది. అతని కనుబొమలు ముడివడ్డాయి ప్రయత్నం మీద, కోపాన్ని అరికట్టుకొన్నాడు. తన నిస్సహాయతకు నిదర్శనంగా ఓ వేడి నిట్టూర్పు విడిచాడు.

"సరేలేరా! నిన్ను బలవంతపెట్టడం, నా అభిప్రాయం కాదన్న విషయం నువ్వు అర్థంచేసుకోవడం, మంచిది. ఇక నువ్వు వెళ్ళు" అన్నాడు నిష్ఠూరంగా.

రామరాజు వుపేక్షించకుండా లేచి తన గదివేపు దారితీశాడు.

వెంకట్రామయ్య, బరువుగా శ్వాస విడిచి కుర్చీలో వెనక్కి చేరబడ్డాడు. కొడుకు తీరు, అతనికి యెంతో బాధ కలిగించింది. వాడు ఆ విధంగా నిరాకరిస్తాడని, తాను కలలో కూడా వూహించలేదు. నిజానికి, వాడు ఈ నిరాక

రించడానికి బలవత్తరమైన కారణం ఏదో వుంటుందనిపించింది కూడాను. వాడు యేదో ప్రేమ వ్యవహారంలో యిరుక్కొని వుండచ్చునను కున్నాడు. లేకపోతే, సుశీలను వివాహం చేసుకుందుకు యిష్టపడకపోవడ మేమిటి? ఇప్పుడు తను ఏంచెయ్యడం? సుశీలను మరొకరికిఇచ్చి వివాహం చెయ్యడమా? లేక ఏదో ఓ విధంగా రాజు మనసు మార్చి, ఆమెను వాడికే కట్టబెట్టడమా? ఆలోచించాడు. ఏంచెయ్యడమో, నిర్ణయించుకోలేని విషమస్థితి అది. బుర్ర వేడెక్కిపోయింది. ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. అక్కణ్ణించి విసుగ్గాలేచి గదిలోకిపోయి, మంచంమీద ఒరిగాడు. నిద్ర పట్టలేదు. మెదడునిండా ఆలోచనలే! ప్రశాంతంగా జీవితాన్ని సాగించవల్సిన ఆ వయసులో, తనకి యెందుకు ఇన్ని సమస్యలు యెదురవ్వాలి? తనలో తనేప్రశ్నించు కొన్నాడు జవాబు యెవరిస్తారు?... తన దురదృష్టానికి, తననే నిందించుకొన్నాడు. అంతకుమించి చెయ్యగలిగింది కూడా యేమీ లేదనిపించింది.

## 5

మానవుని సంకల్పాలకూ, భగవన్నిర్ణయాలకూ, యెక్కడా పొత్తు కుదరదేమో! వెంకట్రామయ్య ఆలోచించినవిధంగా జరగలేదు. అతని ఆశలన్నీ, నిరాశలయ్యాయి ఒక సదుద్దేశంతో సాగించిన ప్రయత్నం, మధ్యలోనే ఆగి

పోయింది. సుశీలను తన కోడలుగా చేసుకొంటానని చెల్లెలితో ఓ సారి అన్నాడు. ఇప్పుడు అలా జరక్కుండా, ఆమెను మరో యింటి కోడలుగా పంపితే, చెల్లెలి ఆత్మ యెంతో దుఃఖిస్తుంది. ఆమె ఆత్మకు తృప్తి కలిగించలేక పోతున్నాడు తను. అదీగాక, తను మాత్రం యింక యెన్నాళ్ళు జీవిస్తాడు? ఈ లోకానికీ తనకూ ఋణం తీరి పోయాక, రామరాజు యేకాకి అయిపోతాడు. వాడి మంచి చెడ్డలు చూసేవాళ్ళు యింకెవరున్నారు? వాడి జీవితంలో సుశీల అడుగుపెడితే, ఆ సమస్యే వుండదు. అప్పుడు తను [illegible] పడనవసరం లేదు ఇవన్నీ ఆలోచించే, తను ఈ నిర్ణయానికి వచ్చాడు. కాని, అబ్బాయి యిష్టపడకపోతే ఏం చేయగలడు?

ఈ సమస్య వెంకట్రామయ్యను కలవరపర్చింది. ఎవరితోనూ చెప్పుకోలేక, తనలో తనే కృంగిపోతున్నాడు. సుశీల అతని కళ్ళెదుట పడుతున్నప్పుడంతా అప్రయత్నంగా మొహం దించుకుంటున్నాడు. ఏదో దిగులు, ఏదో బాధ, అతణ్ణి కృంగదీస్తున్నాయి రాత్రింబవళ్ళూ, అతని మెదడు పని చేస్తూనే వుంది. కంటికి నిండా నిద్ర లేదు; సుష్టుగా భోజనం లేదు.

మావయ్యలో ఏదో మార్పు వచ్చిందని సుశీల గ్రహించింది. ఓ రోజు అడిగింది.

"ఏమిటి మావయ్యా! రోజుకి రోజూ నువ్వు నీరసించిపోతున్నావు, సరిగ్గా భోజనం కూడా చెయ్యడం మానే

శావు. రాత్రుళ్ళు నిద్రపట్టక యేదో ఆలోచిస్తూ వుంటావు. నీ మనసులో వున్న బాధ యేమిటో నాతో చెప్పవూ!" ప్రాధేయపూర్వకంగా అంది. ఆమెలో అవ్యక్తమైన బాధ వదో యిమిడి వున్నట్లుగా చెప్పడానికి ఆ కళ్ళల్లో గూడు కట్టిన నీళ్ళే సాక్ష్యం. మావయ్య పరిస్థితికి బాధపడుతోం దామె.

వెంకట్రామయ్య మొహం దించుకొని, నవ్వడానికి వ్యర్థ ప్రయత్నం చేశాడు

వృద్ధాప్యం కదమ్మా సుశీలా! అందుకే సీరసి పోతున్నాను. అరగదేమోనని అధికంగా భోజనం చెయ్యడ మానుకొంటున్నాను. అంతకు మించి వేరే కారణ లేదమ్మా!" అన్నాడు చిన్నగా నవ్వుతూ, తనలో వవిధ మైన బాధ లేదని నిరూపించడానికే ఆ నవ్వు.

"అది నిజంకాదు మావయ్యా! నాతో అబద్ధం చెపుతున్నావు. నీ అంతరాళంలో వదో ఆవేదన దాగివుంది. చెప్పలేకపోతున్నావు. అయినా, నాతో చెప్పడానికేం మావయ్యా! నన్నింత ఆప్యాయంగా, లాలనగా చూస్తు న్నావు నామీద నీకు నమ్మకంలేదా?"

సుశీల మాటలు, వెంకట్రామయ్యని సగం కరిగిం చాయి. నిజం చెప్పేయాలన్నంత మేరకు వచ్చేశాడు. కాని, మళ్ళీ తమాయించుకున్నాడు. ఆ లేత హృదయానికి, హఠా త్తుగా ఘాతం తగిలించడం, అతనికి మనస్కరించ లేదు. గట్టిగా ఓ సారి శ్వాస విడిచాడు.

"నీమీద నాకు నమ్మకం లేకపోవడమేమిటమ్మా? ఇంతకీ నేనేం బాధపడ్డంలేదని చెప్తున్నాగా! అసలు, బాధ పడే అవసరం నాకు లేనిదే!" అనేసి మెల్లగా తప్పుకున్నాడు. సుశీల యింకేమీ అనడానికి సాహసించలేక పోయింది. అయినా, మావయ్య చెప్పింది నిజమని నమ్మలేకపోయిందామె.

♦ ♦ ♦

ఆ రోజు శనివారం—

సాయంత్రం జలజను కలుసుకోవచ్చుననీ తమ వివాహంవిషయంలో చప్పున యేదో నిర్ణయానికి రావటంగురించి ప్రస్తావించవచ్చుననీ తలపోశాడు రామరాజు. అతనిలో అదో విధమైన వుత్సాహం, వురకలు వేసింది.

ఎప్పుడు సాయంత్రం అవుతుందా అని యెదురు చూస్తున్న రాజు, అయిదున్నర కాకముందే బీచ్ చేరుకున్నాడు. జలజ రాకకోసం అతని దృక్కులు ప్రతీక్షించాయి. హృదయం ఆరాటపడింది. ఒంటరిగా ఏ యువతి వస్తున్నా జలజేనని భ్రమపడేవాడు తీరా ఆమె దగ్గరికి రాగానే జలజ కాదనుకొని నిరుత్సాహపడేవాడు. ఇక్కడ రాజు పరిసితి యిలా వుంటే, అక్కడ జలజ పరిస్థితి మరీ అయోమయం తయారయ్యింది.

డాక్టరు రామమోహన్ అయిదు గంటకే, కారు తీసుకుని వాళ్ళింటికి వచ్చాడు. ఆ రోజు అతను మరీ ఉత్సాహంగా కనిపిస్తున్నాడు.

జలజా! ఇవ్వాళ నువ్వు నాతో రావాలి. బ్రిటన్ నుండి డాక్టరు బృందం ఒకటి యిక్కడికి వచ్చింది. వారి గౌరవార్థం, చిన్న పార్టీ యేర్పాటుచేశాను. నువ్వు అక్కడ వుంటేనేగాని ఆ పార్టీకి శోభ రాదనిపించి, నిన్ను తీసుకువెళ్ళడానికి వెంటనే వచ్చేశాను. ముందుగా చెప్పకపోయినందుకు మరేం అనుకోకు. ఒక్కసారి నిన్ను ఆశ్చర్యంలో ముంచాలనే యిలా చేశాను. యెలాగూ డ్రెసప్ అయ్యున్నావు. ఈ డ్రెస్సులో చాలా అందంగా అగుపిస్తున్నావు సుమా! బైలుదేరి పోదాం" గుక్క తిప్పు కోకుండా అన్నాడు మోహన్.

జలజ గుండెల్లో బాంబు పడింది. తను రామరాజుని కలియడానికి వెళ్ళాలని తయారుగా వుంది. తన కోసం, రామరాజు నిరీక్షిస్తూ వుంటాడు కూడాను. కాని ఇప్పుడెలా? మామయ్య పార్టీకి రమ్మంటున్నాడు. ఎటు వెళ్ళడం? ఏమిటీ పరీక్ష!... ఆలోచనలో పడింది జలజ. 'ఏమిటలా ఆలోచిస్తున్నావు జలజా?' అడిగాడు రామమోహన్.

"ఏం లేదు మామయ్యా! నేను స్నేహితురా వెళ్ళాలి. మాట యిచ్చాను; వెళ్ళకపోతే బాగు పార్టీవిషయం, కాస్తంత ముందుగా తెలియ కార్యక్రమాన్ని మార్చుకొని వుందునుగా! చెప్పింది, తప్పించుకుందుకు.

రామమోహన్ చిన్నగా మందహాస "స్నేహితురాలి టికి వెళ్ళడమన్నది. పెద్ద

కాదులే జలజా! రేపు అయినా వెళ్ళవచ్చు. కాని, విదేశం నుండివచ్చిన ఆ డాక్టర్ బృందానికి, రేపు పార్టీ యేర్పాటు చెయ్యడం జరగదుకదా! ఇది గొప్ప ప్రాముఖ్యంగల సన్ని వేశం. వారిని కలుసుకోవడంలో కూడా గొప్పతనం వుంది. ఇటువంటి అవకాశాలు, అందరికీ రావు. వేళవుతోంది. నువ్వు జాప్యంచేస్తే లాభంలేదు మనకోసం వేచివుంటారు. బైలుదేరు వేగిరం" సుళ్ళీ అన్నాడు.

కాస్త దూరంలో కూచుని పేపరు చూసుకుంటున్న సుబ్బారావు, వీళ్ళ సంభాషణ విని లేచివచ్చాడు. కళ్ళ జోడుతీసి ఓసారి పంచెతో శుభ్రంచేసి తగిలించుకున్నాడు.

"మోహన్ చెప్పింది నిజం అమ్మాయ్! ఇటువంటి అవకాశాలు అందరికీ లభ్యంకాదు. ఇది ఒకవిధమైన అదృష్టమే. అక్కడికి అంతా పెద్దవాళ్ళే వస్తారు. వాళ్ళందరితో పరిచయం చేసుకునే అవకాశం నీకు కలుగుతుందంటే, సంతోషించక, అవకాశం జారవిడుచుకుంటా వెందుకు! స్నేహితురాలింటికి రేపు వెళ్ళవచ్చునులే" అన్నాడు సుబ్బా... బహుశా కూతురు రామరాజుని కలిసేందుకే వెళ్ళ ...దేమోనన్న సందేహం కూడా కలిగింది సుబ్బా...

...దికాదు నాన్నా..." యేదో చెప్పాలనుకుంది సుబ్బారావు చెప్పనివ్వలేదు.

...రేమీ చెప్పకు. మావయ్యతో వెళ్ళిరా. వెళ్ళ ...వ్వే అంటావు-వెళ్ళకపోతే యెంతో సదవకా...డు చుకునే దాన్నని! బైలుదేరు."

తండ్రి అలా అనడంతో, మరింకేమీ చెప్పలేక పోయింది జలజ. లోలోన ఆమెకు కోపం ప్రజ్వరిల్లుతూ వుంది. కాని, యేం చెయ్యగలదు? ఎవరిమీద ఆ కోపాన్ని ప్రదర్శించగలదు? పరిస్థితికి పూర్తిగా కట్టుబడిపోయింది. తన రాకకోసం, యెదురు తెన్నులు చూసే రాజు, ఆమె కళ్ళల్లో లీలగా మెదిలాడు. ఎంతో బాధపడింది. ఆమె నయనాలు ఆర్ద్రమయ్యాయి కూడా. అతి ప్రయత్నంమీద సంబాళించుకొంది.

"అప్పుడే ఆరు కావస్తోంది. పద జలజా! ఇటువంటి సందర్భాల్లో ఉత్సాహంగా ముందుకు వురకాలిగాని, ఇలా యెవ్వరూ బ్రతిమాలించుకోరేమో!" తొందర చేశాడు రామమోహన్.

తండ్రిచేత మరోసారి మందలించబడ్డా గుష్టంకై పోయింది జలజకు. రామమోహన్ వెంటనడిచింది. రామమోహన్ వుత్సాహంగా కారు రెక్క తీసి పట్టుకుంటే, జలజ లోపలికిపోయి కూచుంది. ఆమె మొహంలో ఏమంత కళ లేదు. మోహన్ స్టీరింగుదగ్గరకూచుని, కారుని స్టార్టు చేశాడు.

కారు మెల్లగా కదలి, తృటికాలంలో ముందుకు సాగిపోయింది. సుబ్బారావు, ఆ కారువేపు చూస్తూ తృప్తిగా నవ్వుకొన్నారు. "ఎంత అందమైన జోడీ! రామమోహన్ ముందు, రామరాజు యెందుకు పనికొస్తాడు! అన్ని విధాలా తీసికట్టే!" అనుకొన్నాడు మనసులో.

◆ ◆ ◆

6)

పార్టీ దివ్యంగా జరిగింది. జలజను అందరికీ పరిచయం చేశాడు రామమోహన్. ఆమెను అంతా అభినందించారు. విదేశీ డాక్టర్ల బృందంవారు జలజను అభినందిస్తూ 'Wish you both a happy life' అని దీవించారు జలజ వారి మాటలకు విస్తుపోయింది. మావయ్య, తనని వారికి ఏ విధంగా పరిచయం చేసుకున్నాడో అర్థంకాలేదు. లేకుంటే వాళ్ళలా అపోహ పడ్డారేమో! తామిద్దరం భార్యాభర్తలం కాదని వెల్లడి చెయ్యాలన్న వుద్రేకం వచ్చిందికాని, సమయం, సందర్భం గుర్తులో ఉంచుకొని, తమాయించుకొంది.

కాస్సేపటి తర్వాత, జలజను కారులో తీసుకెళ్ళాడు రామమోహన్. కారు మెల్లగా సాగిపోతూవుంటే, యెంత [illegible]ంచో మనసులో రగులుతూ వున్న సందేహాన్ని [illegible]గి తెలుసుకోవా లనిపించింది జలజకు.

"మావయ్యా! నేను నీ భార్యనని వాళ్ళెలా ఊహించారు?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను జలజా!

"నువ్వేమీ చెప్పలేదా!"

"అబ్బే, అటువంటి దేమీ జరగ లేదే?"

వాళ్ళ అభిప్రాయం తప్పు అని అప్పుడే వెల్లడి చెయ్యాలనుకున్నానుగాని, సభ్యతగా వుండదని తమాయించుకొన్నాను"

"ఏం? నన్ను పెళ్ళిచేసుకోవడం నీకు యిష్టంలేదా?" సూటిగా ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు.

"ఇప్పుడా విషయం అప్రస్తుతం మావయ్యా!"

ఉత్సాహంతో సుబ్బారావు మొహం వికసించింది. 'ఆ! అదీ...యింకా ఆలోచించు. ముఖ్యంగా స్త్రీకి కావల్సిందేమిటి? తన భర్త గౌరవప్రతిష్టలు...ఆయన వున్నతి. వాటితోపాటు తనకి ఆపాదించే అంతస్థు; అంతేగా! కూపస్థమండూకాల్లా యెల్లకాలం యింట్లో కూచుని, హాయిగా వున్నాం, హాయిగా తిన్నాం, అనుకుంటే-అది జీవితం అనిపించుకోదు. పైగా నువ్వు చదువుకున్నదానివి. నీ చదువుకి తగ్గ అంతస్థు కావాలని నీకు మాత్రం మనసులో యెక్కడో ఓ కోరిక వుండదూ? తప్పకుండా వుంటుంది. సమయం దొరికింది గాబట్టి, చిన్న మాత్ర వేశాడు.

జలజ మాట్లాడలేదు. ఆలోచనలో పడింది. ఆ హృదయంలో రామరాజు మెదిలాడు ఒకటి రెండు రామమోహన్ కూడా గుర్తుకు రాలేకపోలేదు. ఒకవిధమైన సంఘర్షణ ఆరంభమయింది. ఆ తాకిడికి లేక పోయింది తండ్రి సమక్షంలో యింక వుండలేక గదికి నిష్క్రమించింది.

సుబ్బారావుకి, కూతురిలో యేదో నూతన పరిణామం కనిపించినట్టయ్యింది. అలాగే నవ్వుకున్నాడు.

# 6

ఇల్లు చేరుకున్న రామరాజు, నేరుగా తన గదిలోకి నడిచాడు. వాలుకుర్చీలో చేరబడి, అలలుగా వస్తున్న ఆలోచనల్ని అరికట్టడానికి ప్రయత్నించాడు కాని, లాభంలేక పోయింది.

సుశీల వచ్చింది.

"వడ్డించనా బావా !" మెల్లగా అంది.

"వద్దు" ఆమెకేసి చూడకండానే ముక్తసరిగ జవాబిచ్చాడు. ఆ స్వరంలో కాస్తంత కోపం ధ్వనించింది. సుశీలకు అర్థం కాలేదు.

"ఇప్పుడే తొమ్మిది దాటింది. భోజనం చేసి, కాస్సేపు నిద్ర తీసుకోకూడదు బావా !"

రామరాజు, ఆమెకేసి చర్రున చూశాడు. అతని మొహం రాగరంజితమవ్వడం, సుశీల గమనించింది. "నువ్వు నాకేమీ హితవు చెప్పనవసరం లేదు. ఇక నువ్వు వెళ్ళు సుశీలా!" మెల్లగా కసిరినట్టుగనే అన్నాడు.

సుశీల అభిమానం, దెబ్బతిన్నదనే చెప్పాలి. అకారణంగా తనమీద కోపం ప్రదర్శించడం దేనికని బాధపడింది. ఆమె కళ్ళు నీళ్ళపర్యంతమయ్యాయి మారుమాట చెప్పకుండా, అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

"అమ్మాయ్ సుశీలా !" వెంకట్రామయ్య కేక

వేశాడు. అంతలోనే అతనికి దగ్గుతెర వచ్చింది. సుశీల అక్కడికి వెళ్లింది.

"పిల్చావా మావయ్యా !"

"ఔనమ్మా ! అబ్బాయి భోజనం చేశాడా !"

"ఇప్పుడే భోంచేశాడు మావయ్యా !" తడబడకుండా చెప్పింది. భోజనం చెయ్యలేదని చెబితే, ఆ ముసలి ప్రాణం బాధపడుతుందని అభిప్రాయపడింది.

"అయినా మావయ్యా, యీ విషయాలన్నీ మీ కెందుకు చెప్పండీ అసలే మీ ఆరోగ్యం బాగుండ లేదు. ఈ పరిస్థితిలో మెదడునిండా ఆలోచనలు పెట్టు కుండా, నిశ్చింతగా వుంటేనే త్వరలో కోలుకోవడానికి వీలుం టుంది."

వెంకటామయ్య పొడిగా నవ్వేడు. "నిశ్చింతగా వుండటం, యెల్లా సాధ్యపడుతుందమ్మా సుశీలా! ఎదురుగా వున్న సమస్యల్ని దూరం చేసుకోనూ లేను; వాటిని పరిష్క రించుకోనూ లేను. ఈ సంఘర్షణలో నలిగిపోతూన్న నాకు 'నిశ్చింత' యెక్కణ్ణించి వస్తుంది చెప్పు?" బాధగా చెప్పుకు పోయాడు.

మావయ్యమీద అంతులేని జాలికలిగింది సుశీలకు.

"నువ్వేదో బాధతో నలిగిపోతున్నావని, యింతకు ముందే నేను పసిగట్టాను మావయ్యా! అప్పట్లో నేను అడి గితే, యేమీలేదని చెప్పి నన్ను ఏమార్చి పెట్టావు. ఆ సమ స్యలు యేవిటో యిప్పుడైనా నాకు చెప్తావా మావయ్యా?" అంది.

వెంకటాద్రియయ్య, చిన్నగా నిట్టూర్పు వదిలాడు. తను తొందరపడి, సుశీలతో ఆ విధంగా చెప్పినందుకు పశ్చాత్తాప పడ్డాడు.

“యివన్నీ నీకెందుకులే సుశీలా! వెళ్ళి నీపని చూసుకో!” ఆ ప్రస్తావనకు స్వస్తిచెప్పే విధంగా ముగించాడు. సుశీల అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

సుశీలకు ఆయింటి పరిస్థితులు బొత్తిగా అర్థంకావడం మామయ్య, యేదో వ్యథతో సతమతమౌతూ, ఆరోగ్యాన్ని కోల్పోతూవుంటే, బావ అంతుతెలీని కారణాలతో ఒక విధమైన వుద్రేకానికి లోనవుతున్నాడు. ఈ పరిణామాలకు ప్రముఖ కారణాలేవిటో, యెంత ఆలోచించినా ఆమె వూహకి అందడంలేదు. ఈ ఆలోచనలతో చాలాసేపటి వరకు వంటగదిలో కూచుండిపోయింది సుశీల

కుర్చీలో కూచుని ఆలోచిస్తున్న రామరాజు, యేదో గుర్తుకు వచ్చి, చప్పున లేచి టేబిలు దగ్గరకు వెళ్ళాడు. విసురుగా లెటరుపాడ్ తీసుకొని కలం పట్టుకున్నాడు. అతని కళ్ళు, చింతనిప్పుల్లా కణకణలాడుతూ వున్నాయి రాయడం ప్రారంభించాడు. ఆ ఉద్రేకంలో యేం రాయాలో తోచక రెండు మూడు కాగితాలు చించివేశాడు. చివరికి ఓ వుత్తరం రాయగలిగాడు. ఉత్తరం పూర్తిచేసి, మళ్ళీ ఓసారి చదువుకున్నాడు.

'జలజా !

హూ! నిన్ను 'జలజా' అని సంబోధించడం అనవసర మనిపిస్తుందిప్పుడు. అంతకంటె చక్కని సంబోధన, సరైన సంబోధన 'జలగా' అని. నీ కంటె, నీటిలో జీవించే జలగ వేయిరెట్లు నయమనిపిస్తుంది. ఇన్నాళ్లూ, నన్ను ప్రేమిస్తు న్నట్టు నటించి, మోసగించావు. నిన్ను నమ్ముకున్న నన్నూ, నా జీవితాన్ని నాశనం చేశావు. నీ కోసం, మా నాన్న గారితో విరోధం తెచ్చుకున్నాను. నేను నిన్ను మనసారా ప్రేమించి నందుకు, తగిన ప్రతిఫలాన్నే అందించావు. ఒకందుకు నేను సంతోషిస్తున్నాను. మన జీవితాన్ని ఒక బంధం ముడిపెట్టక ముందే, నీ నిజరూపం బైటపడింది. అది నా అదృష్టమే అనుకోవాలి. నీ అందం వెనుక యింత హాలాహలం వుంటుందని యెప్పుడూ వూహించ లేదు కూడాను. కాని, ఒక్క విషయం చెప్పాలని వుంది. ఇక ముందయినా, నావంటి అదృష్ట హీనుల జీవితాలతో చెలగాటమాడ వద్దని కోరుకుంటున్నాను. నువ్వయినా, మీ మావయ్యతో సుఖంగా వుండడమే నేను కాంక్షించేది. అదృష్టమున్నది వుంటే, మళ్ళీ యెప్పుడో కలుద్దాం...

— రామరాజు"

ఉత్తరాన్ని కవరులో పెట్టి, అంటించేసి అడ్రసు రాశాడు. అప్పుడుగాని, అతని మనసుకి వూరట కలుగ లేదు. గడియారం పదకొండు కొట్టింది. పరిసరాలు ప్రశాంతంగా వున్నాయి. మంచంమీద ఒరిగి, నిద్రపోవడానికి ప్రయత్నిం

చాడు. కాని, చాలాసేపటి వరకూ నిద్రపట్టలేదు. మెదడంతా ఆలోచనల మయం. మనస్సంతా క్రోధాగ్నిమయం. ఇంక యెలా నిద్ర పడుతుంది?

... ... ...

మరుసటిరోజే నెలరోజులు శలవు తీసుకొని యింటికి తిరిగి వచ్చాడు రామరాజు ఆఫీసు నుంచి ప్రస్తుతం తనకి స్థల మార్పు అవసరమేమో ననిపించిందతనికి. నేరుగా వచ్చి తండ్రి మంచం ప్రక్కన నిల్చున్నాడు.

"నాన్నా! నేను విజయవాడ వెళ్తున్నాను" అన్నాడు మెల్లగా.

వెంకట్రామయ్య ఆశ్చర్యపోయాడు, కొడుకు హఠాత్ప్రయాణానికి.

"ఇప్పుడెందుకురా? ఇంత హఠాత్తుగా బైలుదేరుతున్నావేమిటి?"

"మా స్నేహితులంతా బైలుదేరుతున్నారు నాన్నా! అలా వెళ్ళి చిన్నాన్నగారింట్లో కొద్దిరోజులు గడిపి రావాలని వుంది. ఎన్నాళ్ళనించో వెళ్ళలేదు కదా!"

వెంకట్రామయ్య, క్షణం మాట్లాడలేక పోయాడు తన పరిస్థితి కళ్ళారా చూస్తూ కూడా వాడు వూరు విడిచి వెళ్తానంటుంటే, వద్దని యెలా చెప్పగలడు? అతని హృదయంలో అంతులేని బాధ మెదిలింది కళ్ళు నీళ్ళపర్యంతమయ్యాయి

"సెలవు పెట్టావా?"

"ఔను నాన్నా; నెలరోజులు సెంతునయ్యింది. అయినా, వేగిరం వచ్చేసేటందుకే ప్రయత్నిస్తాను. మీ రేం కంగారు పడకండి."

'కంగారు పడకండి' అని యెంత తేలిగ్గా అనేస్తున్నాడు ... అనుకున్నాడు వెంకట్రామయ్య మనసులో. వా డిలా మారిపోతాడని అతను అనుకోలేదు.

"సరే! వెళ్ళిరా!" అన్నాడు బాధగా నిట్టూరుస్తూ. తను అంగీకరించక పోయినా, వాడు వెళ్ళి తీరుతాడని తెలుసు. అందుకే, ఆటంక పర్చలేదు.

ఆ సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌కే ప్రయాణ సన్నాహాలు చేశాడు రామరాజు. తన ప్రయాణం విషయం, సుశీల కూడా చెప్పలేదు. ఆమెతో చెప్పడం, అంత అవసరం అనుకోలేదు. అయితేనేం – వుండబట్టలేక, సుశీలే అడిగింది.

"మళ్ళీ యెప్పుడు తిరిగివస్తావు బావా ?"

రామరాజు, సుశీలకేసి యెర్రగా చూశాడు.

"ఏం? నీతో ఆ విషయం చెప్పడం, అంతఅవసరమా?" అన్నాడు కటువుగా.

సుశీల మనస్సు చివుక్కుమన్నది. "అవసరమని, నేను అనలేదు బావా! అది, నా అభిప్రాయం కూడా కాదు. నన్ను అపార్థం చేసుకుంటున్నావు నువ్వు యెక్కడికి వెళ్తున్నావో, యెందుకు వెళ్తున్నావో, తెలుసుకోవాలన్న ఆసక్తి, నాలో వున్నా, ఆ విషయాలు నాకు అవసరమనే నా ఆసక్తిని అణచుకున్నాను కాని, మావయ్య ఆరోగ్య

స్థితి చూసి, నీ రాక గురించి అడక్కుండా వుండలేక పోయాను. అది తప్పే అయితే, క్షమించు..." అంది.

ఎంత కోపంగా వున్నా, అటువంటి మాటలు వింటే, యెవరు చల్లబడరు? రామరాజు కూడా, ఆ పరిణామానికి అతీతుడు కాలేకపోయాడు. తను తొందర పడినందుకు బాధ పడ్డాడు. "సెలవు మాత్రం నెలరోజులు శాంక్షనయ్యింది. వీలు చూసుకొని, వేగిరం వచ్చేందుకు ప్రయత్నిస్తాను..." మెల్లగా అన్నాడు.

"నెలరోజులే!" ఆశ్చర్యపోయింది. "మావయ్య రోజుకీ యెలా నీరసించి పోతున్నాడో, చూస్తూనే వున్నావుగా బావా! ఎందుకో, నాకు భయమేస్తోంది. ఇటువంటి సమయంలో నువ్వూ లేకపోతే, యెలా? అందుకే అడిగాను"

"నువ్వేమీ భయపడనవసరం లేదు. నీ ఆరాటానికి, అర్థం లేదు. నాన్న రెండు మూడు దినాల్లో కోలుకుంటారు నా అడ్రసు టేబిలు మీద పెట్టి వెళ్తున్నా! అవసరమైతే వుత్తరం రాయి. అంత అర్జంటయితే, టెలిగ్రామ్ పంపించు."

సుశీల ఓ నిట్టూర్పు విడిచి అక్కణ్ణించి కదిలింది. ఇంకేం మాట్లాడగలదు మరి?

ఆరోజు ఎక్స్‌ప్రెస్‌కి వెళ్ళిపోయాడు రామరాజు.

... ... ...

# 7

సాయంత్రపు నీరెండ, రకరకాల పుష్పాలపై బడి, వింత రంగుల్ని ప్రతిఫలిస్తోంది. చల్లని పిల్ల వాయువులు వినిపిస్తూన్న సంగీతానికి తన్మయత్వం పొంది, పూల మొక్కలు తలలూపుతున్నాయి.

ఓ మల్లెపొద దగ్గర నుంచుని, జలజ అంతులేని ఆలోచనలు సాగిస్తోంది. ఆమె మొహం బాగా వాడి పోయింది. కళ్ళు లోతుగా పోయాయి. ఓసారి చేతిలో వుత్తరాన్ని చూసింది ఆమెకు యెక్కడలేని దుఃఖమూ వచ్చి, వెల్లువలా ప్రవహించసాగింది. ఆ ప్రవాహానికి, కన్నీటి బిందువులు చెక్కిళ్ళమీదకు జాలువారినయ్. రామరాజు యెంత తొందర పడ్డాడు?... అనుకుంది. బహుశా, తను రామమోహన్‌తో ఆరోజు రావడం చూసి వుంటాడు. కాని, నిజం తెలుసుకోవడానికి యిసుమంతయినా ప్రయత్నించ లేదు. అతడు యింత తొందరపడే మనిషని యింతవరకూ తను గ్రహించలేక పోయింది. తన మనసు తెలిసి కూడా, రామరాజు యెందుకిలా అపోహపడి, నిందిస్తున్నాడో, అర్థం కాలేదు రామమోహన్‌తో తనకి లేని సన్నిహిత పరిచయాన్ని, వున్నట్టుగా భ్రాంతి పడిన రామరాజు తొందర పాటు, యెప్పటికైనా తనలో అశాంతిని రేకెత్తిస్తుంది. తప్పదు. అంతటి అసూయా పరుణ్ణి, అపోహగలవాణ్ణి చేబట్టి, తనుమాత్రం యేం సుఖపడుతుంది? తనని యెంత నీ

నీచంగా సంబోధించాడు వుత్తరంలో ? తనకి మాత్రం ఆత్మాభిమానం లేదూ ? తనుమాత్రం వుప్పూ, కారం, తినడం లేదూ?...ఇవన్నీ ఆలోచిస్తుంటే, జలజలో ఒక విధమైన చైతన్యం తలెత్తింది. చెమ్మగిల్లిన కళ్ళు, ఒత్తుకుంది. తను యెందుకు బాధపడ్డం?... తనలో తనే సమాధానపడి, సంబాళించుకుంది. చేతిలో వున్న వుత్తరాన్ని ముక్క-ముక్కలుగా చింపివేసింది అప్పుడుగాని, ఆమె మనసుకి శాంతి లభించలేదు.

కారు ఆగిన చప్పుడయ్యింది. వెనుదిరిగి చూసింది. రామమోహన్, లోపలికి వస్తున్నాడు, బూడిద రంగు సూట్లు, యెర్రని నెక్టైతో అతడు, యెంతో హుందాగా, అందంగా అగుపించాడు జలజకు రామమోహన్. ఆమెమనసుని చూరగొనడం, అదే ప్రథమం.

"హలో జలజా ! ఒంటరిగా యీ అందమైన ప్రకృతిని యెట్లా ఆనందించ గలుగుతున్నావ్?" మందహాసంతో అంటూ దగ్గరగా వచ్చాడు

"మరేం చెయ్యను మావయ్యా ! ఇంట్లో యెంత సేపు కూర్చున్నా, వుబుసు పోవడం లేదు..." నవ్వుతూనే జవాబిచ్చింది. క్షణం క్రితం ఆమె మనసుని ఆక్రమించుకున్న నిస్పృహ పటాపంచలయ్యింది ఆమె మాటల్లో. యెనాడూ వ్యక్తం కాని ప్రసన్నత ప్రస్ఫుట మయ్యింది రామమోహన్‌కి. అతని ఆనందానికి అవధుల్లేక పోయాయ్.

"మంచి యింగ్లీషు పిక్చరు అవుతోంది. . వెళ్దామా?" కాలాన్ని జారవిడుచుకో దల్చలేదు రామమోహన్.

యం, యెంతో తేలికపడింది కూతురు భవిష్యత్తు, యింక తను చింతించ నవసరం లేదు.... అను కున్నాడు.

8

జలజ జీవితపథం ఒక మలుపు తిరిగింది. ఆమె మనస్సు యిప్పుడు పూర్తిగా రామమోహన్ పరమయింది. అప్పుడప్పుడూ, రామరాజు జ్ఞప్తికి వస్తున్నా, అతణ్ణి యిట్టే మర్చిపోగలుగుతోంది. అతనిమీద యేర్పడ్డ ద్వేషమూ, కోపమూ, ఆమెలో అంతరించలేదు. రాజు యిప్పుడు యెక్కడ వున్నాడో, యేం చేస్తున్నాడో, తెలుసుకుందుకూడా ప్రయత్నించలేదు. ఎంత విచిత్రమైన మానవ స్వభావాలు! ఒక్కొక్కప్పుడు పొరపాట్లు చిన్నవే అయినా, జీవితాల్ని యెంతగా మార్చివేస్తాయి?

ఆరోజు బహిరంగ సభ యేదో జరుగుతూ వుంటే, సుబ్బారావు అక్కడికి వెళ్ళాడు. జలజకి యేమీ తోచడం లేదు. పూలతోటలో వున్న సిమ్మెంటు బల్లమీద కూచుని, చల్లగాలి పీలుస్తోంది. వెన్నెల కాంతిలో పూల మొక్కలు, అందాల్ని విరజిమ్ముతున్నాయి. ఆ వాతావరణం, ఆమె హృదయానికి వూరట కలిగించి, వుల్లాస

పర్చింది. ఒక్కసారి ఆమె ఆలోచనలు రామమోహన్‌ పోయినయ్‌. 'మావయ్య వస్తే యెంత బావుణ్ను! సరదాగా కబుర్లు చెప్తూకుంటే, యిట్టే కాలంగడిచిపోను... అనుకుంది.

ఆమె భావనకి యేదో బలమైన శక్తి వున్నట్టుగా, రోడ్డు మీద కారాగిన చప్పుడు వినిపించింది. అది రామమోహన్ కారేనని ఆమెకి తెలుసు ఆమె హృదయం, ఆనందామృతంతో నిండింది. పరవశం జెంది, శిల్పసుందరిలా అచేతనంగా కూచుండిపోయింది. ఆమె మెదడులో యెన్నో భావాలు! హృదయంలో యెన్నో ఆకాంక్షలు.

రామమోహన్, లోపలికి వస్తూనే పూలతోటకేసి దృష్టిని సారించాడు. ఆ వెన్నెల కాంతిలో, జలజ నిజంగా శిల్పసుందరిలానే అగుపించింది. అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి, ఆమె కళ్ళు మూశాడు. జలజ శరీరం పులకరించింది. అవ్యక్తమైన అనుభూతిని పొందింది. సిగ్గుపడి, రెండు చేతులతోనూ, అతని బలమైన చేతుల్ని తప్పించుకుంది. రామమోహన్ పకపక నవ్వుతూ, పక్కనే వచ్చి కూచున్నాడు ఆనందంతో కూడిన సిగ్గుతో మొహం దించుకుంది జలజ. చంద్రుడు, వారి అనురాగం చూసి, ఫక్కున నవ్వి, మబ్బుల చాటుకి పోయాడు.

"ఒంటరిగా కూచుని, యెవరిగురించి తలపోస్తున్నావో, చెప్పనా జలజా?" అన్నాడు రామమోహన్.

"చెప్పు చూద్దాం..." చిలిపిగా అంది.

"నా గురించే!"

"కాదు..."

"అబద్ధ మాడకు..."

"ఎలా పసిగట్టావు ?"

"నా మనస్సు చెప్పింది....నిజం చెప్పు..."

"ఔను మావయ్యా! నీ వూహా సరైనదే! ఈ చల్లని, చల్లని వెన్నెల్లో, చల్లని పిల్లవాయువులు వీస్తున్న యీ పూదోటలో, నువ్వు నా సరసను వుంటే, యెంత హాయిగా కాలం గడిచిపోతుంది...? అని తలపోస్తున్నాను... ఇంతలో నువ్వే వచ్చేశావు" సిగ్గుతో మెల్లగా [illegible] గలిగింది. తన మనోభావాన్ని చెప్పకూడదనే మె[illegible] అనుకుంది. కాని, చెప్పకుండా వుండలేక పోయింది.

రామమోహన్, ఆమె మొహంలోకి సూటిగా చూసి, మందహాసం చేశాడు జలజను ఆకర్షించినందుకు, తనలో తనే వుప్పొంగి పోయాడు.

"నిజం చెప్పాలంటే, నీకు దూరంగా వుండటం, నాకూ సాధ్యం కావడం లేదు జలజా! నా హృదయాన్ని పూర్తిగా నువ్వే ఆక్రమించుకున్నావు. నా కళ్ళల్లో కను పాపగా మెదులుతున్నావు. ఇంకెన్నాళ్ళీ దోబూచులాట. అందుకే, మన వివాహం, వీలయినంత త్వరలో యేర్పాటు చేసేలా చూడమని శాంతతో చెప్పాను మరి, నీ అభిప్రాయం యేమిటీ!"

జలజ, జవాబు చెప్పలేదు. పెళ్ళి,అనే పదం వినేసరికి' మొహం సిగ్గుతో యెరుపెక్కింది. ఆ సిగ్గును వ్యక్తం

చెయ్యడం యిష్టం లేకగా మోసు – ముసిముసి నవ్వులు ఒలక బోస్తూ, రెండు చేతులతో మొహాన్ని కప్పేసుకుంది.

రామమోహన్ నవ్వేడు.

«నిజం సుమా! నా తెలివి తక్కువతనం కాకపోతే, నిన్ను యీ విషయం అడగడం యేమిటి? అసలే, ఆడవాళ్ళకి సిగ్గు ఓ అలంకారమన్నారు. ఆ అలంకారం లేకపోతే యెట్లా? ఆఁ... అన్నట్టు, ఒక్క విషయం అడగాలని వుంది. కోపగించుకోవు గదా ?" లాలనగా అడిగాడు.

"ఏమిటి ?" ఆసక్తితో, మొహం మీది నుండి ... తీస్తూ అడిగింది.

"రామరాజుని అంతగా ప్రేమిస్తూ వుండేదానివి కదా, ఒక్కసారి అతణ్ణి మర్చిపోగలిగి, నీ ప్రేమను నా వేపు యెట్లా త్రిప్పగలిగావు ? ఈ ప్రశ్న నిన్ను యే విధంగా బాధ పెట్టినా, యిబ్బంది కలిగించినా, జవాబు చెప్పొద్దు. కేవలం, తెలుసుకోవాలన్న కుతూహలం కొద్దీ అడుగుతున్నాను గాని, యెవర్నీ కించపర్చాలనే దురుద్దేశంతో కాని, నీ హృదయపు లోతులు తెలుసుకోవాలని గానీ, కాదు. నా మాటల మీద నీకు నమ్మిక వుంటేనే చెప్పు..."

జలజ, కాస్తంత కలవరపడింది. మావయ్య అటువంటి ప్రశ్న వేస్తాడని, ఆమె యెప్పుడూ వూహించలేదు. రామమోహన్ కనిపెట్ట లేదు గాని, ఆమె ముఖ కవళికలు మారాయి. ఏది యేమైనా జవాబు చెప్పక తప్పదనుకుంది. మెల్లగా శ్వాస విడిచింది. ఇదో క పరీక్షగా భావిం

గాని, యెందుకో మరి-కొంత నిరుత్సాహం ఆమెలో చోటు చేసుకుంది.

"మావయ్యా! నా మనసు విప్పి నీతో చెప్పడం, నా కర్తవ్యంగా భావిస్తున్నాను. నేనూ రామరాజూ, ప్రగాఢంగా ప్రేమించుకున్నమాట వాస్తవమే! అయితే, నిజమైన ప్రేమలో, అపోహకూ, అసూయకూ, అపనమ్మకానికీ తావుండకూడదు. కాని, రామరాజు ఏటికి అతీతుడు కాలేక పోయాడు. అంటే, అతని ప్రేమలో పరిపూర్ణత్వం లేని మాట! నా ప్రవర్తనను శంకించాడు..." కా... బాధపడుతూ అంది.

"అంటే, యే విధంగా శంకించాడు?"

"నువ్వు, ఆరోజు పార్టీకి రమ్మని బలవంతం చేసా... జ్ఞాపకం వుందా?"

"ఔనూ! అయితే?"

"ఆ రోజు మేం, బీచ్‌లో కలుసుకోవాలని నిర్ణయిం... కున్నాం. ఏ పార్టీకి రాకండా తప్పించుకోవాలని, నేను యెంత ప్రయత్నించానో, నాకే తెలుసు. కాని, ఫలితం శూన్యం. నీతో పార్టీకి వచ్చాను. పార్టీ పూర్తయ్యాక యిద్దరం కారులో వచ్చాం. బహుశా మనల్ని అప్పుడు చూసి వుంటాడు రామరాజు. నన్ను అపార్థం చేసుకున్నాడు. మానవ సహజమైన అపోహకు గురయ్యాడు. కాని నిజాన్ని తెలుసుకునేందుకు యే ప్రయత్నమూ చెయ్యలేదు. నన్ను నిలదీసి అడిగితే, యెంత బావుణ్ను? ఏ పరిస్థితుల్లో వెళ్ళాల్సి... తెలిసిపోయేదిగా! పైగా, నన్ను దూషిస్తూ,

అవమాన పరుస్తూ, వుత్తరం రాశాడు. తన తొందరపాటు విస్మరించి, యితరుల మీద తప్పు రుద్దడానికి ప్రయత్నించే స్వభావం నాకు నచ్చదు. దాంతో, నా మనసు విరిగింది. నాలో నిండివున్న ప్రేమానురాగాలు నశించాయి ఆత్మాభిమానం ఒక్క మగవారికే కాదు... స్త్రీలకూ వుంది. అది రామరాజు గ్రహించలేదు. ఇదీ సంగతి. ఆరోజు నుండి ...వుంగా అతణ్ణి మర్చిపోవడానికి ప్రయత్నించాను. మర్చి ...ాను." అంటూ ముగించింది

"అయితే, మీ యెడబాటుకి నేనే కారకుణ్ణన్నమాట" నవ్వుతూ అన్నాడు.

"అలా యెప్పుడూ భావించకు మావయ్యా! ...లో నీ తప్పు యేమీ లేదు. అర్థం లేని రామరాజు ...పోహే కారణం దీనికంతా. చదువుకోగానే సరికాదు. ...కి తగ్గ సంస్కారం వుండాలి..." అంది కాస్తంత ...వేషంతో.

జలజ అంత విసురుగా అన్నందుకు విస్తుపోయాడు రామమోహన్. అయితే, ఆమె మాటలు సత్యానికి దూరం కాదనిపించింది.

"నువ్వన్నది నిజం జలజా !"

"అమ్మాయ్ జలజా !" సుబ్బారావు కేక వినిపించి, తృళ్ళిపడింది జలజ. తండ్రి కోపగించుకుంటాడని కాదు. అదేమిటో, ఆ సమయంలో అలా అనిపించింది.

"నాన్న వచ్చారు... పదమావయ్యా!" ...

అక్షణించి వదిలింది. రామమోహన్ ఆమెతోపాటు నడిచాడు.

"ఏమోయ్ మోహన్, నువ్వొచ్చి యెంతసేపయ్యింది?"

"కొద్దిసేపటి క్రితమే బావా! బహిరంగ సభకి వెళ్ళావట గా; ఏవిటీ విశేషాలు!"

"ఏముంటాయి? ఎప్పుడూ వున్న వుపన్యాసాలే! కొద్దిసేపు వుండి వచ్చేశాను. రావోయ్ కాస్సేపు మాట్లాడుకుందాం..."

"లేదు బావా! నాకు వేళవుతోంది. రేపు కాస్త పెందరాళే వస్తాలే: గుడ్ నైట్! వస్తా జలజా!" అంటూ చరచరా కారు దగ్గరికి నడిచాడు. కొద్ది క్షణాల్లో కారు కదిలింది

సుబ్బారావు మొహం విప్పారింది సంతోషంతో. దగ్గర్లోనే వున్న కూతురు కేసి అదోలా చూసి "మీ రిద్దరూ ఓ చోట నుంచుంటే, నాకు యెలా అనిపిస్తూ వుంటుందో తెలుసునమ్మా?... చిలకా గోరింకలంటారే, అలాగే అనిపిస్తుంది..." నవ్వుతూ అన్నాడు.

"పో నాన్నా!" సిగ్గుతో మొహం ప్రక్కకి త్రిప్పుకుంటూ లోపలికి తుర్రుమంది జలజ.

"ఈ సిగ్గు యింక యెన్నాళ్ళులే!..." ముసిముసిగా నవ్వుకుంటూ తనూ లోపలికి నడిచాడు సుబ్బారావు.

... ... ...

౨

కొద్దిదినాలు కాలగర్భంలో కలసిపోయాయి. వెంక ట్రామయ్య క్రమంగా నీరసించిపోతున్నాడేగాని, ఆరోగ్యం కోలుకోవడంలేదు. ఆనందమే ఆరోగ్యమంటారు. అతనిలో ఆనందం లోపించింది గాబట్టే, ఆరోగ్యం లోపించింది. కొడుకు, తన మాటకు యెదురుతిరిగాడన్న బాధ ఒకవేపూ, తన ఆరోగ్యస్థితి గమనించికూడా, వాడు వూరికి వెళ్ళిపోయాడన్నవ్యధ మరోవేపూ, ఆయన్ని మరీ కృంగదీశాయి. క్షణక్షణానికీ సుశీల భవిష్యత్తు యెలా వుంటుందోనన్న విషయాన్నే, అతని మెదడు ఆలోచిస్తుంది! ఈ ఆలోచనల బరువూ, బలహీనతలతోపాటు పేగులు తెంచే దగ్గూ, అతణ్ణి బాధ పెట్టసాగాయి. ఒక్కొక్కప్పుడు ఊపిరి సలిపేదే కాదు. ఆ క్షణంలోనే కళ్ళుమూసేస్తానేమోనన్న భీతి కలిగేదతనికి.

మావయ్య పరిస్థితి, సుశీలకు యెంతో ఆతృత, భయం కలిగించింది. ఒక్కో సమయంలో ఒంటరిగా యేడ్చేది. తన దరదృష్టాన్ని నిందించుకునేది. అతని పరిస్థితి యెలా వుంటుందోనన్న ఆసక్తితో, ఆతృతతో, డాక్టర్ని అడిగేసింది కూడాను.

"డాక్టరుగారూ! మావయ్యకి యేమీ భయం లేదంటారా?"

డాక్టరు కొద్దిక్షణాలు మౌనం వహించారు. "నా శక్తివంచన లేకుండా ట్రీట్‌మెంట్ చేస్తున్నానమ్మా!

ఏమాత్రమూ ఫలితం కనిపించడం లేదంటే, నాకే ఆశ్చర్యంగా వుంది. ఎందుకైనా మంచిది - వాళ్ళ అబ్బాయిని రప్పిస్తేనే మంచిది. ఆ అబ్బాయి దగ్గర వుండటం, చాలా అవసరం. తరుణం మించకుండానే హాస్పటల్లో చేర్చాలని నా అభిప్రాయం..." అనేసి వెళ్ళిపోయాడు

సుశీల స్తంభించిపోయింది. పరిస్థితి అంతమేరకు విషమిస్తుందని ఆమె తలంచలేదు. ఆమె కళ్ళు నీళ్ళ పర్యంతమయ్యాయి. ఏంచెయ్యాలో ఆమె ఊహకి అందలేదు. ఆపాదమస్తకం వణికిపోయింది. డాక్టరు మాటల్లోని భావం చాలా నిరుత్సాహకరంగా వుందని ఆమెకు తెలుసు. అందుకే ఆమె ఆతృతపడుతోంది. డాక్టరు చెప్పినట్లు వెంటనే యమని బావకి వుత్తరం వ్రాస్తే? లేకపోతే టెలిగ్రామ్ యిస్తే?... ఆలోచించింది. టెలిగ్రామ్ యిస్తే 'యేం కొంప మునిగిందని' బావ కోపగించుకుంటాడో యేమిటో! అతనిదంతా అదోరకం మనస్తత్వం. అందులోను ఇటీవల మరీ మారిపోయాడు. అందుకే, ఉత్తరం రాసేందుకే నిశ్చయించుకుంది. అదే ప్రస్తుత కర్తవ్యమనుకుంది. ఆ రోజే ఉత్తరం రాసేయాలన్న తలంపుతో తన గదికేసి బైలుదేరింది వెంకట్రామయ్య పడుకున్న గదిలోంచి భారమైన మూలుగులు వినిపించాయి, ఆతృతగా అతనిదగ్గరికి నడిచింది. ఆయన ఆయాసపడుతున్నాడు. ఫాలభాగం చెమటతో మెరుస్తోంది. సుశీలకు మతిపోయినట్టయ్యింది

[ఇంకా వుంది]

"ఏం మావయ్యా! ఎలా వుందేవిటి? అలా ఆయాస పడుతున్నావేవిటి?" ఆతృతగా ప్రశ్నించింది.

"మంచినీళ్ళు యివ్వు సుశీలా!" నాలుక తడుపుకుంటూ, హీనస్వరంతో అన్నాడు.

ప్రక్కనే బల్లమీదున్న నీళ్ళు అందించింది. ఒక క్షణం ఆయాసం తీర్చుకుని,

"ఏవిటోనమ్మా సుశీలా, గుండెల్లో గాభరాగా వుంది. క్షణక్షణానికి నాలుక పిడుచగట్టుకు పోతోంది. అన్నట్టు, రాజు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందా అమ్మా?" అన్నాడు.

సుశీలగొంతుకలో పచ్చి వెలక్కాయ పడింది. ఏం జవాబు చెప్తుంది? వుత్తరం రాయలేదంటే మావయ్య యెక్కడ బాధపడతాడోనని భీతిచెందింది. అందుకే అబద్ధం చెప్పడానికి నిశ్చయించుకుంది.

"ఓ ఉత్తరం వచ్చింది మావయ్యా!" అంది తడబడకుండా,

వెంకట్రామయ్య ఆమె మొహంకేసి పరిశీలనగా చూశాడు. అతనికి యెందుకోఅనిపించింది-సుశీల అబద్ధం చెప్తున్నదని. ఓనిట్టూర్పు వదిలాడు.

"ఎందుకు సుశీలా అబద్ధం చెప్తావు? నీ అబద్ధంతో నన్ను తృప్తిపరిస్తే, అది ఆత్మవంచనే అవుతుంది కదా!" బాధగా అన్నాడు.

సుశీల మొహం దించుకుంది.

"వాడు రాయడమ్మా! నాకు తెలుసు. వాడికి నా మీద కోపం. అందుకే, నేను మంచం పట్టినట్టు గమనించి కూడా వూరికి వెళ్ళిపోయాడు. ఏం చెయ్యను? అది నా దురదృష్ట..."

తండ్రిమీద కొడుకుకి కోపమా ? ఎందుకు? అర్థం కాలేదు సుశీలకు. మావయ్య రోజురోజు కృశించిపోవడానికీ బావ కోపంగా వుండి బాధపడుతూ వుండడానికీ యేదో ఒకే కారణం వుండవచ్చుననిపించిం దామెకి. "బావకి నీ మీద కోపమా? ఎందుకు మావయ్యా?" ఆసక్తిని అణచుకోలేక అడిగింది.

వెంకట్రామయ్య బాధగా ఓ నిట్టూర్పు విడిచాడు. అతని కనుకొనల్లో నీరు గూడుకట్టడం, సుశీల గమనించి, చెప్పలేని జాలేసి హృదయం ద్రవించింది.

వెంకట్రామయ్య చెప్పడం ప్రారంభించాడు.

"నీతో ఓ విషయం చెప్పాలని చాలా రోజులనుంచి అనుకుంటున్నాను సుశీలా; అయితే, అవసరం, అవకాశం, రాలేదు గాబట్టి చెప్పలేదు. మీ అమ్మ బ్రతికివున్న రోజుల్లో దానితో నా అభిప్రాయం చెప్పాను. ఏమిటో తెలుసా? నిన్ను మాయింటి కోడలుగా చేసుకుంటానని! రాజు నా మాటకు యెదురు చెప్పడన్న ఆత్మ విశ్వాసం, నాలో చిరకాలంగా వుంటూ వచ్చింది. అందుకే నిన్ను చదివించాలన్న తలంపు పెట్టుకున్నాను నా అభిలాష విని మీ అమ్మ యెంత పొంగి పోయిందో, చెప్పలేను. కాని... కాని... యిటీవల రాజుతో ఈ విషయం ప్రస్తావిస్తూ

నా అభిమతం తెలియజేస్తే. నా కోరికను త్రోసి రాజు చేశాడమ్మా; నా గుండె బద్దలు చేశాడు, నా ఆశల్ని విచ్ఛిన్నం చేశాడు. నా బాధ వాడికేం తెలుసు? నీకు న్యాయం చెయ్యలేకపోయానే అన్న ఆవేదన నన్ను పట్టుకుని బాధిస్తోందమ్మా! మనచుట్టూ పరిభ్రమిస్తోన్న మీయమ్మ ఆత్మ, నా ప్రశాంతతకు, యెంతగా పరితపిస్తుందో మనకేం తెలుసు...?" అని చెప్పకు పోతూంటే దగ్గుతెర వచ్చింది.

సుశీల నిర్ఘాంత పోయింది. ఈ 'అశాంతి'కి యీ ఆవేదనలకు మూలకారణం ఒక విధంగా తనేనని తెలిశాక, ఆమెకి యేడుపొచ్చింది. గతంలోని కొన్ని సంఘటనలు స్మృతిపథంలో మెదిలాయి. ఆమధ్య ఒకటి రెండుసార్లు తనపట్ల ప్రదర్శించిన ఉద్రేకపూరితమైన ప్రవర్తనగురుకు వచ్చింది. బాధ పడింది. తన మూలంగా, తండ్రీకొడుకుల మధ్య యెందుకు మనస్పర్థలు రేకెత్తాలి? ఎందుకు అశాంతి చెలరేగాలి? "చాలా తొందరపడ్డావు మామయ్యా! బావకి నన్ను పెళ్ళిచేసుకోవడం యిష్టం లేనప్పుడు, బలవంతంగా ఒప్పించడానికి ప్రయత్నించడం, అన్యాయం. ఈ విషయం ముందే నాకు తెలియజేస్తే, యిన్ని అనర్థాలకు తావుండేది కాదు. ఇప్పుడైనా మించిపోయింది లేదు మామయ్యా! బావకి నేను పుతెరంరాస్తాను. అతనికినచ్చిన అమ్మాయినే వివాహం చేసుకోనేయండి" అంది సుశీల. ఆయన స్వరం కాస్త బొంగురువోయింది.

"నీకు తెలియదమ్మా! నేను ఆనిర్ణయానికి రావడానికి కారణం లేకపోలేదు. వాణ్ణి నేను యెంతో గారాబంగా

పించాను. ఇప్పటికీ వాడంటే, నాకు చిన్న పిల్లాడిమీద వుండే వాత్సల్యమేవుంది ఆవాత్సల్యమే నన్ను స్వార్థపరుణ్ణి చేసింది. నేను యీలోకం విడిచిపెట్టాక..." అని వెంక ట్రామయ్య అంటూ వుంటే, సుశీల అడ్డొచ్చింది.

"అవేం మాటలు మావయ్యా!" అంది.

వెంకట్రామయ్య నిస్పృహతో అదోలా నవ్వేడు. "మానవులంతా, ఎప్పుడో ఓ రోజు మరణించవలసిందే నమ్మా? ఎవరూ చిరంజీవులుగా వుండిపోరు. నాకు తెలు నేనింక యెక్కువరోజులు బ్రతకనని. నా తదనంతరం, ఆదరంగా, కంటికి రెప్పలాచూచుకునే వ్యక్తి అవసరం యెంతో వుంది. వాడు బొత్తిగా అమాయకుడు. అందుకే, నా భయమంతాను. నువ్వే వాడి జీవిత భాగస్వామివి వవుతే, నాకు యింక యే చింతా వుండదు. నీ మీద నాకు అంతటి విశ్వాసం వుందమ్మా! కాని, నీవంటివ్యక్తి భార్యగా పొందే అదృష్టం వాడికిలేదు. అది వాడి ఖర్మ ఏం చేస్తాను..." గద్గదస్వరంతో అన్నాడు.

మావయ్య మనోవాంఛ, యిప్పుడు అర్థమయ్యింది సుశీలకు కొడుకు శ్రేయస్సుకోరి ఆయన చేసిన యీ ప్రయత్నాన్ని, కొడుకే అర్థం చేసుకోలేక పోయాడనుకుంది. మావయ్య జీవిత కావ్యం ముగియవస్తూంది. యీ అంతిమ అధ్యాయంలో ఆయనకి, యెందుకీ అశాంతి కలుగజేస్తు న్నావ్ భగవాన్! ఇది చాలా అన్యాయం... అనుకుంటూ ఆలోచించింది. ఈ అశాంతిని పారద్రోలడం యెట్లా? ఏం చేస్తే, మావయ్య మనసు కుదుటపడుతుంది? అందుకు

తను యెంతవరకూ సహకరించగలదూ? ఆమె మెదడులో ప్రశ్న తరంగాలు ఉవ్వెత్తునలేచి ఒకదాని కొకటి ఢీకొంటు న్నాయి. చివరికి ఒక నిర్ణయానికి వచ్చింది.

"మావయ్యా! ఈ సమయంలో కూడా, నువ్వు బావను గురించే తపనపడడం, ఏమీ సబబుగా లేదు బావ చంటివాడేం కాదు. తన భవిష్యత్తును తను దిద్దుకోగల యోగ్యుడు. ఇంకా నువ్వు చిన్నప్పటి మనుకారాన్నే పుత్తాకలు ఉటాలా? అందరూనీలాగే అనుకొంటే, ప్రపం లో జరుగుతున్న యిన్ని వివాహాలూ జరిగి వుండేవి వేమో!"

"నిజమేనమ్మా! నువన్నది, నేనూకాదనను అయితే, యిన్నాళ్ళూ ఒక బంధంగా వుంటూ వచ్చిన, ఆ మనుకా వదులుకోవడం, అంత సులువుకాదుగదా!" భారంగా న్నాడు.

"మావయ్యా, ఇంకా ఆ తలంపే నీ మనసులో వుంచుకొని సతమతమవ్వకు. ఈ విషయంలో ఒక్కటి మాత్రం చెప్పగలను. బావ నన్ను వివాహం చేసుకున్నా, లేకపోయినా, అతని మంచి చెడ్డలుచూసే బాధ్యత నాది." యెంతో ఆత్మవిస్వాసంవున్న వ్యక్తిలా సమాధానం ధైర్యం గా చెప్పింది.

వెంకట్రామయ్య ఆశ్చర్యపోతూసుశీలకేసిచూశాడు, "ఏమిటమ్మా నువ్వు అంటున్నది?"

"నిజం మావయ్యా! నీవైనంతవరకూ బావ జీవి తంలో యే ఒడిదుడుకులూ లేకుండా చూస్తాను. నువ్వు

టెలిగ్రామ్ అందుకొని, వెంటనే బైలుదేరివచ్చాడు రామరాజు. తండ్రిని సజీవంగా చూడలేకపోయినందుకు కుమిలి, కుమిలి, యేడ్చాడు. తన జీవితంలో సుఖం రాసి పెట్టలేదనీ, తనికి కావల్సిన వాళ్ళంతా ఒక్కొక్కరూ తనకి దూరమవుతున్నారనీ తలపోస్తూ రోదించాడు. ఆఖరి కర్తవ్యంగా తండ్రి భౌతిక దేహానికి దహన సంస్కారాది విధులు సక్రమంగా జరిపాడు

◆ ◆ ◆

వెంకట్రామయ్య పరమపదించి, నాలుగు రోజులు గడిచాయి. వెంకట్రామయ్య తమ్ముడు పురుషోత్తమరావు, అతని భార్యా జానకి వచ్చివున్నారు. ఆ వూళ్లోనే వుంటున్న రామరాజు మేనమామ ధర్మారావు, అతని కుటుంబం కూడా యిక్కడే వున్నారు.

ధర్మారావు సకుటుంబంగా వచ్చి వుండటం యిద్దరికీ యిష్టంలేదు, ముఖ్యంగా పురుషోత్తమరావుకి. అతనికి తెలుసు—అన్నయ్య బ్రతికివున్న రోజుల్లో ధర్మారావుని ఆయింటి ఛాయలకే రానిచ్చేవాడుకాదని, అయితే ఇప్పటి పరిస్థితివేరు. ఈ పరిస్థితుల్లో వచ్చినవాళ్ళను పొమ్మని చెప్ప లేరు.

రామరాజు ఓ మూల కుర్చీలో కూచుని, వుదాసీనంగా ఆలోచనల్లో మునిగాడు. భవిష్యత్తంతా, అతనికి

సమస్యల తోరణంగా అగుపిస్తోంది. పురుషోత్తమరావు వెళ్ళి అతని ప్రక్కనే కూచున్నాడు.

"అలా దిగులుగా యెన్నాళ్ళు కూచుంటావురా రాజూ, ధైర్యం తెచ్చుకోవాలి మరి! నువ్వు యెంత బాధ పడినా, యెంత ఆలోచించినా చనిపోయిన నాన్న తిరిగి వస్తాడా చెప్పు! అన్నయ్య అందర్నీ విడిచిపెట్టాడని నాకూ బాధగానే వుంది. కాని యేం చేస్తాం? గుండె దిటవుపరుచుకోవాలి. ఆయనకేం? జీవితమంతా గౌరవంగా, సుఖంగా గడుపుకొని, కళ్ళు మూశాడు. అంతకంటే యే జీవికైనా కావల్సిందేమిటి? ఆ... ఒక్కటీ - నీ పెళ్ళికూడా ఆయన కళ్ళముందుగా జరిగిపోతే, యెంతో బావుండేది. అగ్గంలేని పట్టుదలలకుపోయి, ఆ కాస్త తృప్తి ఆయనకి లేకుండా చేశావు. పోనీలే! అవన్నీ యిప్పుడెందుకు? ఎలాగూ నీకు శెలవు ఉంది నా దగ్గర కొద్ది దినాలు ఉండు. నీ మనస్సుకింత శాంతి యేర్పడుతుంది" అన్నాడు.

"ఇప్పుడు నేనేమీ చెప్పలేను బాబాయ్! కాశీనుంచి తిరిగి వచ్చాక ఆలోచిస్తాను యేం చెయ్యడమో!"

"నేను అన్నదీ అప్పటి మాటేనా!"

"అవును రాజూ! నీ కిప్పుడు కావల్సింది మనశ్శాంతి. మరవుతే, కాశీ నువ్వు ఒంటరిగానే వెళ్తావా! అసలు నిన్ను వొంటరిగా వెళ్ళనిస్తామా? నీతో నేనూ రావాలని అప్పుడే నిశ్చయించుకున్నాను" తల కలిగించుకొని అన్నాడు ధర్మారావు.

పురుషోత్తమరావుకి వళ్ళు మండిపోయింది. ధర్మా రావు యిలా కలిగించుకోవడం అతనికేం నచ్చలేదు.

"బావగారూ! మీకెందు కా శ్రమ చెప్పండి. వాడితో నేనే వెళ్తున్నాను"

"సరే! మీ యిష్టం. మీరు వద్దంటే రావడానికి నాకేం అధికారం ఉంది?" చిన్నబుచ్చుకుంటూ, చిరు కోపంతో అన్నాడు ధర్మారావు.

ధర్మారావు వాదన జుగుప్స కలిగించింది గావోలు; రామరాజు అక్కణ్ణించి లేచి లోపలికి వెళ్లిపోయాడు.

ధర్మారావు, మేనల్లుడికేసి వింతగా చూశాడు, పురుషోత్తమరావుకేసి తిరిగి,

"బావగారూ! మీరు పెద్దవారు. మీకు నేను చెప్ప వల్సినవాణ్ని కాదు అయినా, రాజు మేనమామను గాబట్టి నాకూ కొంత బాధ్యత వుందని తలచి, చెపుతున్నాను. మీరు కోపగించుకోరనే భావిస్తున్నాను. వాడికి ఆప్తుల మందరమూ యిక్కడే వున్నాం గనక, వాడి పెళ్లివిషయం ఆలోచించి వొక నిర్ణయానికి వస్తే బావుంటుందేమో! వాడి జీవితంలో వొక మార్పు తీసుకురావడం అవసరం" అన్నాడు

పురుషోత్తమరావులోని కోపం ద్విగుణీకృత మయ్యింది ఈ సమయంలో ధర్మారావు, రాజు వివాహం గురించి ప్రస్తావించడమే యిందుకు కారణం.

"బావగారూ! మీకు వయస్సు వచ్చిందన్నమాటే గాని, వయస్సుకి తగ్గట్టు బుద్ధి పరిపక్వత రాలేదు. పెళ్ళి ప్రసక్తి తీసుకురావడానికి యిదా తగిన సమయం చెప్పండి? దీనివల్ల మీకు వారికే ప్రయోజనం యేవిటో అర్థం కావడం లేదు" మెల్లగా మందలించాడు.

ఆ మందలింపుని అంతగా పట్టించుకోలేదు ధర్మారావు.

"అదేవిటి బావగారూ అలా అంటారు? మా అక్కయ్య బ్రతికివున్న రోజుల్లో యెప్పుడూ అంటూవుండేది– మా అమ్మాయినే కోడలుగా చేసుకొంటానని. ఆమె చనిపోవడంతో, మా బావగారు మమ్మల్ని పూర్తిగా దూరం చేసుకోవడానికి ప్రయత్నించారు దూరం చేశారుకూడాను. ఇంతదూరం చేసినా, అప్పుడు అప్పుడే! మా మనసులు దగ్గరగా పోయేవి. పరోక్షంగానైనా యెప్పటికప్పుడు వీరి యోగక్షేమాలు తెలుసుకుండేవాణ్ని. నే నెంత సన్నిహితంగా తిరిగినా, యెవరికాక్కవాల్లెండి. ఇంత తాపత్రయమూ యెందుకంటారు? అభిమానాన్ని చంపుకోలేక; ఎప్పటికైనా రాజు మా అల్లుడే అవుతాడన్న అతను వదులుకోలేక; ప్రస్తుత పరిస్థితుల్లో రాజుకి యెవరో వొకరు ఆసరాగా వుండాలి. లేకపోతే, వొంటరితనం మరింత దిగులు కలిగిస్తుంది. అందుకే వివాహ ప్రయత్నాలు సాగించమంటున్నాను మా పెద్దమ్మాయికి సంబంధాలు వస్తున్నా రాజు మీదున్న నా దృష్టిని మరల్చుకోలేక అన్నింటిని వెనక్కి తిప్పేశాను. ఊళ్ళో వుంటున్నాం... యే కష్టంవచ్చినా

ఆగుర్కోగలం..." కంఠస్థం చేసుకొని వచ్చినట్టుగా ఏకరువు పెట్టాడు.

పురుషోత్తమరావు, అంత ఆవేదనలోనూ నవ్వకుండా వుండలేకపోయాడు. ధర్మారావు పెద్ద యెత్తు వెయ్యడం హాస్యాస్పదంగా తోచిందతనికి.

"అయితే, మీరింకా ఆ ఆశను వదలిపెట్టలేదన్నమాట" కాస్తంత వెటకారంగా అన్నాడు.

"ఎలా వదులుకోవడం చెప్పండి! వదులుకోవాల సాధ్యంకాని అనుబంధాలివి."

పురుషోత్తమరావు సీరియస్‌గా మొహం పెట్టాడు.

"అని మీరు అనుకుంటున్నారు...కాని, అది సాధ్యమేనని నేను అంటాను. మీ అమ్మాయికి వేరే సంబంధం చూసి పెళ్ళి చేసెయ్యండి" నిష్కర్షగా చెప్పాడు.

ధర్మారావు మొహంలో రంగులు మారాయి. చిన్నబుచ్చుకొన్నాడు. అయినా తన ప్రయత్నాన్ని యింకా విరమించుకో దల్చలేదు.

"అమ్మాయి అభిమతం తీసుకోకుండా, మీరే నిర్ణయించుతున్నారేమిటి బావగారూ! ఓ సారి అడగండి."

"వాడి అభిమతం యింతకుముందే తీసుకున్నాం. వాడికి యిష్టంలేదు."

"ఆ విషయం రాజునేఅడిగి నేను తెలుసుకుంటాను."

ధర్మారావు మొండిపట్టుకి, పురుషోత్తమరావు మరింత రెచ్చిపోయాడు. అతనికేసి తీక్షణంగా చూశాడు.

"ప్రస్తుత పరిస్థితుల్లో, ఆ ప్రసక్తే తీసుకురావద్దు. ఒక విధంగా యిది మీకు హెచ్చరికే! ఆ తరువాత అవమానం జరిగిందని మీరు బాధపడినా ప్రయోజనంవుండదు. తొందరపడకండి..." కోపంగానే చెప్పాడు పురుషోత్తమ రావు. అతని కళ్ళల్లోని యేదో యెర్రని కాంతి, ధర్మారావుని శాసించినట్టయ్యింది.

ధర్మారావు తెల్లమొహం వేశాడు. ఇంతకంటే ... అవమానం యింకేముంటుంది?... అనిపించింది. కాస్తంత దూరంలో నుంచునివున్న అతని భార్య మొహం చిట్లించుకొని, చరచరా లోపలికి వెళ్ళిపోయింది. ధర్మారావుకి యింక అక్కడ ఉండాలనిపించలేదు. ... గా లేచి ...మించాడు.

"విన్నావా జానకీ, నీళ్ళప్లాను?" చిన్నగా నవ్వుతూ అన్నాడు పురుషోత్తమరావు, భార్యని వుద్దేశించి

"ఇదేం కొత్తకాదు లెండి. స్వార్థం యెన్ని అబద్ధాలైనా ఆడిస్తుంది."

"అన్నట్టు, సుశీల ఏదీ?"

"ఆయన రాజు వివాహ ప్రసక్తి తెచ్చేసరికి, మెల్లగా జారుకుంది."

"నిజంగా దాని పరిస్థితి యిరుకున పడింది. ఏం చెయ్యడమా అని నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను."

"రాజు, యింత మొండిపట్టు పట్టుక్కూర్చోవడం, నాకేమీ నచ్చలేదు సుమండీ! సుశీలకు యేం తక్కువని?

మరి కొద్దిసేపట్లో, ధర్మారావు దంపతులు, పిల్లలతో సహా బైటికి వెళ్ళిపోయారు. పురుషోత్తమరావు లోలోన నవ్వుకున్నాడు. స్వార్థం యెంత చిత్రమైనది? పరిస్థితుల్నీ, విచక్షణాజ్ఞానాన్నీ విస్మరింపజేస్తుంది. అందుకే, స్వార్థ చింతతో చేసిన ప్రయత్నాలు యెప్పుడూ చేదుగానే వుంటాయి. అదే భగవంతుని సృష్టిలోని వైచిత్ర్యం. భగవాన్! నిజంగా నువ్వెంత ఘనుడివయ్యా! న్యాయం కల కాలం నిలిచేలా ప్రయత్నించడంలో నీకు నువ్వేసాటి. అందుకే, నువ్వు భగవంతుడి వయ్యావు. అతిశక్తిస్వరూపుడి వయ్యావు... అనుకుంటూ భగవంతుణ్ణి మనసులో ధ్యానించుకున్నాడు పురుషోత్తమరావు.

## 11

రామరాజు, పురుషోత్తమరావూ, కాశీ, గయ, ప్రయాగ మొదలగు పుణ్యక్షేత్రాలను దర్శించి, జరుపవల్సిన విధులు జరిపి తిరిగివచ్చారు.

ఓరోజు పురుషోత్తమరావు, జానకి, హాల్లో కూచుని వున్నారు రామరాజు అప్పుడే వీధిలోంచి వచ్చి, ఖాళీగా వున్న కుర్చీలో కూలబడ్డాడు.

"మేం రేపు వెడుతున్నాంరా రాజా !" అన్నాడు పురుషోత్తమరావు

అదో దుర్భర విషయమన్నట్టుగా, యిటుకేసి తిరిగాడు రామరాజు.

"ఇన్నాళ్ళూ మీరు వున్నారు. నాకు యెంతో ధైర్యంగా వుండేది బాబాయ్! మీరు వెళ్ళిపోతామంటుంటే, యెందుకో దిగులనిపిస్తోంది" అన్నాడు బాధగా.

"నిజమేరా ! దిగులుగానే వుంటుంది. అలాగని యెన్నాళ్ళు ఆ దిగులుని మనసులో బంధించుకొని బాధపడతావు? క్రమంగా నాన్నని మర్చిపోడానికి ప్రయత్నించాలి. అందుకే, మాతోపాటు వచ్చి కొద్దిరోజులు అక్కడ గడప మంటున్నాను."

"ఔను రాజూ ! ఎలాగూ నీకు శలవు వుందిగా ! బైలుదేరు" భర్త అభిప్రాయాన్ని సమర్థించింది జానకి.

రామరాజు క్షణం మౌనం దాల్చాడు.

"నేనిప్పుడు యెక్కడికీ రాను బాబాయ్. డ్యూటీలో జాయినవుతాను. నాలో ఆలోచనలకూ, ఆవేదనకూ చోటు లేకుండా, వాతావరణాన్ని సృష్టించుకుంటాను. సుశీలను మీ వెంట తీసుకువెళ్ళండి. అదొక్కటే నేను కోరేది"

పురుషోత్తమరావు ఓ నిట్టూర్పు వదిలాడు.

"సరే ! నీ యిష్టంరా ! కాని, నువ్వు ఒంటరిగా వుండటం, సాధ్యమేనా అని వివాహం చేసుకోరా అని యెంత చెప్తున్నా నిరాకరిస్తున్నావాయె."

"ఆవిషయం యిప్పుడు ప్రస్తావించకండిబాబాయ్..." నిర్లిప్తంగా అనేసి లోపలికి జారుకున్నాడు మెల్లగా.

రామరాజు మొదట్లు యిప్పుడు మరీ చిందరవందరగా పనిచేస్తోంది. అందరూ కలిసి, సుశీలను వివాహం చేసుకోమని ఒత్తిడిచేస్తారేమోనన్న భీతి అతనిలో ఓ మూల దాక్కొనివుంది అందుకే వెళ్ళిపోయాడు.

"ఒరేయ్ వీరన్నా!" కేకవేశాడు పురుషోత్తమ రావు.

లోపల్నించి వచ్చాడు వీరన్న.

"ఏంబాబుగారూ!"

"సుశీలను పిల్చుకురా!"

వీరన్న వెళ్ళిపోయాడు కొద్దిసేపట్లో సుశీల వచ్చింది.

"కూచో సుశీలా!" తన ప్రక్కను కూచోబెట్టు కుంది జానకి.

"మేం రేపు వెళ్ళిపోతున్నామే!" చెప్పాడు పురు షోత్తమరావు.

సుశీలకి పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది తన భవిష్యత్తు ఒక సమస్య అయ్యింది. అది దారి తెలియని కారడివిలా అనిపించింది. ఆమె కళ్ళు నీటి పర్యంతమయ్యాయి. ప్రక్కకి మొహం తిప్పుకొని, కళ్ళు ఒత్తుకుంది. ఏమీ జవాబు చెప్పలేని బాధ ఆమెది. అర్థం చేసుకుంది జానకి. స్త్రీ సహజమైన జాలి, ఆమెను ద్రవింపజేసింది.

"బాధపడకమ్మా సుశీలా! నువ్వు ఒంటరిదానవయ్యావన్న దిగులు నీకు వద్దు. మా బావగారి బాధ్యత మేం తీసుకుంటున్నాం. మాతో వచ్చేయ్. ఏ విధంగానూ నీకు లోటురాదు." తల నిమురుతూ అంది.

"ఔనే సుశీ! నువ్వు మాతో వచ్చేయ్! అన్నయ్య ఒకాటీ - నేనొకాటీ కాదు. నా బాధ్యత నాకు తెలుసు. మా పిల్లలతో పాటు నిన్నూ యే లోటురాకుండా ఆదుకుంటాను. పద..." అన్నాడు పురుషోత్తమరావు.

సుశీల చీరకొంగుతో కళ్ళు ఒత్తుకొని తన నిర్ణయాన్ని వెల్లడి చెయ్యాలన్న దృఢసంకల్పంతో ఓ గట్టి నిట్టూర్పు విడిచింది.

"నాపట్ల మీకుగల అభిమానానికి కృతజ్ఞురాలను నాయనమ్మా! మీయింట్లో నాకు సర్వస్వాతంత్ర్యం వుంటుందనీ, యెటువంటి అనాదరణ జరగదని నాకు తెలుసు. అయితే, నే నీ పరిస్థితిలో రాలేనని చెప్పడానికి విచారిస్తున్నాను - కారణం యేమిటని మీరు అడగవచ్చు. చెప్తాను... పెద్దమావయ్య అంతిమక్షణాల్లో ఒక విధమైన భయాన్ని మనసులో పెట్టుకుని మధనపడ్డారు. ఆ భయం యేమిటంటే, బావని యిన్నాళ్లూ ఆయన అతిగారాబంగా పెంచి, పెద్దచేశారు. కంటికి రెప్పలా చూసుకునేవారు. తను యీ ప్రపంచాన్ని వదిలాక, బావ ఒంటరివాడై, అతని శ్రేయస్సు చూసేవాళ్ళే వుండరన్న బాధ అది. ఎప్పుడూ మధనపడ్డం తప్పించితే, వ్యక్తం చేసేవారుకాదు. రెండు మూడు సందర్భాల్లో నేను గుచ్చిగుచ్చి అడిగిన తరువాత

యీ విషయం వెల్లడిచేశారు. అంతర్గతంగా ఆయన అనుభవిస్తున్న ఆవేదన ఆ మాటల్లో ప్రస్ఫుటమయ్యింది. నా గుండెలు నీరయ్యాయి. మావయ్య జీవితపు అంతిమభాగం అంతటి వ్యధాభరితమవ్వడం, నేను భరించలేకపోయాను. నేను బావ జీవితంలో అడుగుపెడితే, ఆయన నిశ్చింతగా వుండేవారట. అది జరగనందుకే, మరింత కుమిలిపోయారు. బావ నన్ను వివాహం చేసుకోవడానికి నిరాకరించినందుకు, నాకేం విచారం లేదు; బాధలేదు. కాని, మావయ్య మాటలు, ఆయన అనుభవిస్తున్న ఆవేదన మాత్రం నాలో స్థిరంగా నిలిచిపోయాయి. అందుకే మావయ్యకు మాటిచ్చాను – బావ శ్రేయస్సుకోసం నే నెప్పుడూ ప్రయత్ని[redacted]నని. మావయ్యలో ఆ మాటలు ఎంత సంతృప్తిని కలిగించాయని? ఇప్పటికీ, ఆయన ఆ క్షణంలో అనుభవించిన సంతోషం, నా కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తోంది. బావ, జీవితంలో ఒంటరివాడు కాకూడదు. అతని శ్రేయస్కాములు, అతనికి దగ్గరగానే వున్నారన్న భావన అతనిలో కలగాలి. అందుకే, నేను యిక్కడ వుండడానికే నిశ్చయించుకున్నాను మావయ్యా!" వివరంగా చెప్పింది సుశీల.

సుశీల అభిప్రాయానికీ, ఆమె నిర్ణయానికీ, పురుషోత్తమరావూ, జానకీ, విస్తుపోయి మొహాలు చూసుకున్నారు. "నువ్వా యిక్కడే వుంటావా? అదెట్లా సాధ్యం సుశీలా? లోకులుమాత్రం యేమనుకుంటారు చెప్పు? మనలో కల్మషం లేకపోయినా, లోకం మహాచెడ్డదమ్మా!

అన్నీ ఆలోచించుకుని రంగంలోకి వురుకు..." తన సందేహాన్ని వెలిబుచ్చాడు పురుషోత్తమరావు.

సుశీల గట్టిగా శ్వాస విడిచింది. మావయ్య వెలిబుచ్చిన సందేహాలు తనూ ఆలోచించింది. అందుకు అనుగుణంగానే తను నిర్ణయించుకుంది.

"ఆలోచించాను మావయ్యా! ఈ యింట్లో నేను వున్నప్పుడుకదా, ఆ సమస్యలన్నీను. ఈ వీధిలోనే ఓ గది అద్దెకు తీసుకుంటున్నాను. వారంరోజుల్లో వుద్యోగంలో చేరుతున్నాను కూడాను."

"ఉద్యోగమా?" ఆశ్చర్యంగా చూస్తూ అంది జానకి.

"ఔను అత్తయ్యా! మా స్నేహితురాలు పని చేస్తున్న ఆఫీసులోనే ప్రస్తుతానికి, గుమస్తాగా చేరుతున్నాను."

"అప్పుడే వుద్యోగం దొరకడంకూడా జరిగిందీ?" రెట్టించిన వుత్సాహంతో ప్రశ్నించాడు పురుషోత్తమరావు.

"తాత్కాలికంగా ఆ అవకాశం కల్పిస్తున్నారు మావయ్యా! ఈ యేర్పాటులన్నీ మా స్నేహితురాలే చేసింది."

"ఎందుకే నీకీ శ్రమలన్నీను? హాయిగా వివాహం చేసుకుని సంసారజీవితం గడపకుండాను...?" నిరుత్సాహపరిచేడు పురుషోత్తమరావు.

"కారణం యేమిటో చెప్పానుకదా మావయ్యా! ఎంతవరకూ కృతకృత్యురాలను కాగలనో, అది నా

అదృష్టంమీద ఆధారపడి వుంది. కనీసం, మావయ్య ఆత్మకు శాంతి చేకూరితే, అంతేచాలు నాకు."

"సరే! నీయిష్టం సుశీ! నువ్వొక సదుద్దేశంతో ప్రారంభిస్తున్న నీ ప్రయత్నానికి అడ్డురాము. నీ ప్రయత్నం జయప్రదంకావాలనే మా వాంఛితం కూడాను. ఎప్పుడు నీకేం సహకారం కావాలన్నా, నాకు వుత్తరం రాయి."

సుశీల మరేమీ మాట్లాడలేదు. క్షణంసేపు ఆ ముగ్గురిమధ్య నిశ్శబ్దం ఆవరించుకుంది. ఇంక యేం మాట్లాడాలో యెవరికీ తట్టలేదు. ఒకవిధమైన మూగభావం వారిలో వ్యాప్తమయ్యింది. ఆ నిశ్శబ్దాన్ని భరించలేని సుశీల మెల్లగా అక్కణ్ణించి జారుకుంది.

పురుషోత్తమరావు భారంగా నిట్టూర్పు విడుస్తూ అన్నాడు.

"ఈ చిన్నవయసులో దానికేవిటో యీ పట్టుదల జానకీ!"

ఏదో ఆలోచనలలో తేలుతున్న జానకి, భర్తమాటలతో తేరుకుంది.

"పట్టుదల అనకండి. ఇదొక ఆశయం లాంటిదే! ఒక విధంగా దీన్ని త్యాగంకూడా అనవచ్చు. మీ అన్నగారి ఆత్మ తృప్తికోసమే తను యీ ప్రయత్నం చేస్తున్నట్టు చెప్పిందిగా! ఆ ఆశయసిద్ధికోసమే, తన సుఖాన్ని వదులుకుంటోంది. ఇది త్యాగంకాక మరేవిటి? ఆమె అదృష్టం బావుండి, రాజు మనసుమారి, ఆమెనే వివాహం చేసు

కుంటే, యింక సమస్యేలేదు. ఏమవుతుందో చూద్దాం..."
అంది జానకి.

"నువ్వు అన్నట్టు అది ఆశయమే జానకీ! అన్నయ్య పట్ల వుండే అభిమానం ఆమెను పురికొల్పింది. ధైర్యంగా రంగంలోకి వురికింది ధైర్యంతో ముందుకు సాగితే, తప్పక ఫలితం వుంటుంది."

"మంచి మనిషికి, యెప్పుడూ ఓటమి వుండదండీ! ఆమెది నిస్వార్థమైన ప్రయత్నం. తప్పకుండా విజయం సాధిస్తుందన్న నమ్మకం నాలో వుంది. రాజు హృదయానికి చిరత్వం లేదు. అతను మారగలిగి, సుశీలనే తన భార్యగా [illegible]స్తే, అంతకంటె అందరమూ కోరేదికూడా యింకేమీ [illegible]ను."

"అదే ఆశిద్దాం...సరేగాని, మన సామాన్లు సర్దేసినట్టేనా?"

"లేదండీ! ఇప్పుడే సర్దుతాను..." లేచింది జానకి. పురుషోత్తమరావుకూడా అక్కణ్ణించి నిష్క్రమించాడు.

* * *

శాబాయ్, పిన్నీ వెళ్ళిపోయినా, వారితో సుశీల వెళ్ళకపోవడం, రామరాజుకి ఆశ్చర్యమూ, వుక్రోషమూ, కలిగించింది. ఆమె అభిప్రాయం యేమిటో, అతనికి అంతు చిక్కలేదు. కోపంగా యింటికి తిరిగివచ్చాడు. వరండాలోని కుర్చీలో విసురుగా కూలబడుతూనే నౌకర్ని పిలిచాడు.

"సుశీలను రమ్మను..." కటువుగానే అన్నాడు.

వీరన్న బిత్తరిచూపులు ప్రసరించాడు బాబుగారు యెందుకు అంత కోపంగా వున్నారో, తెలుసుకో లేక, అతని మొహంలోకి చూశాడు.

"నా మొహం చూస్తావేమిట్రా రాస్కెల్...సుశీలను పిల్చుకురా!" మళ్ళీ గర్జించాడు.

వీరన్న మారుమాట లేకండా లోపలికి వెళ్ళిపోయాడు. మరి కాస్సేపటికి సుశీల వచ్చింది. రామరాజు యింటి కప్పు కేసి చూస్తూ యేదో ఆలోచిస్తూండటంమూలాన, సుశీల రాకను గమనించ లేదు.

"పిల్చావా బావా?" సుశీలే అడిగింది.

"ఔను. బాబాయ్ నిన్ను విజయవాడ వాళ్ళతో పాటు వచ్చేయమంటే, యెందుకు వెళ్ళలేదు ?" కోపంగా అన్నాడు. అతని కళ్ళు నిప్పులు క్రక్కుతున్నాయి.

"ఎందుకు వెళ్ళాలి బావా?" యెదురు ప్రశ్న వేసింది.

విస్తుపోయాడు రామరాజు. ఆమె, అటువంటి ప్రశ్న వేస్తుందని, అతను వూహించ లేదు.

"అదేమిటా ప్రశ్న ? ఈ యింట్లో నేను ఒంటరిగా వుంటాను. మరి, నువ్వెలా వుంటావు ?" ఎంత కోపంగా అడిగినా అమాయకపు ప్రశ్నే అనిపించిందామెకి.

"వుంటే, తప్పా?" చిలిపితనం చిందులు తొక్కింది దామెలో.

"తప్పేమరి ! ఏమీ తెలీనట్టు అడుగుతావేమిటి ? మన యిద్దరికీ వున్న బాంధవ్యం యేమిటి? అది ఆలోచిం

చావా ? మనం భార్యాభర్తలు కానప్పుడు, ఒకే యింట్లో వుండటం అసంభవం. అసాధ్యం కూడాను."

"ఏదీ అసాధ్యం కాదు బావా ! ఎవరిమట్టుకు వాళ్ళుంటాం. దానికేం! ఒక యింట్లో వుండడానికి భార్యాభర్తలే అయ్యుండాలన్న సిద్ధాంతం యెక్కడుంది?"

రామరాజుకి మాటపెగల్లేదు చప్పున. సుశీల ప్రశ్న పరంపరలకు తట్టుకో లేక పోతున్నాడు. అంత అమాయకుడని తెలిసే, వెంకట్రామయ్య దిగులుపడేవాడు. సుశీల మొండి ప్రశ్నలకు రాజులో వుద్రేకం రేగింది.

"ఆ సిద్ధాంతాలేమీ నాకు తెలీవు సుశీలా! తెలుసుకో వలసిన అవసరం కూడా యేమీ లేదు. ఒక్కమాట చెప్తున్నాను విను. నువ్వు యీ యింట్లో వుండడానికి వీల్లేదు. లోకానికి నేను జవాబు చెప్పలేను. నీ పట్టుదల, మొండితనం చూస్తుంటే, నీ మనసులో యేదో పాను దాగివున్నట్టుంది. నన్ను నువ్వు వలలో వేసుకోవడమన్నది వట్టి భ్రమ...."

కోపంగానే అన్నాడు. అతని వూహా అంతవరకే పోయింది మరి! అదీగాక పరిస్థితుల ప్రభావం కూడా అతనిలో అదే ఆలోచనల్ని రేకెత్తించింది.

రామరాజు మాటలకు, సుశీల మనస్సు చివుక్కుమంది. ఆమె మొహం ముకుళించుకు పోయింది. ఆ కోత హృదయంలో సూదులు గుచ్చుకొని బాధించినట్టయ్యాయ్. బావ తనను అంతవరకే అర్థం చేసుకొందుకు, లోలోన పరితపించింది. అతనిలో యెటువంటి సంచలనం కలుగుతుందో చూడాలన్న వాంఛతో మొండి ప్రశ్నలు వేసిందిగాని, లేక

పోతే, తన కెక్కడిదీ ఆ ధైర్యం? ఇంక హద్దుమీరి బావ చేత అవమానింపబడటం, యిష్టం లేకపోయిందామెకి. చిన్నగా నవ్వింది. 'పిచ్చిబావా, నీ తెలివి తేటలు యింతేనా!' అన్నట్టుగా వుందా నవ్వు.

"నువ్వేమీ గాభరా పడకు బావా! నన్ను తప్పుగా అర్థం చేసుకుంటున్నావు. నువ్వు అపోహపడినట్టుగ, నిన్ను వలలో వేసుకోవడానికి నేనేమీ ప్రయత్నించడం లేదు. అంత నీచానికి నేనెప్పుడూ దిగను. సంఘమంటే యేమిటో, లోకమంటే యేమిటో, నాకూ తెలుసు. తెలిసి కూడా, విమర్శకు గురవ్వడానికి ప్రయత్నించేటంత తెలివితక్కువ దానను కాదు. నీ భావాలు యెలా వుంటాయోనని [illegible] చెప్పాను. అంతేగాని, యీ యింట్లోనే తిష్టవేస్తానని అనుకోకు. ఈ రోజే యిక్కణ్ణించి వెళ్ళిపోతున్నాను బావా! నా సామాన్లుకూడా సర్ది వుంచాను, కావాలంటే, నా గదిలో చూడు. నా స్నేహితురాలు వస్తుందని యెదురు చూస్తున్నాను" అంది సుశీల నిబ్బరంగా. ఈ యింటి నుండి బైట పడుతున్నందుకు, తనేమీ బాధపడనట్టుగానే చెప్పింది.

రామరాజు నిర్విణ్ణుడయ్యాడు. తను అకారణంగా ఆవేశం తెచ్చుకొని, అసభ్యంగా ప్రవర్తించినందుకు లోలోన సిగ్గుపడ్డాడు కూడాను. ఎందుకోగాని, సుశీల మనస్సు తెలుసుకోవడంలో యెప్పుడూ తను పొరబడుతున్నాడు.... అనుకుంటూ బాధపడ్డాడు.

"క్షమించు సుశీలా! ఆవేశంలో వళ్ళు తెలీక యేమేమో అనేశాను. ఏమీ అనుకోకు. నువ్వు యీ యింటి నుండి వెళ్ళిపోవడం, వుభయ తారకం. అందుకే, అంత నిష్కర్షగా చెప్పవల్సి వచ్చింది. ఇంతకీ, యెక్క డుంటావు?" ఆ ప్రశ్న వేయకుండా వుండలేకపోయాడు.

నిజానికి సుశీలపట్ల, అతనిలో, యిప్పుడు అంతులేని వుక్రోషం ఆవరించి వుంది. అందుకు కారణం యేమిటంటే, తన తండ్రికి ఆమెను కోడలిగా చేసుకోవాలనే వాంఛ ఓ సమస్యగా తయారవ్వడమూ, ఆ సమస్య కారణంగానే ఆయన మంచం పట్టడమూ, మరణించడమూ జరిగిందన్న [illegible] హృదయంలో స్థిరంగా నిలచిపోయింది. అందుకే, ఆవేశాన్ని అణచుకోలేక పోయాడు. ఏమేమో అనేశాడు. ఇప్పుడు సుశీల అభిప్రాయం తెలుసుకుని పశ్చాత్తాప పడుతున్నాడు. ఆ పశ్చాత్తాపంతోపాటు క్షణికమైన జాలి కూడా యేర్పడింది సుశీలపట్ల అందుకే, ఆ ప్రశ్న వేశాడు.

"ఈ వీధి చివర్లోనే మా స్నేహితురాలు వుంటోంది బావా! వాళ్ళింటికి దగ్గర్లోనే ఓ గది అద్దెకు తీసుకున్నాను."

ఇంకా యెన్నో ప్రశ్నలు అడగాలనిపించింది. అయినా, అతని ఆవేశం అడ్డువచ్చింది. ఆమె విషయం, తనింక పట్టించుకో కూడదన్న నిర్ణయానికి వచ్చేశాడు.

"సరే" ముక్తసరిగ అనేసి, కుర్చీలో వెనక్కి చేర బడ్డాడు.

రామరాజు ముభావానికి సుశీల కాస్తంత బాధపడింది. తన జీవితం యెలా గడుస్తుందో, యేమిటోనన్న విషయం, బావ అడగనందుకు ఆమె హృదయం బాధతో చుట్టుకు పోయింది. తనంటే, యిన్నాళ్ళు బావకి వల్లమాలిన అభిమానం వుండేది. కాని, వివాహ ప్రసక్తి వచ్చిందగ్గర్నించీ పూర్తిగా మారిపోయాడు. ఆ అభిమానాన్నంతా ఆవేశంగా మార్చుకున్నాడు. నిజంగా అది తన దురదృష్టమే!... అనుకుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది మెల్లగా.

మరి కాస్సేపటికి, పద్మవచ్చింది. వెంటనే ఓ రిక్షాను పిలిపించి, తన సామాను పట్టించుకుని,పద్మతో బైలుదేరింది సుశీల. వెళ్తూ రామరాజు దగ్గరకు వచ్చి;

"వస్తాను బావా! తప్పనిసరి పరిస్థితుల్లో యీ యింటి నుండి బైటపడుతున్నందుకు, నాకు యెంతో బాధగావుంది. కాని, యేం చెయ్యను ? ఆ బాధను దిగమ్రింగుకుంటున్నాను. నువ్వుమాత్రం,మావయ్య హితోక్తుల్ని గుర్తుంచుకుంటూ జీవితం గడపాలి. నేను నీకు చెప్పవల్సిన దానను కానను కో! అయినాసరే, పరాయి వ్యక్తిని కాదుగాబట్టీ, సంకోచించకుండా చెప్తున్నాను ఎప్పుడైనా నా సహాయం అవసరమైతే, నీ శ్రేయోభిలాషిణి ఒకామె వున్నదన్న విషయాన్ని విస్మరించకుండా నాకు కబురుచెయ్యి నీ మంచి కోసం, నీ శ్రేయస్సుకోసం, యేం చెయ్యమన్నా చేస్తాను. మరి సెలవు తీసుకుంటాను." అంటూ చరచరా అక్కణ్ణించి వెళ్ళిపోయి రిక్షాలో కూచుంది. ఆమె కళ్ళ నుండి అశ్రువులు ధారాపాతంగా చెక్కిళ్ళమీదకు జాలువారినయ్. ఒక్కసారి

భోరుమంటూ పద్మ భుజమ్మీద వాలిపోయింది. ఆమె హృదయం జోరుగా కొట్టుకుంటోంది ఇవన్నీ పట్టించు కోకుండా రిక్షా ముందుకు సాగిపోయింది.

రిక్షా కదలగానే వీధి ద్వారం దగ్గరకు వచ్చి నుంచున్నాడు రామరాజు అతని దృక్కులు, పోతున్న రిక్షామీదే వున్నాయి. ఒక్కసారి అతనికి దుఃఖం ముంచుకొచ్చింది. కళ్లు చెమ్మగిల్లాయి. సుశీల మాటలు, అతని చెవుల్లో ప్రతిధ్వనించాయి. చేతిరుమాలుతో కళ్ళు ఒత్తుకుంటూ లోపలికి వెళ్ళిపోయాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది బోసిగా కనిపించింది. జీవితంలో ఒంటరివాణ్ణయ్యానన్న తలంపు యిప్పుడు మనసులో మొలకెత్తింది. దిగాలుపడి, కుర్చీలో కూలబడి పోయాడు రామరాజు.

* * *

## 12

రామమోహన్, జలజల వివాహం జరిగింది. సుబ్బారావు కోరికమీద వాళ్ళిద్దరూ అతని యింట్లోనే వుంటున్నారు. సుబ్బారావు హృదయం, యిప్పుడు యెంతో తేలిక పడింది. తన మనోవాంఛితం నెరవేరినందుకు, భగవంతునికి మనసులో కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ఇక తన జీవితం నిశ్చింతగా సాగిపోతుందని తృప్తిపడ్డాడు.

ఓరోజు— రాత్రి తొమ్మిది కావస్తోంది. జలజ పూల తోటలోని సిమ్మెంటు పలకమీద కూచుని వుంది. ఆమెకి కాస్తంత దూరంలో సుబ్బారావు కుర్చీలో ఆశీనుడై వున్నాడు. మెర్క్యురీ బల్బు కాంతిలో, పూల మొక్కలు వింత వింత రంగుల్ని సృష్టిస్తున్నట్టుగా అగుపిస్తున్నాయి. చల్లని గాలి మనసుకి వుల్లాసాన్ని కలిగిస్తోంది.

"చీకటి రాత్రులే అయినా. యీ విద్యుత్తు కాంతిలో, ఆ భావనే రావడం లేదు చూశావా అమ్మాయ్!" అన్నాడు సుబ్బారావు, చాలాసేపు మౌనంగా వుండటాన్ని భరించ లేక.

"నిజమే నాన్నా! విద్యుత్ కాంతిలోనే వుందా ప్రభావం!"

"విద్యుచ్ఛక్తిని కనిపెట్టిన శాస్త్రజ్ఞుణ్ణి మానవాళి యెప్పుడూ మర్చిపోలేదు. ప్రస్తుత ప్రపంచంలో, విద్యుత్ శక్తికి ప్రముఖ ప్రాముఖ్యత వుందని చెప్పవచ్చు"

ఆ సంభాషణ, జలజకి విసుగు పుట్టించిందనే అనుకోవాలి.

"ఈ వేళ మీరు విద్యుచ్ఛక్తిమీద పడ్డారేమిటి నాన్నా?" నవ్వుతూనే అన్నది.

సుబ్బారావు నవ్వకుండా వుండలేక పోయాడు. "అదేమిటోనమ్మా! అలా వచ్చేసింది యీ ప్రసక్తి. ఒక్కొక్కప్పుడు మనం అనుకోని విషయాలు అప్రయత్నంగా ప్రస్తావనలోకి వురుకుతూ వుంటాయి. అన్నట్టు రామమోహన్ యింకా రాలేదేమిటి? తొమ్మిది కావస్తోంది. ఏమిటో యీ

వైద్య వృత్తే అంత; వారికి, వేళాపాళా, అంటూ వుండదు. పిళ్ళకెంబు - మేం నయం. మాకు నియమిత సమయాలు న్నాయి" తను వృత్తిని ఓ మెట్టు పైకెత్తాడు.

"అది నిజమైతే కావచ్చునుగాని, వైద్య వృత్తిలో గల తృప్తి, మరెందులోనూ లేదునాన్నా! కోటిమానవులకు సేవ చెయ్యడం, యెంతో ఆనందాన్ని, ఆత్మ తృప్తినీ కలిగిస్తుంది." తన భర్తను ఓడిపోనివ్వ లేదు జలజ.

"అప్పుడే నీలో యెంత మార్పు వచ్చేసిందమ్మా?" నవ్వుతూ అన్నాడు.

"ఏమిటలా అంటున్నారు నాన్నా?"

"కాదా మరి? అప్పట్లో నిన్ను మెడిసిన్ చదివిస్తానంటే, ఆ వృత్తినే అసహ్యించుకొని, అటువంటి ప్రయత్నమే వద్దన్నావు. ఇప్పుడేమో సి అసహ్యాన్ని మెప్పుకోలు గా మార్చుకున్నావు. ఇది నీలో వచ్చిన మార్పు కాదంటావా?"

జలజ, కాదన లేక పోయింది. తనలో యీ మార్పు రావడానికి, భర్తపట్లగల అభిమానమే కారణమై వుండవచ్చుననుకుంది బిడియపడుతూ మొహం దించుకుంది. కూతురి అవస్థ గ్రహించి, నవ్వుకున్నాడు సుబ్బారావు. ఆ విషయం గురించి యింక మాట్లాడ దల్చ లేదు.

"అమ్మాయ్, చెప్పడం మరిచాను, ఆ మధ్య రామరాజు తండ్రి చనిపోయాడటమ్మా!"

జలజ తృళ్ళిపడినట్టయ్యింది. రామరాజు ప్రసక్తి చాలా రోజులతర్వాత వచ్చింది మరి.

"ఎవరు చెప్పారు నాన్నా?"

"నా స్నేహితుడొకడను ఆవీధిలోనే వుంటున్నాడు. ఈవేళ ఉదయంలో యేదో మాటలసందర్భంలో చెప్పాడు. వెంకట్రామయ్యకీ, మనకీ, యేదో బాంధవ్యం వున్నట్టు భావించుకొనే చెప్పుకుపోయాడు. పోనీ, యీఅనుకున్నందు వల్ల మనకి జరిగే నష్టమేమిటని వూరుకున్నాను. వెంకట్రామయ్య మేనకోడలు యెవరో ఓ అమ్మాయి వుందట. ఆమె ఆ వీధిలోనే ఓ గది అద్దెకుతీసుకొని వుంటూందట."

"మేనకోడలు వుందా?" ఆశ్చర్యపోతూ అంది. "ఆ విషయం రామరాజు యెప్పుడూ చెప్పలేదే!"

"ఎందుకు చెప్తాడమ్మా? అటువంటి వాళ్ళంతా, అవకాశవాదులే!" తనకి ముందే తెలుసునన్న గర్వంతో అన్నాడు.

"మరయితే, వాళ్ళిద్దరూ వివాహం చేసుకోకుండ ఆమె యెందుకు వేరేగావుంటూందో?"

సుబ్బారావు నవ్వేడు.

'మంచి ప్రశ్నేనే! ఆ మాత్రం అర్థం చేసుకోలేవా? అతడి గుణగణాలు ఇష్టంలేక పోయాయి గామోసు, దూరం పోయింది."

జలజకి గతం ఒక్కసారి జ్ఞప్తికి వచ్చింది. చప్పున మళ్ళీ తమాయించుకుంది. రామరాజును గురించి మళ్ళీ యెందుకు ఆలోచిస్తోందో. ఆమెకే అర్థంకాలేదు. అసలు

అతనిగురించిన తలంపే రాకూడదు. అలా వస్తే, రామమోహన్‌కి అన్యాయం చేసినట్టే అవుతుంది.... అనుకుంది.

"పోనీలెండి నాన్నా; వాళ్ళవిషయం మనకెందుకు?" అనేసింది అయిష్టంగా.

సుబ్బారావు అభిప్రాయం కూడా అదే! కూతురులో పూర్తిగా రామరాజుపట్ల ద్వేషం జనించాలి. తనలో కలిగిన అభిప్రాయానికి, ఒక రూపం యేర్పడినట్టుగా, జలజ మాటలు స్ఫురించాయి. సంతోషించాడు.

"అబ్బే; మనకి అవసరమని కాదుగాని, యేదో గుర్తుకు వచ్చింది కదా, అని చెప్పాను. అంతేనమ్మా!" తేలిగ్గా అనేశాడు.

హఠాత్తుగా చిన్నచిన్న తుంపర్లు పడ్డం ప్రారంభించాయి. తండ్రీ, కూతుళ్ళు లేచి యిట్లోకి వెళ్ళిపోయారు.

మరి కొద్దిసేపటికి వర్షం జల్లు అధికమయ్యింది... కిటికీ దగ్గరనుంచుని, భర్త రాకకోసం యెదురుచూస్తోంది జలజ.

రామమోహన్ అప్పుడేవచ్చాడు. కారుని గారేజ్‌లో పెట్టిలోపలికి చరచరా వచ్చాడు.

"తడిసి వచ్చావా మావయ్యా?" భర్తకి దగ్గరగా వచ్చింది జలజ.

"లేదు జలజా! ఇప్పుడే రెండు చినుకులు పడ్డాయి" కోటు అందిస్తూ అన్నాడు.

జలజ కోటును స్టాండుకు తగిలించింది. సుబ్బారావు ప్రక్కగదిలోకి మెల్లగా జారుకున్నాడు.

"ఈవేళ రామరాజు కలిశాడు జలజా!" షై విప్పుకుంటూ అన్నాడు.

భర్తకేసి అదోలా చూసింది జలజ.

"అతణ్ణి నువ్వు యెరుగుదువా మావయ్యా?"

"పెద్ద పరిచయం యేమీ లేదుగాని, తెలుసు... ఈ మధ్య బావ ఓసారి చూపించారతణ్ణి దూరంనుంచి. అప్పుడప్పుడూ క్లబ్‌లో కలుసుకుంటుండేవాళ్ళం. ఇటీవల అతనిలో యేదో గొప్ప మార్పు వచ్చిందనుకుంటాను. నన్ను చూస్తేచాలు, మొహంతిరంచేసుకుంటాడు. బహుశా, నా మీద కసివుందని భావించడం కంటే, వేరే వుద్దేశ్యం కలుగలేదు."

"ఈ వేళ యెక్కడ కలిశాడేవిఁటి? క్లబ్బులోనా?"

"కాదు. త్రోవలోనే. నేనో అర్జంటుకేసు చూసి వచ్చేస్తున్నాను. అతను రోడ్డుకి ప్రక్కగా తలదించుకుంటూ నడచి పోతున్నాడు. వర్షపుజల్లు పడుతున్నా లెక్కచెయ్యకుండా సాగిపోతున్నాడు. అతణ్ణి గుర్తుపట్టి కారాపాను. కారులో కూచోమన్నాను. అబ్బే; రానన్నాడు. అసలే నా మీద కోపం వుందా, దానికితోడు అభిమానం ఒకటి అడ్డొచ్చింది. అయినా నేను విడిచిపెట్టలేదు. చనువుగా అతని చేయిపట్టుకొని, లోపల కూచోపెట్టాను. కుశల ప్రశ్నలు వేశాను. నిర్లిప్తంగా జవాబులు చెప్పాడు. జీవితంలో గల వ్యథనంతా ఒక్కసారే అనుభవిస్తున్నట్టుగా మాట్లాడాడు. ఏదో నిరాశ, నిస్పృహ అతణ్ణి కృంగదీస్తున్నట్టుగాకని

పించాడు. బహుశా, నిన్న పోగొట్టుకున్నందుకేమో మరి'' అన్నాడు సూటిగా భార్య మొహంలోకి చూస్తూ.

జలజ కొద్దిగ కలవరపడింది.

''కాదు మావయ్యా! ఈమధ్య వాళ్ళ నాన్నగారు పోయారట....'' తను బాధ్యురాలు కాదన్నట్లుగ తప్పుకుంది.

''అలాగా! పాపం! రోజులు బాగులేకపోతే; అన్ని నిరాశలూ ఒక్కసారే అలముకుంటాయి. మనిషి యేమీ ఉత్సాహంగా లేడు. అటువంటి వాళ్ళనుచూస్తే, నాకు యెంతో జాలి వేస్తుంది...''

జలజ, జవాబు చెప్పలేదు. ఆమె హృదయంలో హఠాత్తుగా తుపాను చెలరేగింది. రామరాజు జీవితంలో, ప్రప్రథమంగా ప్రవేశించిందీ తనే; నిరాశ రేపిందీ తనే! అయితే, ఆ నిరాశను అతనే కోరి తెచ్చుకున్నాడు గాని, తన తప్పు యేమీ లేదు. అతని మార్పుకు యేవిధంగానూ బాధ్యురాలుకాదుతను... అని మరోసారి నిర్ణయించుకుంది. తనలోనే రేగిన తుపానుని అణచివేసింది.

''చాలా వేళవుతోంది ... భోజనం చేద్దువుగాని లే మావయ్యా'' ప్రసంగం మార్చింది. రామమోహన్ నవ్వుతున్నాడు.

''సరే వడ్డించు...యిప్పుడే వస్తాను...'' అంటూ లేచి బాత్‌రూమ్‌కేసి నడిచాడు.

జలజ వంటగదివేపు చరచరా పోయింది. ఆమె మనసు యింకా కుదుటపడ లేదు.

♦ ♦ ♦

మిట్ట మధ్యాహ్నం వేళ. ఎండ తీవ్రంగావుంది. వడ గాడ్పులు కర్ణపుటాల్ని కరిగించేస్తున్నాయి. ఇటీవల అంత తీవ్రమైన యెండ యేరోజూ అనుభవించలేదు ఆ ప్రాంతాల వారు. తలుపులు మూసుకొని, వడగాడ్పునుండి రక్షించు కొంటున్నారు.

సుశీలవచ్చి తలుపు తట్టింది. ఆ యిల్లు వదిలివెళ్ళిన తర్వాత, మళ్ళీ ఆ గడప త్రొక్కడం, అదే మొదటిసారి. వీరన్న తలుపు తీశాడు. ఆమెనుచూసి సవినయంగా నమస్కారం చేశాడు. "రండమ్మగారూ! చాలా రోజులకి వచ్చారు ..." అంటూ లోపలికి ఆహ్వానించాడు, ఓకుర్చీ తెచ్చి హాల్లో వేశాడు.

సుశీల కుర్చీలోకూచుని, యిల్లంతా కలయచూసిం.. ఇల్లంతా బోసిగా వుంది.

"బావ పగలంతా యింటిలో వుండటం లేదు కదూ వీరన్నా?"

"ఔనమ్మగారూ; రాత్రి యే యెనిమిది తొమ్మిది గంటలకో తిరిగి వస్తారు. మధ్యాహ్నం భోజనం కూడా అక్కడే యేదో హోటల్లో తీసుకుంటారు ఏమిటోనమ్మా, పెద్దబాబుగారు పోయాక రాజుబాబు పూర్తిగా మారిపో యారు" అన్నాడు వీరన్న.

సుశీల దీర్ఘ శ్వాస విడిచింది.

"తులశమ్మ యేదీ?" అంది.

"వుందమ్మా! కునుకుతీస్తుందో యేటో - పిలుచు కొస్తానుండండి"

"వద్దులే; నేనే వెళ్తా..." అంటూ లోపలికి నడిచింది.

తులశమ్మకి అప్పుడేచిన్న కునుకుపట్టింది. వీరన్న పిలుపువిని, త్రుళ్ళిపడుతూ లేచింది. ఎదురుగా సుశీలనుచూసి ఆశ్చర్యపోయింది

"నమస్కారమమ్మా! ఎక్కడా కనిపించడమే మానేశారు..."

"రోజూ వద్దామనే అనుకుండేదాన్ని. కాని, వీలు పడిందికాదు తులశమ్మా! ఇదిగో ఈవేళ వీలుచిక్కింది. బావ కులాసాగా వున్నాడా?"

"ఏం కులాసా అమ్మా! ఆయనగారి పద్ధతి నాకేం నచ్చలేదు. ఉదయం అనగా వెళతారు...మళ్ళీ రాత్రి పది గంటలకు వస్తారు. అంతకంటె వేగిరం రావడం, చాలా అరుదు. అంతవేళవరకూ యెక్కడ వుంటారో, యేంచేస్తుంటారో, యేమీ అర్థం కాదు. వచ్చి తృప్తిగా భోజనమైనా చేస్తారా అంటే, అదీ లేదు. కాస్తంత యెంగిలిపడి, లేచి పోతుంటారు. ఇంకాకొన్నాళ్ళుసాగితే, బాబుగారి ఆరోగ్యం పాడవుతుందేమోనని నాకు భయంగా వుందమ్మా!"

ఆ మాటలు, సుశీలకు యెంతో బాధను కలిగించాయి. బావ అనవసరంగా, అకారణంగా తన జీవితాన్ని దుఃఖమయం చేసుకుంటున్నాడని తలచి బాధపడింది. అయితే, అతనిలో మార్పు తీసుకురావడం యెలా? అందుకు తను యేం చెయ్యాలి?... ఆలోచించింది. యెంత ఆలోచించినా, తను చెయ్యగలిగిందేమిటో అర్థం కాలేదు.

"తులశమ్మా, నువ్వు వంటమనిషివే అయినా, వయసులో పెద్దదానవు నువ్వయినా కాస్త మందలించే ధోరణిలో చెబితే బావుంటుందేమో!" అంది. అంతకు మించి అప్పట్లో మరో మార్గం కనుపించలేదు సుశీలకు.

"లాభంలేదమ్మా; ఒకటిరెండు సార్లు చెప్పిచూశాను కూడాను. గతిలేక, నేనిలా వంటలక్కగా చేరాను గాని, నాకెందుకు చెప్పమ్మా యిలా జోక్యం కలిగించుకోవడం? అందుకే, ఆరోజునుంచీ చెప్పడం మానుకున్నాను ఆమధ్య ఓసారి పూర్తిగా తడిసివచ్చారు యింటికి. మూడు రోజులు జ్వరంతో మంచం పట్టారు. ఆయన్ని చూసేవాళ్ళుమాత్రం యింకెవరున్నారు మేం తప్పించి?"

"బావ జ్వరంతో బాధపడ్డాడా" ఆతృతగా అడిగింది. తనకి యీ విషయం యెలా తెలీకండా వుండిపోయిందో, అర్థం కావడంలేదు. అప్పుడప్పుడూ, అతని వివరాలు పైవారి ద్వారా తెలుసుకుంటూనే వుంది.

"ఔనమ్మా; ఆ మూడు దినాలూ పచ్చిమంచి నీళ్ళయినా ముట్టారు కాదు. ఆయన్ని చూస్తుంటే బాధ అనిపించేది..." అన్నాడు వీరన్న.

"మరి, నాకు యెందుకు కబురు చెయ్యలేదు?"

"బాబుగారే వద్దని చెప్పారు..." తులశమ్మ చెప్పింది.

సుశీల, నిస్పృహతో, నీరసంగా నిట్టూర్చింది.

"బావ పట్టుదలకి అర్థంలేదు తులశమ్మా! అంతరంగంలో యెన్ని వున్నా, అవసరాన్ని గుర్తించి ప్రవర్తిం

చాలికదా! బావలో యీ గుణం పోయిందికాదు. సరే! ఈసారి యెప్పుడైనా యిటువంటి అవసరాలు తటస్థిస్తే, బావని అడక్కుండానే నాకు కబురు పంపించు.''

"అలాగేనమ్మా!''

"మరి నే వెళ్ళి వస్తా! బావవస్తే చెప్పు, నేను వచ్చానని'' అంటూ వెళ్ళిపోయింది సుశీల.

సుశీల వెళ్ళిపోయిన తరువాత, అంతవరకూ యేవో సందేహాలతో సతమతమౌతున్న వీరన్న తులశమ్మతో అన్నాడు.

"తులశమ్మా; నాక్కు తెలీక అడుగుతాను, ఈళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటే, సరిపోయెగా, యెందుకిలా యెడంగావుంటారు!'

"కారణం లేకుండా వుంటుందా! చూడబోతే, బాబుగారికే, యీమెను పెళ్ళిచేసుకోవడం, యిష్టం లేనట్టుగా వుంది.''

"అదేంటీ! సుసీలమ్మ కంటె, మంచి మనిషి దొరుకుద్దా! ఆమెగాని యీ యింటి కోడలుగావస్తే, యీ యిల్లు యెంత కళకళలాడును! అంతా బాబుగారి పిచ్చి...ప్చ్!'' బాబుగారు వఠ్ఠి తెలివితక్కువ వాడన్నట్టుగా అనేశాడు,

వాడి మాటలకి నవ్వుకుంది తులశమ్మ.

"బాగుండును వీరన్నా! కాని, అదే జరగడం లేదుగా! సుశీలమ్మ యెంత మంచిమనిషో చూశావా! దూరంగావున్నా, బాబుగారి యోగక్షేమాలు తెలుసుకోడానికి యెలా ప్రయత్నిస్తూందో."

"కాదు మరీ! సుశీలమ్మంతటి మంచిమనిషిని నే నెక్కడా చూళ్ళేదు."

"మంచిమనిషి కాబట్టే, అన్ని కష్టాలొస్తున్నాయి వీరన్నా! ఈ రోజుల్లో మంచితనానికి విలువ లేదు."

"అలాగంటే, నే నొప్పుకుండేది లేదు. మంచికి, మంచిరోజులు యెప్పుడూ వుంటాయి వాటికోసం కాచుకొని వుండాలి మరి."

"నువ్వు యెంచక్కా మాట్టాడతావు వీరన్నా! నువ్వన్నది నిజం. ఫలితం యెలా వుంటుందో, చూద్దాం...ం" అనేసి లేచి వంటగదికేసి వెళ్ళిపోయింది తులశమ్మ.

వీరన్న ఏదో ఆలోచించుకుంటూ, ముందుగదికేసి నడిచాడు. అప్పుడే గడియారం మూడుగంటలు కొట్టింది.

# 13

ప్రతి మానవుడి జీవితంలోనూ, అసంఖ్యాకమైన సంఘటనలు తటస్థపడుతూ వుంటాయి. ఒక్కో సంఘటన, ఒకో విధమైన అనుభూతిని కలిగిస్తుంది. ఆ అనుభూతులు, యెటువంటి పరిణామాన్ని తీసుకువస్తాయో, యెవ్వరూ చెప్పలేరు. ఒకసారి హృదయానికి హత్తుకుపోయిన అనుభూతి, అంత సులువుగా చెదిరిపోదు.

రామరాజు జీవితంలో, మార్పు తీసుకురాగలిగిన సంఘటనలు అసంఖ్యాకంగా లేకపోయినా, వున్న రెండు సంఘటనలూ చాలు. అతని ప్రేమ విఫలత...తండ్రి హఠాత్తుగ చనిపోవడం; ఈ రెండు సంఘటలూ అతనిలో చెదరని నిస్పృహను సృష్టించాయి. అతని నిండు జీవితాన్ని నిరాశతో నింపాయి. అతనిప్పుడు ప్రయాణిస్తున్నది ఎడారిలాంటి భవిష్యత్తుకి. గమ్యంలేకుండా జీవితాన్ని సాగిస్తున్నాడు. అతని నిరాశదాహానికి, పురిశెడు మంచినీళ్ళు యెక్కడా లభ్యంకావడంలేదు.

రాత్రి తొమ్మిది కావస్తోంది. అప్పుడే వచ్చి వాలు కుర్చీలో కూలబడ్డాడు రాజు. అతనికి పదిఅడుగుల దూరంలో వీరన్న సవినయంగా నుంచున్నాడు.

"సుశీలమ్మగారు మధ్యాహ్నం వచ్చి వెళ్ళారండీ! వచ్చినట్టు మీతో చెప్పమన్నారు..." అన్నాడు.

రామరాజు వులిక్కిపడ్డాడు. సుశీల యెందుకు వచ్చినట్టు? ఆమె ఆంతర్యం ఏమిటి?... యెన్నో ఆలోచనలు అతనిలో తలెత్తాయి.

"ఇంకేమైనా చెప్పిందా?"

"లేదు బాబూ!"

"ఊం... యీ యింటికి శనిలా పట్టుకుంది. ఎప్పుడు విరగడవుతుందో యేమిటో!" పళ్ళుకొరుక్కుంటూ తనలో తనే అనుకొన్నాడు.

వీరన్న నిస్తపోయాడు. సుశీలమ్మగారిపై, బాబుకి యెందుకు అంత కోపమో, వాడికే బోధపడలేదు.

"అదేమిటి బాబుగారూ! అలా గంపోరు. ఆ యమ్మగారు మీ మంచినే యెప్పుడూ కోరతావుంటారు కదండీ?" సవినయంగా అన్నాడు

రామరాజు వీరన్నకేసి సూటిగా చూశాడు. "నీకు తెలీదురా వీరన్నా! ఆమెలో స్వార్థం బాగా పేరుకొని వుంది. ఏదో విధంగా నా అభిమానం సంపాదించి, నన్ను వివాహం చేసుకోవాలన్న కోరిక ఆమెలో విజృంభించుతోంది. అందుకే, ఈ ఆప్యాయత అంతాను" కసిగా అన్నాడు.

వీరన్న నోట మాటరాలేదు. సుశీలమ్మవంటి మనిషిని బాబుగారు యెందుకలా నిందిస్తున్నారోనని ఓ సారి తలపోశాడు.

"ఏంటో బాబూ! ఆ అమ్మగార్ని యెందుకలా అంటారు! సుశీలమ్మగారికి అటువంటి కపటబుద్ధి వుండి వుండదు. ఆమె చాలా మంచోరు అయినా బాబూ, తమనో విషయం అడగాలని వుంది కోపగించుకోరు గదా?"

"అడగరా! కోపమెందుకు వస్తుంది. చిన్నప్పట్నుంచి నన్ను యెత్తుకొని తిప్పినవాడివి నీమీద నాకు కోపమా!"

వీరన్నకి కాస్త ధైర్యం వచ్చింది. గొంతు సవరించుకొన్నాడు.

"నేరం కాదు బాబూ! ఇంట్లో ఆడదిక్కు లేదు. మీరా, ఒంటరిగా వుంటున్నారు. ఇలా యెన్నాళ్ళు వుండ

గలరు చెప్పండి..." అని చెపుతుంటే మధ్యలో అందుకున్నాడు రామరాజు.

"అందుకని, పెళ్ళిచేసుకోమంటావు. అంతేనా?" వీరన్న మొహంలోకి చూస్తూ అన్నాడు.

"పెళ్ళి యెప్పుడో ఓ సారి చేసుకుంటాను. అదికాదు బాబూ, నేను చెప్పేది. కోపగించుకోనని యెలాగూ మాటిచ్చారు కాబట్టి, నా మనసులోని మాట చెప్తాను సుశీలమ్మగార్ని పెళ్ళిచేసుకోండి బాబూ! ఆమెగారు ఈ యింట్లో వుంటే, మళ్ళీ లక్ష్మీదేవి తాండవించినట్టుగా, యిల్లంతా కళకళలాడుతూ వుంటుంది" భీతుగ్గానే చెప్పాడు.

రామరాజు కళ్ళు అప్రయత్నంగా అరుణకాంతిని పుంజుకున్నాయి. కోపం విజృంభించింది. అయితే కోపగించుకోనని మాటిచ్చాడు గనుక, తమాయించుకున్నాడు.

"ఈ వేళ యీ మాట అన్నావు మరెప్పుడూ అనకు వీరన్నా!" కోపాన్ని అణచుకొంటూ అన్నాడు.

"మీరు అనొద్దంటే మానేస్తాను బాబూ! కాని, నాన్నగారి కోరిక కూడా యిదేకదా బాబూ!"

రామరాజు, సాలోచనగా వీరన్న కేసి చూశాడు.

ఈ విషయాన్ని నీకు సుశీలే చెప్పిందా?"

"లేదు బాబూ! అమ్మగారు ఆ విషయమే ఎప్పుడూ అనేవారు కాదు పెద్దబాబుగారే నాతో ఓమారు ఈ మాటన్నారు"

"ఎవరు చెప్పినా, యికముందు ఈ ప్రస్తావన, నా దగ్గర తీసుకురాకు." నిష్కర్షగా చెప్పాడు కోపంగా.

వీరన్న తన అంతస్థు తెలుసుకొని, యింకేమీ అన లేక నోరుమూసుకొని అక్కణ్నించి మెల్లగాజారుకున్నాడు. క్షణం గడిచాక తులశమ్మ వచ్చింది

"వడ్డించేదా బాబూ?"

'మరిప్పుడు భోంచెయ్యను...' ముక్తసరిగ చెప్పాడు రాజు.

తులశమ్మలో ఏవేవో ఆలోచనలు మొలకెత్తినయ్. సుశీలమ్మ అన్నట్టు, తను సలహా యివ్వవచ్చుగా!... అనుకుంది.

'బాబూ! నేనో మాట అంటాను మీరు కోపగించుకోకండి. ఇటీవల మీరు మరీ విచిత్రంగా తయారవుతున్నారు. మధ్యాహ్నం యింట్లో భోజనం యెలాగూ చెయ్యడంలేదు, రాత్రిపూట అయినా కాస్త యెంగిలి పడక పోతే, యింకేవిఁటీ? మీ ఆరోగ్యం విషయం యేమన్నా ఆలోచిస్తున్నారా- రోజుకిరోజూ మీరు యెలా చిక్కిపోతున్నారో, మీకు తెలీదు. మిమ్మల్ని చూస్తున్నవాళ్ళకి తెలుస్తుంది."

ఇన్నాళ్ళుగ తులశమ్మ, యింట్లో వుంటున్నా, యెప్పుడూ హితబోధ చెయ్యలేదు. ఆమెలో అంత ధైర్యం వుండేది కాదు. కాని, యీ రోజు ఆమె మాటలు విని ఆశ్చర్య పోయాడు. అనుకోకుండా అతనిలో ఆవేశం ప్రజ్వరిల్లింది. అయితే, ఆ ఆవేశాన్ని ప్రదర్శించలేదు.

"తులశమ్మ, యెప్పుడూ లేనిది యీరోజు నా ఆరోగ్యంవిషయం గుర్తుకు తెస్తున్నావేవిఁటి? నన్ను నిలదీసి అడగమని సుశీల చెప్పిందా?" గంభీరంగా అడిగాడు.

తులశమ్మ తటపటాయించింది. బహుశా, సుశీలమ్మ వచ్చినట్టు వీరన్న చెప్పివుంటాడనుకొంది.

'అబ్బే అటువంటిదేం లేదు బాబూ! కేవలం మీ యోగక్షేమాలు తెలుసుకుని వెళ్ళడానికే ఆమె వచ్చారు.'

'ఊఁ... అలాగా! సరేలే. నా ఆరోగ్యం విషయం, నాకు తెలుసు. ఆ విషయం, నాకు యెవ్వరూ జ్ఞప్తికి తీసుకురానవసరం లేదు. పైగా, నీ నుండి సలహాలు పొందేటంతటి స్థితికి నే నింకా రాలేదు. ఆ విషయం గుర్తుంచుకోవడం శ్రేయస్కరం.' కటువుగానే అన్నాడు

తులశమ్మ తెల్లమొహం వేసింది. ఆ మాటలు ...కి చెంపపెట్టులా తగిలినయ్. తను అనవసరంగా కలిగించుకొని, అతని మనస్సుకి బాధ కలిగించిందేమోననుకుంది.

'క్షమించండి బాబూ! అనవసరంగా మీకు నొప్పి కలిగించాను. వృద్ధురాలను. జీవితంలో యెంతో అనుభవాన్ని గడించాను. మీరు రోజురోజుకీ మారిపోతూవుంటే చూస్తూ ఊరుకోలేక, నా వయస్సుకి విలువిచ్చి కోపగించుకోరన్న నమ్మకంతో, నా మనసులో వున్న మాట చెప్పాను. నేను తప్పుచేస్తే, క్షమించమని మరోసారి అర్థిస్తున్నాను. ఇంకెపుడూ యిటువంటి పొరపాటు జరగదు' అని ముగించి అక్కణ్ణించి చరచరా వెళ్ళిపోయింది. ఆమె గొంతు బొంగురుపోవడం, రాజు గమనించాడు.

రామరాజు మెదడు ఆలోచనల్లో పడింది. తులశమ్మ చెప్పినదాంట్లో తప్పేముంది? ఆమె తన శ్రేయస్సుకే చెప్పింది. నిజానికి ఆమె చెప్పినట్లు తను ఆరోగ్యవిషయం

విస్మరిస్తున్నాడు. పాపం, చూస్తూ చూస్తూ అడక్కుండా వుండలేకపోయింది. ఆమెను వారించడంలో తను తొందర పడ్డాడేమో! ఆమె వయస్సుకి అయినా విలువ యివ్వలేకపోవడం, తను చేసిన పెద్ద పొరపాటు... ఈ విధమైన అతని ఆలోచనలకు అంతం లేకపోయింది.

'రాజూ! ఒరేయ్ రాజూ!' వీధిలోంచి పిలుపువినిపించింది. ఆ గొంతు మేనమామదేనని యిట్టే పసిగట్టేశాడు రామరాజు. అతను ఈ సమయంలో యెందుకు వచ్చాడో అంతుచిక్కలేదు ఏమైనా అతని రాక రాజుని ఆనందపర్చ లేదు. ఆ క్షణంలో 'రామావయ్యా!' కాస్త స్వరం హెచ్చించి అన్నాడు.

క్షణంలో ధర్మారావు లోపలికి వచ్చాడు. వస్తూనే రాజుకి యెదురుగా వున్న కుర్చీలో ఆదరా బాదరాగా కూర్చుంటూ;

"మూడురోజుల్నించి వరుసగా తిరుగుతున్నాన్రా నీ కోసం..." అన్నాడు.

"నా కోసమా?" వింతగా అన్నాడు.

"ఔనురా! నీ కోసం కాకపోతే, యింక యీ యింట్లో యెవరున్నారు?"

"నువ్వు వచ్చినట్టు నాతో వీరన్న కూడా చెప్పలేదు మావయ్యా!"

"ఎవరన్నా నాకు అగుపిస్తేగా చెప్పడానికి? నోరు నొప్పిపెట్టేలా అరవడమూ, వెళ్ళిపోవడమూ జరిగింది ఈ

మూడురోజులూను. జవాబు చెప్పడానికి కూడా యెవరూ పూనుకోలేదు అప్పుడు ఊహించాను — యింటికి నువ్వు ఆలస్యంగా వస్తున్నావని."

"ఔను మావయ్యా! ఆలస్యంగానే వస్తున్నాను యిటీవల..."

"నా ఊహ నూరుపాళ్ళు కరెక్టన్నమాట..." అంటూ ఓ సారి రాజు మొహంలోకి తీక్ష్ణంగా చూసి;

"అదేవిట్రా అలా చిక్కిపోయావు? సరైన సదుపాయం లేనట్టుంది యింట్లో. ఔను యెలా వుంటుందిలే! నీ మంచిని పట్టించుకునే వాళ్ళెవ్వరూ లేకనే యిలా తయారయ్యావు. నేనే ఇంతగా ఆశ్చర్యపోతున్నాను; నీ అత్తయ్య చూస్తే, మరీ యిదవుతుంది. ఇది నాకేం నచ్చలేదు సుమా! ఇలా యెన్నాళ్ళు వ్యథాభరితమైన జీవితాన్ని నిస్సారంగా సాగిస్తావు? దానికి అంతం అంటూ లేదా! అందుకే అంటాను – వివాహం చేసుకోరా అని..." అన్నాడు, యెంతో అభిమానం, ఆత్మీయతా ఒలకపోస్తూ.

"ఆ విషయం, మరి తీసుకురాకు మావయ్యా! వివాహం చేసుకోవాలన్న తలంపు నాలో సమసిపోయింది."

ధర్మారావు భారంగా నిట్టూర్చాడు, "ఔన్రా! నీలో యీ నిస్పృహ కలగడానికి కారణం ఏవిటో నేనూ విన్నాను. తొలిప్రేమ విఫలమవ్వడం, జీవితంలో గొప్ప షాకే!"

రామరాజు ఆశ్చర్యంగా మావయ్యకేసి దృష్టిని సారించాడు. మావయ్యకి ఈ వైనం యెవరు చెప్పారా అన్నదే అతని ఆశ్చర్యానికి కారణం.

"నీకు యెవరు చెప్పారు మావయ్యా!"

"ఒకరు చెప్పాలేవిటా? ఇటువంటి విషయాలు విద్యుత్తులా అల్లుకుంటాయి. లోకులు కాకులని పెద్దలు ఊరికినే అనలేదు. పలువురు అనుకుంటూ వుండగా విన్నాను. ఒకరిద్దరు, నా మొహాన్నే అడిగేశారు. నేను నీ మేనమామనని చాలమందికి తెలుసుగా మరి..."

రామరాజు మౌనం వహించాడు క్షణం తన ప్రేమ విఫలత యింతగా ప్రచారమయినందుకు బాధపడ్డా[illegible] లోలోన. అదొక అవమానంగా భావించి కృంగిపోయాడు.

"నువ్వెందుకురా యింతగా బాధపడతావు రాజు? ప్రేమ విఫలత పొందిన వాళ్ళంతా, నీలానే నిస్పృహతో కృంగిపోతే, ప్రపంచంలో యెక్కువమంది పిచ్చివాళ్ళే వుండేవారు. జీవితంలో సంఘటిల్లే ప్రతీ సంఘటనకీ చలించిపోతున్నామా? లేదు. అలాగే, దీన్ని సాధారణ సంఘటనగా తీసుకొని మర్చిపోవాలి. అంతేగాని, యిలా మొండి పట్టుపట్టుకూర్చొంటే, ప్రపంచానికేం నష్టం లేదు" అన్నాడు మళ్ళీ ధర్మారావు.

రామరాజుకి యీ బోధన బోర్ కొట్టింది.

"ఇంతకీ, నువ్వు వచ్చిన పనేవిటి మావయ్యా?"

అతను విసిగిపోయినట్టు, ఆ ప్రశ్నే చెప్తోంది. ధర్మారావు

దాన్ని అంతగా పట్టించుకోలేదు. అవకాశవాదులూ, స్వార్థపరులూ, అటువంటివాటిని అంతగా పట్టించుకోరు కూడాను.

"ప్రత్యేకించి పనంటూ యేమీ లేదురా; నువ్వెలా వున్నావో యేమిటోనని, మీ అత్తయ్యే వూరికే ఆతృత పడుతోంది. అందుకే నిన్నోసారి కలుసుకుని పోదామని వచ్చాను. అంతే, ఓసారి వీలుచూసుకొని రమ్మందియింటికి. పరాయి వాళ్ళమా యేమిటి? సన్నిహిత సంబంధంగల వాళ్ళం. మీనాన్న అనవసరమైన అపోహలు మనసులో పెంచుకొని, మమ్మల్ని దూరంగా వుంచాడుగాని, నువ్వూ అలాగే ప్రవర్తిస్తానంటే యెట్లా చెప్పు? మీ అమ్మ బ్రతికి వుంటే, మన బాంధవ్యమే వేరుగా వుండేది. అవన్నీ యిప్పుడెందుకులే..."

"అమ్మను జ్ఞప్తికి తీసుకురాకు మావయ్యా; నాకు మరీ బాధగా వుంటుంది."

"సరేలేరా! నువ్వు మాత్రము రేపు ఓసారి యింటికి రా!"

"వీలుచూసుకుని వస్తాలే మావయ్యా!"

"మరి, వెళ్ళొస్తానవుతే. ఆఁ..." అంటూ నిష్క్రమించాడు ధర్మారావు.

కొందరికి భార్య ఆధిక్యతను వెల్లడించుకోవడం, ఆమె సంగతులు చెప్పడం అలవాటు. వారు తమ వ్యక్తిత్వం మర్చిపోతారు. ఆ కోవకి చెందినవాడే ధర్మారావు.

మావయ్య వెళ్ళిపోయాక దీర్ఘంగా నిట్టూర్పు వది లాడు రాజు. పదిగంటలు కొట్టింది గడియారం. అక్క ణ్ణించిలేచి మెల్లగా తన గదిలోకి చేరాడు.

## 14

నాలుగురోజుల తర్వాత, మళ్ళీ వచ్చింది సుశీల. తులశమ్మ; తనకీ రామరాజుకీ జరిగిన సంభాషణ యావత్తూ చెప్పింది బాధతో. అంతా విని, సుశీల వేడినిట్టూర్పు విడిచింది.

“అకారణంగా బావకోపానికి గురి అయ్యావు తుల శమ్మా! అందుకు నేనూ బాధపడుతున్నాను. బావ తత్వమే అది కాకపోయినా యిటీవల అతనిలో కలిగిన పరిణామాల వల్లనే అంత కటువుగా ప్రవర్తించాడు. మరేమీ అను కోకు.”

“అనుకోవడానికి యిందులోఏమీ లేదుఅమ్మగారూ! బాబుగారి మనసు నాకు తెలియదు గనకనా? కాని, బాబుగారు తన పొరపాటు యెందుకు తెలుసుకోవడం లేదా, అనే నేను బాధపడుతున్నాను. పైగా, మీమీద యెందుకో కసి...?”

“అది నా దరదృష్టం తులశమ్మా! తెలిసి నేనేమీ అపకారం చెయ్యలేదు బావకి. నాపట్ల బావకి యేం దురభి

ప్రాయం వుందో, నాకే తెలీదు. దానికేం చేస్తాను? ఏమైనా నాకు కావల్సిందంతా అతని శ్రేయస్సే!" అంది ఆవేదనతో.

"అంతా విడ్డూరంగా వుందమ్మా! ఎవరన్నా మీ మీద, చాడీలు చెప్తున్నారేమో!"

సుశీల చిన్నగా నవ్వింది.

"నామీద చాడీలు చెప్పేవాళ్ళు యెవరుంటారు తులశమ్మా! నాతో విరోధమున్న వాళ్ళెవరూ లేరే!"

"మీవంటి అమాయకులు, యీ ప్రపంచంలో యెవరూ వుండరమ్మా! ఆ ధర్మారావుగారు లేరూ! ఆయనే చెప్పివుంటారు..."

"ఆయనా? ఎందుకు చెప్తారు? అతనితో నాకేమీ విరోధం లేదే!"

"విరోధం అవసరం లేదమ్మా! అతని స్వార్థమే యిందుకు కారణం కావచ్చు వాళ్ళమ్మాయి యుక్త వయసులో వుందికదా! ఏదో విధంగా బాబుగారి మనసు విరిచి, మీ పట్ల ద్వేషం కలిగిస్తే, బాబుగారి దృష్టిని వాళ్ళమ్మాయి మీదికి తిప్పాలని తాపత్రయ పడుతున్నారేమో!"

సుశీలకు నవ్వొచ్చింది. నవ్వింది కూడాను. బావ తనని పెళ్ళి చేసుకుంటానని పట్టుబట్టినప్పుడు కదా, ఆయన యీ ప్రయత్నానికి దిగవల్సింది.

"ఇది నిజం కాకపోవచ్చు తులశమ్మా! బావ, నన్ను వివాహం చేసుకుందుకు సిద్ధపడినప్పుడు, ధర్మారావుగారు నామీద చాడీలు చెప్పి బావమనసు మార్చడానికి ప్రయ

త్నించినా అర్థం వుండేది. కాని, పరిస్థితి అదికాదే! బావ నన్ను ద్వేషిస్తూనే వున్నాడు..."

"ఆ విషయం ధర్మారావుగారికి తెలీదేమోనమ్మా!"

సుశీలకు, ఆ విషయం గురించి యింక ఆలోచించాల్సిన అవసరం లేనట్టు తోచింది.

"పోనీలే తులశమ్మా! ఒకవేళ అదే జరిగినా, నేను నిరుత్సాహపడను. బావ యెవర్ని వివాహం చేసుకున్నా, అతను సుఖంగా వుండటమే నాకు కావాలి." అంది సుశీల. ఆమె మాటలు కాస్తంత బొంగురు పోయాయనడానికి సందేహం లేదు. ఆమె అంతరంగంలో యేదో బాధ వున్నట్టు చూచాయగా తెలుస్తూనే వుంది.

తులశమ్మ, గట్టిగా నిట్టూర్చింది.

"ఈ రోజుల్లో, యింత మంచితనం పనికిరాదమ్మా!"

సుశీల మందహాసం చేసింది.

"తులశమ్మా! న్యాయానికి, ధర్మానికి, యెప్పుడూ సమ విలువ వుంటుంది. ఆ నమ్మకం, నాలో వుంది. అదే నన్ను ముందుకు సాగిస్తోంది. ఇప్పటికే చాలా వేళయ్యింది, మళ్ళీ వస్తాలే! ఈ పర్యాయం, బావ యింట్లో వున్నప్పుడే వస్తాను. అతను యేమనుకున్నా, తన ఆరోగ్యం చూసుకోమని చెప్పడం నా ధర్మం. వెళ్ళొస్తా." బైలుదేరింది సుశీల.

"మంచిదమ్మా!" అనేసి సుశీల వెంట ముంగిలి గది వరకూ వచ్చింది తులశమ్మ.

అప్పుడే వచ్చిన రామరాజు యెదురయ్యాడు వీధి గుమ్మం దగ్గర. తులశమ్మ స్తంభించి పోయింది. ఆమె నోట

మాటరాలేదు. పక్కకి తప్పుకుంది. సుశీల, త తరపాటు పడలేదు. అయినా, ఆమె భయపడాల్సిన అవసరం యేమిటి?

సుశీలవేపు, తీక్ష్ణంగా చూశాయి అతని నయనాలు. కనుబొమలు ముడివడ్డాయి ఆ ప్రయత్నంలో. చెక్కిళ్ళు, కోపంతో యెర్రదనాన్ని సంతరించుకున్నాయి. బావ తనవేపు ప్రసరిస్తున్న కోపోద్రిక్త దృక్కుల్ని పసిగట్టింది సుశీల. తనలో తనే నవ్వుకుంది. వాళ్ళిద్దరి మౌనం గమనించి, యేం ప్రళయం వస్తుందోనన్న భీతితో అక్కణ్ణించి జారుకుంది తులశమ్మ.

"ఏమిటి బావా, అలా చూస్తున్నావు? నీ అనుమతి లేకుండా నీ యింట్లో అడుగుపెట్టాననా?" మందహాసంతో అంది సుశీల.

రామరాజు లోపలికి వచ్చేస్తూ;

"ఈ యింట్లో నీ ప్రవేశానికి, నా అనుమతి వుండాలని అనను గాని, నువ్వు రావడం, అనవసరమంటే, కాదనవను కుంటాను." వెటకారంగా అన్నాడు.

"నీ యోగక్షేమాలు తెలుసుకుందుకు రావడం కూడా అనవసరమనే అంటావా బావా?"

"కేవలం, యోగక్షేమాలు తెలుసుకుందుకే వస్తున్నావా?"

"లేకపోతే, వేరే కారణం యేముందని?"

"ఏముందో నీకే తెలుసును...."

"నాకు తెలిసినంతవరకూ మరే యితర కారణం లేదు బావా!"

"ఎందుకు అబద్ధం చెప్తావు సుశీలా? నిన్ను వివాహం చేసుకోవడానికి, నిరాకరించానని నీకూ తెలుసు. అందుకే, పట్టుదలతో యెలాగైనా, నా మనసు మార్చి, నా అభిమానాన్ని చూరగొనాలని ప్రయత్నిస్తున్నావు. ఔనా?"

సుశీలకి అతని, మాటలు ఆశ్చర్యం కలిగించలేదు. ఎందుకూ అంటే, బావ యెప్పుడూ తనని గురించి అదే అభిప్రాయంతో వున్నాడు. కాస్త గట్టిగానే నవ్వింది. అదేవిఁటో మరి... అప్పుడా నవ్వుని ఆపుకోలేక పోయింది.

"ఎందుకట్లా నవ్వుతావు ? నీ కుత్సితపుటాలోచనకి నువ్వు సిగ్గుపడాలిగాని,నవ్వకూడదు..." కోపంగా అన్నాడు.

బావ తొందరపాటుకి, సుశీలకి కోపం వచ్చింది. అవుతే, తమాయించుకుంది.

"నీ అవివేకానికి, నవ్వువస్తోంది బావా! నువ్వు అనవసరంగా నన్ను అపార్థం చేసుకుంటున్నావు.నువ్వు వూహించినట్టు, యే విధమైన కుత్సితపు బుద్ధీ నాలో లేదు. దైవ సాక్షిగా చెబుతున్నాను. ఇంకా నీకు నమ్మకం చాలదా? నన్ను వివాహం చేసుకోవడానికి నువ్వు నిరాకరించావన్న విషయం, నాకు తెలుసు! అది తెలిసి కూడా, ని మనసు మార్చడానికి నేను ప్రయత్నిస్తున్నానని యెలా అనుకుంటున్నావో, నాకు అవగాహన కావడం లేదు. బలవంతంగా యెవరి మనసూ మార్చలేమని, నీకు మాత్రం తెలీదా?"

"అయితే, మరెందుకు నన్ను నీడలా అనుసరిస్తున్నావు?" విసుగ్గా అన్నాడు.

"అలా అడుగు చెప్తాను. మావయ్యకి, నువ్వంటే ప్రాణప్రదంగా వుండేది. ఆయన, అంతిమఘడియల్లో కూడా, నీ గురించే తలపోశారు. అంటే, ఆయన హృదయపు లోతును తెలుసుకో! జీవితంలో ఆయన యెన్నో వుత్తమ కార్యాలు చేశారు. అయితే, ఒక్కటే వెలితిగా వుండిపోయింది. ఏవిటో తెలుసా? నిన్ను ఓ యింటివాడిగా చెయ్యలేక పోవడమే! ఆ వ్యధ ఆయన్ని క్షణక్షణం బాధిస్తూ వుండేది. ఈ ప్రపంచంలో, ఆయన మరణానంతరం నిన్ను ఆదుకునే వారు, నీడలా అనుసరించేవారూ యెవ్వరూ లేరని తలపోస్తూ; కుమిలిపోయేవారు. ఆయన మాటల ధోరణిలో యిది గమనించాను. మావయ్య యీ ప్రపంచం నుండి దూరమౌతున్నారన్న వ్యధ ఒకవేపూ, ఆయన ఆ అంతిమ ఘడియల్లో కూడా అనుభవిస్తున్న మానసికావేదన మరోవేపూ, నన్ను కలచివేసినై; కదల్చినయ్. నాలో ఒక దృఢ సంకల్పాన్ని మొలకెత్తించాయి. మావయ్య పట్ల, నాకు జాలి, గౌరవం యినుమడించాయి. అప్పుడే మాటివ్వక తప్పలేదు. నేనిచ్చిన మాట యేవిటో తెలుసా బావా? నువ్వు వూహించలేవు. నా జీవితం యెలావున్నా, నా భవిష్యత్తు యెన్ని ఒడుదుడుకులతో నిండివున్నా, సర్వకాల సర్వావస్థలలోనూ నీ శ్రేయస్సుకే పాటుపడతానని మాటిచ్చాను. అప్పుడుగాని, మావయ్య హృదయం కుదుటపడలేదు. అందుకే, నీ యోగక్షేమాలు తెలుసుకోవడం అవసరం బావా! నాలో యే విధమైన స్వార్థమూ లేదని, యిప్పటికైనా తెలుసుకొని వుంటావనుకుంటాను." చిన్న వుపన్యాసంలా చెప్పి, ముగించింది.

రామరాజు హృదయానికి, ఒక నీలితెర కప్పబడి వుండటం వల్ల, సుశీల చెప్పింది ఆ తెర చీల్చుకొని హృదయానికి హత్తుకోలేదు. ఆమె చెప్పిందంతా, యెడారిలో రోదన అయ్యింది. అందులో యేమాత్రం, నిజం స్ఫురించలేదు అతనికి.

"ఈ కట్టుకథని నేను నమ్మను... నమ్మలేను..." అన్నాడు కర్కశంగా.

సుశీల యెంతో బాధపడింది, బావ మూర్ఖత్వానికి. భారంగా ఓ నిట్టూర్పు వదిలింది. ఆ నిట్టూర్పులోనే, ఆమె అంతరంగపు వ్యథ అవగాహన అవుతోంది.

"నువ్వు నమ్మలేక పోవడం, నా దురదృష్టం బావా! కాని, దీన్ని కట్టు కథగా మాత్రం భావించకు. మరి, నేను వెళ్తొస్తా! వెళ్ళేముందు, నిన్ను అర్థించేది ఒక్కటే, గతాన్ని పదేపదే జ్ఞప్తికి తెచ్చుకుంటూ, నిరాశా నిస్పృహలతో నీ జీవిత పథాన్ని కంటకావృతం చేసుకోకు. క్రొత్త వుత్సాహాన్ని పుంజుకొని, ముందడుగు వెయ్యడానికి ప్రయత్నించు. అదే మావయ్య ఆత్మకు శాంతిని, తృప్తిని, కలిగించే పరమౌషధం. నీ సంతోషమే, ఆయన ఆత్మ సంతృప్తి. ఇది మాత్రం మరిచిపోకు."

రామరాజు వెటకారంగా నవ్వేడు. ఆ నవ్వు, ఆనందంతో వెలువడింది కాదు. అందులో కోపం ప్రతిఫలిస్తోంది.

"ఇక నీ వుపన్యాసం కట్టిపెట్టవచ్చు సుశీలా! నీ చేత కూడా నీతులు చెప్పించుకునే టంతటి మూర్ఖుణ్ణి కాదు నేను.

వెళ్ళిక. ఇంక యెప్పుడూ యిక్కడికి రావడానికి ప్రయత్నించకు..." అన్నాడు.

సుశీల కలవరపడింది.

"నా రాక నీకు యెటువంటి యిబ్బందీ కలిగించదని చెప్తున్నా, యింక నామీద యెందుకీ కక్ష బావా" ప్రాధేయపూర్వకంగా అంది.

"అనవసరంగా నీతో వాదించ్తూకూర్చోలేను. వెళ్ళిక..." యీ సారి ఆజ్ఞాపించాడు.

సుశీల సహనం గడ్డకట్టుకు పోయింది. "సరే!" అనేసి బాధగా నిష్క్రమించింది.

లోపలి గదిలోంచి అంతా వింటూన్న తులశమ్మ యెంతో బాధపడింది రాజు ప్రవర్తనకి. సుశీలకు జరిగిన అవమానం తన అవమానంగానే భావించి కుమిలిపోయింది. "తులశమ్మా!" రామరాజు కేక వినిపించింది. త్రుళ్ళిపడింది. చరచరా వెళ్ళింది అతని సముఖానికి.

"ఏం చేస్తున్నావు" కోపంగానే ప్రశ్నించాడు.

తులశమ్మ తడబడింది. ప్రక్క గదిలో వున్నానని చెప్పడం, ప్రమాదంగా తోచింది. అబద్ధం చెప్పాలనుకుంది.

"వంటగదిలో వున్నాను బాబూ!" కాస్త తడబడుతూనే జవాబిచ్చింది.

సుశీలకూ, తనకూ జరిగిన సంభాషణ, తులశమ్మ వినలేదన్న నిర్ధారణకు వచ్చాడు రామరాజు. తృప్తిగా శ్వాస వదిలాడు.

"చూడు తులశమ్మా; ఈ రోజునుంచీ, సుశీల మనింటికి రాకూడదు. నా మాటకి వ్యతిరేకంగా జరిగిందా, పరిణామం చెడ్డగా వుంటుందని మాత్రం గుర్తుంచుకో; వెళ్ళి కాఫీ తీసుకురా!" కుర్చీలో చేరబడ్డాడు.

తులశమ్మ అక్కణ్ణించి వెళ్ళిపోయింది. అతని ఆవేశానికి, సుశీలపట్ల ద్వేషానికీ అసలు కారణమేమిటో, ఆమె వూహకి అందలేదు. ఇన్నేళ్ళ ప్రపంచానుభవం వృథా అయ్యింది.

## 15

ఆకాశం, నల్లని మేఘాలతో ఆచ్ఛాదితమై వుంది. ఏ క్షణంలోనైనా వర్షం రావచ్చునన్నట్టుగా వుంది వాతావరణం.

సాయం సమయం. రాజు యింటికి వెళ్తూ వెళ్తూ, ఆ రోజు మావయ్య చెప్పినమాటలు గుర్తుకు రావడంతో, వాళ్ళింటికి నడిచాడు. అప్పుడే వీధిలోకి బైలుదేరుతున్న ధర్మారావు. రాజునిచూసి మహదానందంతో ఆగిపోయాడు.

"నీ దగ్గరికే రావాలనుకుంటున్నానురా! పద లోపలికి..." రాజుని లోపలికి తీసుకుపోయాడు. నిజానికి అతను బైలుదేరింది వేరే చోటుకి వెళ్ళాలని. అయితేనేం_లౌక్యం

తెలిసినవాడు సరి! భార్యను కేకేసి, రాజుకి యెదురుగానే కూచున్నాడు.

రామరాజు గదినంతా కలయచూశాడు. గదిచిన్నదే అయినా, పరిశుభ్రంగా వుంది.

సుభద్రమ్మ లోపల్నించి వచ్చి, అభిమానం వుట్టి పడేలా నవ్వుకుంటూ పలుకరించింది రాజుని.

"బాగా చిక్కిపోయావు రాజూ! నిన్నుచూసి చాలా రోజులయ్యిందాం, యెలా వున్నావో, ఏమిటోనని ఒకటే ఆతృతగా వుండేది. పోనీ, నేనే మీయింటికి వద్దునా అని అనుకుండేదాన్ని. కాని, తీరిక యేదీ? ఉదయం లేచింది మొదలు, రాత్రి నిద్రపోయేవరకూ ఓనిమిషం తీరికవుండదు. పెద్దమ్మాయి వుందీ అంటే, దాన్ని యింటి పనుల్లోకి చేరనివ్వను. దానికి సంగీతమంటే, పంచప్రాణాలు. దాన్ని ఆ ప్రపంచంలోనే వుండమంటాను. ఒకవేళ అబ్బడమే కష్టం. ఆ అభిలాష యెందుకు పోగొట్టడం చెప్పు...? అదిగో, ఆ పాట విన్నావా!" అంటూ ఆగిపోయింది.

ప్రక్క గదిలోంచి ఓ త్యాగరాయకృతి వినిపిస్తోంది శ్రావ్యంగా. తను యింట్లోకి అడుగుపెట్టేసరికి, యే పాటా విననట్టు గుర్తు. బహుశా, ఆమె సంగీతం నేర్చుకుంటోం దని తనకి తెలియజెయ్యడానికే, యీ యేర్పాటు చేసి, వుండాలని భావించడానికి, అతను యెక్కువ సమయం తీసుకోలేదు. సుభద్రమ్మ మాటకి జవాబు చెప్పనేలేదు.

"ఎలా వుందిరా పాట!" యీసారి ధర్మారావు కలిగించుకున్నాడు.

"నాకు సంగీతంలో యేమీ పరిజ్ఞానం లేదు మావయ్యా! ఎలా వుందంటే, నేనేం చెప్పగలను?"

ధర్మారావు నవ్వేడు.

"పిచ్చివాడా! సంగీతాన్ని విని ఆనందించడానికి, అందులో ప్రవేశం అక్కరలేదు. హృదయం వున్న వాళ్ళెవరైనా ఆనందించ గలరు."

"ఆ మాట నిజమే మావయ్యా! సంగీతం వింటే, యెవరికైనా యేదో తెలియని ఆత్మీయత కలుగుతుంది. మీ అమ్మాయి పాటమాత్రం శ్రావ్యంగా వుంది."

"ఔనా మరి! మా శ్యామల గొంతులోనే వుంది ఆ మాధుర్యమంతాను..." అన్నాడు ధర్మారావు మురిసిపోతూ.

"ఆ మాటకేంగాని రాజూ, యిప్పుడు యెందుకు కబురుపంపించానో తెలుసా?" అంది సుభద్రమ్మ సూటిగా రాజు మొహంలోకి చూస్తూ.

"చెప్పనిదే యెలా తెలుస్తుంది అత్తయ్యా?"

"ఇంట్లో సరైన భోజన సదుపాయంలేక బాగా చిక్కిపోయావు. ఆడదిక్కులేని యింట్లో యేం సదుపాయాలు జరుగుతాయి? ఎంత వండిపడేసినా, వంటమనిషి వంటమనిషే! వాడికి ఆత్మీయత యెక్కణ్ణించి వస్తుంది? అందుకే, మేం ఒక నిర్ణయానికి వచ్చాం. ఏమిటో తెలుసా? రేపట్నుంచి, నువ్వు మా యింట్లోనే భోజనం చేద్దువుగాని. నీ ఒక్కడికోసం ఓ వంటమనిషెందుకు? దానికి తిండీ, జీతం శుద్ధ దండుగ" అంది సుభద్రమ్మ.

వారి ఆప్యాయతకూ, ఆదరణకూ, ఆశ్చర్యంతో తికమక పడ్డాడు రామరాజు. ఇంతటి ఆత్మీయుల్ని నాన్న, బాబాయ్ యెందుకు 'అసహ్యించుకున్నారో, అతనికి అవగాహన కాలేదు. అవుతే, నాన్న యెప్పుడూ అంటూవుండేవాడు – మీ మావయ్య గొప్ప స్వార్థపరుడురా అని! స్వార్థం యెవరిలో వుండదు? ద్వేషించవలసినంత అసహ్యముగా మావయ్య ప్రవర్తించడం లేదే!... రాజు మెదడు క్షణంసేపు తీవ్రంగా పని చేసింది. వెంటనే మాట్లాడలేక పోయాడు.

"ఏమంటావురా? ఏమిటా ఆలోచన? స్వయానా మేనమామనుగాబట్టి, యింత శ్రద్ధ తీసుకుంటున్నాను. లేకపోతే, వూరందరికీ నీ శ్రేయస్సుచూసే అవసరం వుంటుందా? అసలు, ఆలోచించవల్సిన పనే లేదంటాను..." రాజుకి ఆలోచించే అవకాశం కూడా లేకుండా వెనకపాట ప్రారంభించాడు ధర్మారావు.

"ఆలోచిద్దాంలే మావయ్యా! ప్రస్తుతానికి, నాకేమీ యిబ్బంది లేదుగా!" అన్నాడు రాజు.

సుభద్రమ్మకి యీ జవాబు కొంత నిరుత్సాహాన్ని కలిగించింది. ఏదో అనబోయేటంతలో భర్త ప్రారంభించడం, ఆతృతను తగ్గించింది.

"మంచివాడివేన్రా రాజూ! ఇబ్బంది లేదని చాలా తేలిగ్గా అంటున్నావేమిటి? నీ యిబ్బంది నీకు తెలీదు. మీ నాన్న పోయాడన్న వ్యధతో, నీ యిబ్బందిని పట్టించుకోలేక పోతున్నావు. అయినా, నీకు యిదేం పరాయి కొంప

కాదే! తాతగారిల్లు. స్వంత యింట్లోవలె యిక్కడ నీకు అధికారం, హక్కు, వున్నాయి. ఏమిటి నీ అభ్యంతరమో, నాకు బోధపడ్డంలేదు. ఎందుకింత ఆలోచన?" అన్నాడు ధర్మారావు బోధపర్చే ధోరణిలో.

సుభద్రమ్మకి, భర్త హితబోధ బాగా నచ్చింది. ముసిముసి నవ్వుకుంది. రాజుని యెలాగో భర్తే నచ్చచెప్పి దారికి తీసుకువస్తాడన్న నమ్మకం యేర్పడిం దామెలో.

"మాట్లాడుతూ వుండండి; కాఫీ పంపిస్తాను...." వుత్సాహంగా లోపలికి నిష్క్రమించిది సుభద్రమ్మ.

"ఆలోచనేమీ లేదు మావయ్యా! కొద్దిరోజులు యిలా గడవనీయండి. ఆతర్వాత మీరన్నట్టుగానే చేద్దాం" ఆ సమయానికి యెలాగో తప్పించుకొని బయటపడాలని అలా అనేశాడు రాజు.

"అదీ, అలా అన్నావు బాగుంది. బాగా ఆలోచించే మేం యీ నిర్ణయానికి వచ్చాంరా! మామాట కొట్టిపార వేయవని మాకూ తెలుసు. నీ అభిప్రాయం వింటే, మీ అత్తయ్య, శ్యామల, యెంత ఆనందిస్తారనుకొన్నావు! నిజం చెప్పాలంటే, నువ్వేదో యిబ్బంది పడుతున్నట్టు శ్యామలే బాధపడుతూ వుండేది. దానిదిచాలా సున్నితహృదయం... సరేలే! అవన్నీ యిప్పు డెందుకుగాని, సుశీల ప్రస్తుతం యేం చేస్తున్నట్టు?"

మావయ్య మాటలు, రామరాజుని ఆలోచింప జేశాయి. ఆయన శ్యామల అన్నట్టు చెప్పడం దేనికి? అందు లోని అంతరార్థం యేమిటి...? అనుకున్నాడు.

"సుశీల యేదో వుద్యోగం చేస్తున్నదని విన్నాను మావయ్యా!" ఆయన అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పాడు.

"ఎందుకో ఆవుద్యోగం చెయ్యడం? హాయిగా పెళ్ళి చేసుకుని కాపరం చేసుకుంటే కాదూ?"

"ఎవరూ?" ఆశ్చర్యంతో అన్నాడు. తనని వుద్దేశించి మావయ్య అంటున్నాడేమోనని అలా అడిగాడు.

"సుశీలేనా! మీబాబాయ్, తనతో ఆమెను వచ్చేయమన్నాడటగా! అలా వెళ్ళిపోయి, చక్కా వాళ్ళ అదుపు ఆజ్ఞల్లో వుంటే, యేదో ఒహ సంబంధం చూసి, ఆమెను ఓ యింటిదానిగ చేసేవారుగా! అలా కదిలింది కాదు. ఔను యెందుకు కదులుతుంది. చదువుకుంది వుద్యోకీనేనా?..." అని చెప్పుకుపోతున్న ధర్మారావుని తన మాటలతో ఆపేశాడు.

"ఆమె విషయం మనకెందుకులే మావయ్యా!" ప్రసంగం మార్చాలని రాజు ప్రయత్నం.

ధర్మారావు అదోలా నవ్వేడు. ఆ నవ్వు యెంతో లౌకికంగా వుంది.

"ఎంత అమాయకుడివిరా రాజూ! సుశీల విషయం మిగతా వారందరికి అనవసర ప్రసంగమే కావచ్చు. కాని, నీకు మాత్రం కాదు. నీకు అత్యావసర ప్రసంగం. సుశీల తెలివి తేటలు అఖండమైనవి. ఆమెది పెద్దప్లాను. నీజీవితంలో అడుగు పెట్టాలన్న వాంఛ ఆమెలో పేరుకుని వుంది. ఆ వాంఛను అరికట్టలేక, మార్గాల్కోసం అన్వేషిస్తోంది. లేక పోతే, నువు వారించినా, మీ యింటికి యెందుకు వస్తా

వుండటం? తులశమ్మను మంచి చేసుకొని, ఆమెద్వారా నాటకమాడి, తన ప్లాను సుళువుగా నెఱవేర్చుకో జూస్తోంది. నువ్వు మాత్రం, కాస్తంత జాగరూకుడవై వుండటం, యెంతో అవసరం... ఆత్మీయుడ్ని కాబట్టి, నీ శ్రేయోభిలాషిని కాబట్టి చెప్తున్నాను. లేకపోతే, నాకేం అవసరం చెప్పు?" మెల్లగా, యేదో రహస్య విషయం చెప్తున్నట్టుగా చెప్పాడు.

ఎంత మంచి వ్యక్తి అయినా, చెప్పుడుమాటలు వినని వాడు చాలా అరుదు. మానవుల బలహీనతలలో యిది ఒకటి. సుశీల అంటే; అసలే పడటంలేదు రామరాజుకి. ఆమె పట్ల కోపం, ద్వేషం, హృదయం నిండా వుం... ధర్మారావు మాటలతో మరింత అసహ్యం యేర్ప... అంతేకాదు — తులశమ్మ మీద కూడా అపనమ్మకం పు... కెత్తింది. ఆ రోజు సుశీల విషయంలో తులశమ్మ అనిన మాటలు, అతని చెవుల్లో యిప్పుడు గింగురు పెట్టాయి. మావయ్య అన్నట్టు, వీళ్ళిద్దరూ కలిసి నాటకమాడుతున్నారేమోనన్న అనుమానం, అతనిలో చోటు చేసుకుంది. తులశమ్మను నమ్మకూడదని తీర్మానించుకున్నాడు ఆ క్షణంలోనే.

"తేసుకురా అమ్మా! అంత సిగ్గుపడితే యెల్లా? పరాయివాడు గనుకనా!" అన్న ధర్మారావు మాటలు, రామరాజు ఆలోచనల్ని త్రెంచి వేశాయి.

రామరాజు తలెత్తి చూశాడు. ధర్మారావు పెద్దమ్మాయి శ్యామల, కాఫీ కప్పుతో వస్తోంది. ఒకే రంగు చీర, జాకెట్టు ధరించింది. ఇంతకు ముందుకంటె, ఆ రోజు ఆకర్షణీయంగానే అగుపించింది రాజుకి. కాఫీ తెచ్చి అందించింది. ఆమెకేసి ఓరగా చూశాడు రాజు. అంతలోనే యేదో బలహీనత ఆక్రమించుకుంది. పిరికితనం మొలకెత్తింది. మొహం దించుకొని, కాఫీ సేవించి, ఖాళీ కప్పును దిగువ పెట్టాడు. శ్యామల అక్కడే నుంచుని, అతనికేసి చూస్తోంది. అది గమనించలేదు రాజు.

"ఎలా వుందిరా కాఫీ?" ప్రశ్నించాడు ధర్మారావు, మందహాసంతో.

"బావుంది మావయ్యా!" అనక తప్పింది కాదు రాజు.

కిటికీలోంచి చల్లగాలి రయ్యిన వీస్తోంది. శ్యామల తలలో ముడుచుకున్న మల్లెపూల వాసన అతనికి మత్తు కలిగించినట్టయ్యింది.

ధర్మారావు మెల్లగా నవ్వేడు.

"బావుండక వేంచేస్తుందిరా! మీ అత్తయ్య తర్ఫీదు అల్లాంటిది. మీ అమ్మకూడా అంటూ వుండేది; మీ అత్తయ్యలా కాఫీ తయారుచెయ్యడం యెవ్వరితరమూ కాదని. ఒక్క కాఫీ అన్నమాటేమిటి? ఏ వంటలో అయినా సరే, మా శ్యామల వాళ్ళమ్మకి తీసిపోదు" అంటూ కూతురుకేసి చూశాడు ధర్మారావు.

అంతవరకూ కనురెప్పలు వెయ్యకుండా, తదేకంగా రామరాజు కేసి దృష్టిని ప్రసరిస్తున్న శ్యామల, తండ్రిమాటలకి సిగ్గుపడింది.

"మీరు యెప్పుడూ ఇంతే నాన్నా!" అనేసి అక్కణ్ణించి చరచరా వెళ్ళిపోయింది ఖాళీకప్పు తీసుకుని.

వెళ్ళిపోతున్న శ్యామల వేపు చూడకుండా వుండలేకపోయాడు రామరాజు. ఆమె తలలో తొంగిచూస్తున్న మల్లెచెండు ఆకర్షిస్తున్నట్టుగా అయ్యింది. ధర్మారావులో వుత్సాహం పొంగింది. రామరాజులో పరిణామం వస్తున్నందుకే అతని ఆనందమంతాను. మురిసిపోయాడు.

సుభద్రమ్మ లోపల్నించి గాలివానలా వచ్చింది.

"నాయనండీ! రాజు రాత్రికి ఇక్కడే భోజనంచేస్తాడు. మీరు వెళ్ళి తా... కూరగాయలు తీసుకురండి!" అంది ఒక్కబిగిని.

"ఆ విషయాన్ని యిప్పుడు ప్రస్తావించకు అత్తయ్యా? రాత్రికి యిక్కడ భోంచెయ్యడం, సాధ్యపడదు. ఇంటికి వెళ్ళి భోజనం చేస్తాను. తులశమ్మ యెదురు చూస్తూంటుంది..." వారించాడు రామరాజు

"ఆ వంటమనిషికి అంత ఆప్యాయత యెక్కడేడుస్తుంది నాయనా! నువ్వు తింటేనేం, లేకపోతేనేం. వాళ్లు మస్తుగా తింటున్నారుగా! నువ్వు అమాయకుడివి కాబట్టి అలా అవస్థపడతున్నావు. అవన్నీ యిప్పుడెందుకులే! అయితే నువ్వు భోజనానికి యిక్కడ వుండవన్నమాట!

అరె, యేర్పాటులన్నీ చేసేశానే! పోనీలే బాబూ! నువ్వు వద్దంటుంటే, బలవంతం చెయ్యడం బావుండదు. అసలు, అటువంటి బలవంతాలు నాకు యిష్టముండవు కూడాను. ముక్కుకు సూటిగ పోవడమే మా కుటుంబం నేర్చుకుంది. రేపు రాత్రికి యిక్కడే భోజనం చెయ్యాలి సుమా!" తన మాటల నేర్పునంతా ఉపయోగించింది సుభద్రమ్మ.

రామరాజు యిరుకున పడ్డాడు. సుభద్రమ్మవాగాటికి ఆనకట్ట కట్టలేకపోయాడు. రానని చెప్పడం అతనికి చేత నయ్యిందిగాదు.

"వీలుంటే వస్తాను...మరి వెళ్ళొస్తా" అంటూ లేచాడు.

"వీలుంటే కాదోయ్! తప్పకుండా రావాలి. నీకోసం వండినదంతా వేస్టు అవుతుంది. వేస్టుచెయ్యడం, ఈ గడ్డు రోజుల్లో క్షమించరాని తప్పు. తెలిసిందా!" హెచ్చరించాడు ధర్మారావు నవ్వుతూ.

"అలా అంటానుగాని, వస్తాడు లెండి" నవ్వింది సుభద్రమ్మ.

రామరాజు నోటికి తాళం పడింది. ఏదో చెప్పాలని వున్నా చెప్పలేకపోయాడు. ముందుకు సాగిపోయాడు. పదడుగుల అతడితో వెళ్ళి తిరిగి వచ్చేశాడు ధర్మారావు. అతని లోని వుత్సాహం, ఆ మొహంలో ప్రతిఫలించింది. భర్తను అభినందిస్తున్నట్టుగా ముసిముసి నవ్వులు ఒలకబోసింది సుభద్రమ్మ.

"దారిలో పడుతున్నాడు చూశారా!" సుభద్రమ్మ అంది.

"ఇంతటితో సరిపోలేదు. పూర్తిగా మనకి అనుకూలుడై అమ్మాయిని వివాహం చేసుకొంటేనేకదా, మన చిరకాలవాంఛ తీరినట్టు!"

"మీరు మరీనండీ! ఒక్కసారి మార్పు రావాలంటే యెట్లా? క్రమంగా పరిణామం వస్తుంది. అమ్మాయి, యివ్వాళ యెంత ఆకర్షణీయంగా అగుపిస్తూవుందో, చూశారా? దాన్ని చూసి మంచు ముక్కలా కరిగిపోయాడు సుమండీ! కాఫీ తెచ్చి యిస్తే, దాన్నికేసి యెలాచూశాడో గమనించారా?"

"ఔను! నేనూ గమనించాను, అయినా, మనమ్మా... కేంలోటు చెప్పు? అందం వుంది; అంతకు మించిన ఆక... ఆ కళ్ళల్లో వుంది. రామరాజు వంటి వాళ్ళని యిట్టే ఆకర్షి... స్తుందంటే, అందులో అతిశయోక్తి యేమీలేదు. ఈ వి... హమే జరిగితే, అమ్మాయిదే అదృష్టంకాదు మనదికూడా... ఈ యింటినుంచి మకాం ఎత్తేసి, వాళ్ళింట్లోనే వుంద... ఉప్పొంగిపోతూ అన్నాడు.

"అవన్నీ గట్టిగా అనకండీ! గోడలకి చెవులుంటాయి. మన ఊహాలన్నీ మనస్సుల్లోనే పదిలపర్చుకోవాలి. ఒకసారి ఆ ఇంట్లో తిష్టవేశామంటే, యిక మన భవిష్యత్తు మూడు పువ్వులూ ఆరుకాయలుగా వుంటుందండీ!" తన్మయత్వంతో అంది సుభద్రమ్మ.

"అప్పుడు పెద్దరికమంతా నీదే! అనుకోని అంతస్థు ఒక్కసారి వచ్చేస్తుంది" నవ్వేడు ధర్మారావు.

"కాళపోతే మీదా? మీకు యింటిపెత్తనం యిస్తే, బాగుపడినట్టే!" నవ్వింది సుభద్రమ్మకూడా. చాలారోజులు తర్వాత, భార్య నవ్వడం గమనించాడు ధర్మారావు, ముగ్ధుడైపోయాడు.

"నవ్వితే, యిప్పటికీ బావుంటావుసుమా సుభద్రా!" అన్నాడు ప్రేమావేశంతో.

సుభద్రమ్మకి నవ్వు ఆగంది కాదు. "కవిత్వంలోకి దిగకండి మరి!" మన వయుసు గుర్తించుకోవాలి. మాటల సందడిలో బజారుకి వెళ్ళడం మానేశారేం! వెళ్ళండి... వెళ్ళండి ... అన్నట్టు నాలుగు రకాల కూరగాయలు తీసుకు రండి, రేపటికి కావాలిగా! రోజూ ఎలా వున్నా రేపు మాత్రం సుష్టుగా భోంచేయాలి." మళ్ళీ సీరియస్‌గా ముఖం పెట్టింది సుభద్రమ్మ.

"ఔను కదూ! వస్తా..." అనుకుంటూ సంచీపట్టు నిష్క్రమించాడు ధర్మారావు.

సుభద్రమ్మ తృప్తిగా నవ్వుకొంటూ, లోపలికి నడిచింది.

# 16

ఉదయం ఎనిమిది దాటింది మబ్బుగా ఉండటంవల్ల యింక- అప్పుడే తెల్లవారినట్టు అనిపించేలా ఉంది వాతావరణం. సుశీల వంట ప్రయత్నంలో ఉంది. బైట తలుపు తట్టిన శబ్దం వినిపించింది, ఎవరు వచ్చారు చెప్మా అని ఆలోచి

స్తూ వెళ్ళి, తలుపు తెరిచింది. ఎదురుగా తులశమ్మ కనిపించే సరికి, ఆశ్చర్యపోయింది. ఆమె చేతిలో ఓ మూటమాత్రమే వుంది. ఆ మొహంలో యెక్కడా వుత్సాహం కనిపించలేదు.

"నువ్వా తులశమ్మా! ఏమిటిలా వచ్చావు? ఈ మూట ఏమిటీ? మొహం యిలా వాడిపోయి వుందేం?" ప్రశ్నపరంపరలు కురిపించింది.

"మా వూరు వెళ్ళిపోతున్నానమ్మా!" నిర్లిప్తంగా జవాబు చెప్పింది.

ఈ జవాబు మరీ ఆశ్చర్యం కలిగించింది సుశీలకు. అక్కడే నిల్చుని మాట్లాడ్డం బాగనిపించలేదు.

"ముందు లోపలికి రా తులశమ్మా!" అంటూ లోపలికి నడిచింది. తులశమ్మ లోపలికి వచ్చింది.

"ఏమిటీ విశేషం తులశమ్మా? మా బావ ఏమ అన్నాడా! లేక యింకేదయినా కారణంవుందా, నువ్వు వెళ్ళిపోవడానికి?"

"నన్ను ఉద్యోగంనుంచి తీసేశారమ్మా!"

సుశీల విస్తుపోయింది. వంటమనిషిని వుద్యోగం నుంచి తీసివేసే పరిస్థితి యెందుకు వచ్చిందో యెంత యోచించినా ఆమెకు లక్ష్యంకాలేదు.

"అదేమిటీ?"

"వంటమనిషి మరి అవసరంలేదట..."

"కారణం?" ఆత్రుతగా అడిగింది.

"కారణం ఏదైనప్పటికీ, నేను మీ పక్షాన వుండి నాటకమాడుతున్నానట. ఆయన విషయాలన్నీ మీకు

తెలియజేస్తున్నానట. అందుకే, ఆ ఇంట్లో వుండటానికి, నాకు అర్హత లేదట." బాధగా చెప్పింది తులశమ్మ.

సుశీల బాధగా నిట్టూర్పు వదిలింది. బావ యింత క్రూరంగా ప్రవర్తిస్తాడని, ఆమె యెప్పుడూ ఊహించలేదు. నిజానిజాల్ని తెలుసుకోకుండా ప్రవర్తించడం అమానుష మనిపించింది. తన మూలంగా ఒక వ్యక్తి జీవనాధారం తొలగిపోవడం, ఎంతో బాధ కలిగించిందామెకు.

"బావ చాలా తొందర పడ్డాడు తులశమ్మా! నా మీద వుండే కసిని, ఈ విధంగా వ్యక్తం చేసుకునేటంతటి బలహీనుడౌతాడని, అనుకోలేదు. ఇది చాలా అన్యాయం. నా కారణంగా నీకు ఈ అన్యాయం జరగడానికి వీల్లేదు..." ...ది సుశీల.

"ఓ రోజు మీతో మనవి చేసుకున్నాను గుర్తుందా, అమ్మా! ఎవరో మీ మీద చాడీలు చెప్పి, బాబుగారి మనసు విరగ్గొడుతున్నారని; ఇప్పుడైనా నమ్ముతారా!"

"ఇప్పుడు నమ్మవల్సి వస్తుంది తులశమ్మా! లేకపోతే అకారణంగా నామీద అంత కక్ష యెందుకు వుంటుంది? నాకేం అర్థం కావడంలేదు బహుశా నువ్వు చెప్పినట్టు, ఆ ధర్మారావే ఈ పన్నాగం పన్ని వుంటాడు..." స్వాలోచనగా అంది. ఆమె మొహం కళావిహీన మయ్యింది.

"ధర్మారావుగారికంటె, అతని భార్య మరీ జిత్తుల మారి మనిషి అమ్మగారూ! ఆమె మాటలతోనే మనుషుల్ని మార్చేస్తుంది. ఇన్నాళ్ళూ, బాబుగారు దిగులుగా వుండే వారా! ఇప్పుడు అదేమీ లేదమ్మా! నాలుగైదురోజుల్నుంచి

వుత్సాహంగా వుంటున్నారు. అప్పుడప్పుడు మెల్లగా పాటలు పాడుతున్నారు కూడాను. ఆయన వుత్సాహపూరితంగా వుండటమే అందరూ కోరేది. కాని ఆ వుత్సాహం కలగ డానికి కారకులు, కపటవ్యక్తులు కావడమే బాధకలిగి స్తోంది."

సుశీల మనసులోని భావాలు యెలావున్నా, వాటిని బయటికి వ్యక్తంచెయ్యలేదు. ఆమె ఆలోచనలు పరి పరి విధాల పోతున్నాయి. ఆలోచిస్తున్నకొద్దీ, ఆవేదన యినుమ డిస్తోంది. మావయ్య గుర్తుకువచ్చి, ఆమె మనసు కలత పడింది. అయినా, తమాయించుకుంది.

"పోనీలే తులశమ్మా! ఏదో విధంగా బావలో పరి ణామం రావడం, హర్షనీయం. నేను యెదురు చూస్తూంది కూడా అందుకే!" మెల్లగా అంది. ఆమె మాటల్లో, మాన సిక బాధ అర్థమౌతోంది.

ఆమె అమాయకత్వానికి, తులశమ్మ చింతించింది.

అలా అంటారేవిటమ్మా! ధర్మారావుగారి పన్నా గపు వుచ్చులో బాబుగారు యిరుక్కోకూడదు. ఎలాగైనా బాబుగారిని తన చేతిలో కీలుబొమ్మగా చేసుకోవాలని ఆయన ప్రయత్నిస్తున్నారు. వాళ్ళమ్మాయిని, బాబుగారికి ముడిపెట్టాలని ప్రయత్నిస్తారేమో కూడా!"

సుశీల, అదోలా మందహాసం చేసింది. "అందులో తప్పు యేముంది తులశమ్మా! బావ, తనకి నచ్చిన అమ్మా యిని వివాహం చేసుకోవడం, మంచిదే. ఆ అమ్మాయి ఎవ

రైతేనేం? ఎటొచ్చీ,ధర్మారావు పరిస్థితుల్ని ఆధారం చేసుకొని, అధికారాన్ని కూడా తన కైవసము చేసుకుంటే భవిష్యత్తు యెలా వుంటుందో చెప్పలేం..."

"ధర్మారావుగారి అమ్మాయి, బాబుగారికి నచ్చిందంటారా!"

"ఏమో అది నే నెలా చెప్పగలను? 'తాను వలచింది రంభ - తాను మునిగింది గంగ' అన్న ఆర్యోక్తి వుండనే వుంది. బావ దృష్టికి, ఆమె అప్సరసలా అగుపించవచ్చు. ఇంతకీ బావ భోజనం యెక్కడ?"

"వాళ్ళింట్లోనే అనుకుంటానమ్మా! రెండు రోజులయ్యింది...యింటివద్ద భోజనం చెయ్యడంలేదు. అడిగితే భోజనంచేసి వచ్చాననే అన్నారు. వండిందంతా దండగే అయ్యింది. యింతకుమించి నేనేం అడగగలను చెప్పండి?"

సుశీల క్షణం ఆలోచనలో పడింది. మావయ్యకి మాటివ్వడంలో, తను తొందరపడిందేమో! తన పిచ్చిగాని, యేవిధంగా తను బావకి ఆసరాగా వుండగలదు? ఒకయింట్లో వుంటే, కొంతవరకూ అది సాధ్యపడేదేమో? కాని, అలా వుండడానికి వీలుపడింది కాదే! అసలు, తను యివన్నీ ముందుగా యోచించవల్సింది. మావయ్య తృప్తి కోసం, ఆయన ఆనందంకోసం, అంతిమఘడియల్లోనయినా, ఆయన నిశ్చింతగా వుండాలన్న సదుద్దేశంతో, అలా మాటిచ్చింది. అదే యిప్పుడు, తన కాళ్ళకి కనుపించని బంధమయ్యింది. ఇప్పుడు, తనేం చెయ్యాలి? పరిస్థితులు వూహించని విధంగా చేజారిపోతున్నాయి. బావ, ధర్మారావు

పన్నిన వలలో చిక్కుకుంటే, తను చేయగలిగిందేముంది? ఏమన్నా అంటే, తను స్వార్థచింతతో, అసూయతో అంటున్నట్టు ప్రచారం చేస్తారేమో! అంతేకాదు. లేనిపోని సంఘటనలు సృష్టించి, కథలల్లి తనని అవమానపర్చడానికి ప్రయత్నించినా, అందులో అతిశయోక్తి వుండదు. ఎందుకైనా, చినమావయ్యకి వుత్తరం రాయడం మంచిది... అనుకుంది.

"ఏమిటమ్మా, అంతగా ఆలోచిస్తున్నారు?" ప్రశ్నించింది తులశమ్మ.

"ఏంలేదు తులశమ్మా! చినమావయ్యకి వుత్తరం రాయడమా, మానడమా అనే ఆలోచిస్తున్నాను..."

"రాయడమే మంచిదమ్మా! లేకపోతే, వూళ్ళో వుండికూడా, యీ విషయాల్ని తెలియజెయ్యలేదని, మిమ్మల్నే నిందిస్తారు."

"అదే నేనూ అనుకుంటున్నాను."

"మరి, నాకు శలవిప్పించండమ్మా!"

"ఎక్కడికి?" చిన్నగా నవ్వుతూ అంది.

"మావూరు పోతానమ్మా!"

"నువ్వు వెళ్ళిపోతానంటే, సరా? నేను వదలొద్దూ! ఇంట్లో మరో సహాయంలేక, నేనూ యిబ్బందిపడుతున్నాను. ఈ రోజునుంచి, నా దగ్గరే వుంటావు నువ్వు..." అంది సుశీల.

తులశమ్మ మొహం విప్పారింది. కళ్ళల్లో కొత్త కాంతి వచ్చింది.

"మీరు యెంత మంచివారమ్మా? బాబుగారికళ్ళకు, నీలితెర కప్పబడి వుందిగాబట్టి, మిమ్మల్ని అర్థంచేసుకోలేక పోతున్నారు. మీమంచితనాన్ని తెలుసుకోలేకపోతున్నారు. మీ దగ్గర వుండటంకంటె, నాకు కావల్సిందేవిఁటి?" కృతజ్ఞత వుట్టిపడేలా అంది తులశమ్మ.

"లోపలికి పద..." అంటూ దారితీసింది సుశీల. తులశమ్మ, ఆమెను అనుసరించింది.

ఆ రోజునుంచీ, సుశీలకు పనిబ త్తిడి తగ్గింది. తులశమ్మ వంటపనంతా చూసుకుంటూ వుండేది.

ఆరోజే చినమావఁయ్యకి వుత్తరం రాసింది.

ఆ రాత్రి చాలాసేపటివరకూ, పుస్తకం చదువుతూ కూచుంది సుశీల. చదువుకుందుకు మంచి అవకాశం దొరికినందుకు, మురిసిపోయింది. సుశీల అంతవేళవరకూ మెలకువగా వుండటం, గమనించింది తులశమ్మ.

"అమ్మా! చాలా వేళవుతోంది...ఇంకా ఆ చదువేఁవిఁటి చెప్పండి! ఆరోగ్యం చూసుకోండి..." అంటూ హెచ్చరించింది తులశమ్మ.

సుశీల అదోలా నవ్వుకొని, పుస్తకాన్ని మూసేసి, లైటు ఆర్పి మంచంమీద ఒరిగింది. ఆమె మెదడు తీవ్రంగా పనిచేయసాగింది. బావపట్ల, తను కనబరుస్తున్న ఆసక్తికి అర్థం యేవిఁటి? కేవలం, మావఁయ్యకు యిచ్చిన వాగ్దానం నిలబెట్టుకోవడానికేనా? ఒకవిధమైన త్యాగబుద్ధితోనే తను ప్రవర్తిస్తున్నదా?...తనలోతనే వితర్కించుకుంది. కాకపోతే యింకేవిఁటి? తన ఆనందంగురించి యెప్పుడూ ఆలో

చించనే లేదు...తనలోతనే సమాధానపడింది. "కాదు. పరిపూర్ణమైన త్యాగబుద్ధి నీలో లేదు..." అంటూ యెవరో వెన్నుచరిచి, యెగతాళి చేసినట్టనిపించింది.

"ఎవరది?" ప్రశ్నించుకుంది తనలోతనే.

"నేను. నీ అంతరాత్మను..." జవాబు వచ్చింది.

"అయితే, నాలో స్వార్థం వుందంటావా ?"

"స్వార్థం లేదని, నువ్వు అనుకుంటే సరా? అంది నాకు తెలుసు. రామరాజు శ్రేయస్సుకై పాటుపడుతున్నట్టు భావిస్తున్నావు. కాని, ఆ ప్రయత్నం వెనక, నీ స్వార్థం కూడా వుందన్న విషయాన్ని విస్మరిస్తున్నావు."

అంతరాత్మ ఆరోపణకు, సుశీల నివ్వెరపోయి, చలించిపోయింది. తన అంతరాళంలో యెక్కడో స్వార్థం వుందేమో! ఎప్పటికైనా భావమనసు మారితే, తను యెంత అదృష్టవంతురాలు... అన్న భావం లోలోన వుండటం ఖాయం. అది కేవలం భావం మాత్రమే! వాంఛ మాత్రమే! ఆ ఆశతోనే జీవితం గడుపుతోంది. అయితే, అందుకు అనువైన పరిస్థితుల్ని సృష్టించుకోవడానికి, ఎప్పుడూ తను ప్రయత్నించలేదే! అప్పుడు స్వార్థచింత యెలా అవుతుంది?... ధైర్యం తెచ్చుకుంది.

"అది నిజంకాదు. నాలో వున్నది స్వార్థంకాదు. కోరికమాత్రమే! కోరిక, స్వార్థం అనిపించుకోదు. స్వార్థచింతతో యే పనీ చెయ్యడంలేదు. నా మంచికోసమే నేను యే విధంగానూ ప్రయత్నించనప్పుడు, అది స్వార్థం యెలా

అవుతుందో, అర్థంగాదు." అనుకుంది అంతరాత్మకు జవాబుగా. అంతరాత్మ, మరేమీ అనలేకపోయింది.

సుశీల గట్టిగా నిట్టూర్పు విడిచింది. ఆమె అంతరంగంలో జరిగిన యీ సంఘర్షణ, ఆమె లేతమనసుని కలత పర్చింది. మరి కాస్సేపటికి, యెంతో ప్రయత్నమ్మీద నిద్ర పోయింది.

* * *

చీకటిపడి ఓ గంట కావస్తోంది. మార్కెట్టులో, యిసుకవేస్తే రాలనంత జనసమూహం తనుతమ పనులు చూసుకుంటున్నారు. విద్యుద్దీపాల కాంతిలో, దుకాణాలు మరీ ఆకర్షణీయంగా అగుపిస్తూ, దారినపోయేవారిని ఆకర్షిస్తున్నట్టుగా వున్నాయి.

ఓ పెద్ద బట్టలదుకాణంలో రామరాజు, లేటెస్ట్ డిజైనుగల చీరనొకటి తీసుకొని బిల్లు రాయిస్తుంటే, జలజ అగుపించింది. ఇరువురూ ఒకరినొకరు చూసుకొని, క్షణం అచేతనంగా వుండిపోయారు. బిల్లు రాస్తున్న వ్యక్తి, వీళ్ళిద్దరికేసి కళ్ళప్పగించి చూస్తూ, నవ్వుకున్నాడు.

"బిల్లు తీసుకోండి సార్ !" నవ్వుతూనే అన్నాడు.

రామరాజు, వాస్తవిక లోకంలో పడ్డాడు. దృష్టిని మరల్చుకుని డబ్బు చెల్లించి బైటపడ్డాడు పాకెట్ తీసుకొని. జలజ వెనక్కి తిరిగింది. రాజు చరచరా వెళ్ళిపోతూవుండటం చూసింది.

"రాజుగారూ!" మెల్లగా కేక వేసింది. ఆగాడు రాజు.

"నన్నేనా పిల్చారు ?" బహువచనంలో సంబో
ధించాడు. ఔను: మరి– యిప్పుడు ఆమె మరొకరి సొత్తు.

"ఔను. మిమ్మల్నే !"

"నాతో నీకు యేంపని ?" కసిగా అన్నాడు.

"అవసరం వుందనికాదు. అపోహాలు పోగొట్టు
కుందుకు, క్షణం మాట్లాడ లి."

"అనవసరమనుకుంటాను..."

"అనవసరమే అయ్యుండవచ్చు. కాని, అర్ధంలేని
అపోహాలు మనసులో పెంచుకొని, మధనపడకండా వుండా
లంటే, నిజానిజాలు తెలుసుకోవడం యెంతో అవసరం."

రామరాజు వెటకారంగా నవ్వేడు.

"నిజం యేమిటో నాకు తెలుసు."

"మీకు తెలీదు. మీరు తెలుసుకున్నది నిజం
కాదు."

"ఏదీ తెలుసుకునే అవసరం, నాకు లేదు."

"మిమ్మల్ని మీరే ఆత్మవంచన చేసుకుంటున్నారు.
నిజం తెలుసుకుంటే, లాభించేది మీకే !"

కసిగా హుంకరించాడు రామరాజు.

"హా ! లాభం ! నీనుంచి నేను గొప్ప లాభం
పొందాను. ఇంకేం కావాలి... ?"

"నన్ను నిందించేముందు, మీ తప్పు తెలుసుకొని,
మీ తొందరపాటుకు పశ్చాత్తాపపడ్డం మీ విధి. ఆ రోజు
మీరు రాసినవుత్తరం, నా హృదయాంతరాళంలో తుఫాను
రేకెత్తించింది. నా మనస్సు తెలిసివుండికూడా, మీరు

యెంతకలా నన్ను అపార్థం చేసుకున్నారో, అనూహ్యమయ్యింది. మా మావయ్య డాక్టర్ రామమోహన్, నా పట్ల యెంతో అనురాగప్రేమలు వెదజల్లుతూ వున్నా, మీ మీద వుండే మమకారంతో, మిమ్మల్ని దూరం చేసుకోలేని బలహీనతకు లోనై, ఆయన్ని మొదట్లో తిరస్కరించాను. ఈ విషయంలో మా నాన్నగారిని సహితం యెదిరించాను. మావయ్య గౌరవాన్ని, అతని అంతస్థుని, అన్నిటినీ మించిన బాంధవ్యాన్నీ, ఓ ప్రక్కకు నెట్టాను. ఇదంతా ఎవరికోసం అంటారు ? మీ కోసం...! మిమ్మల్ని నా జీవితపు వెలుగుగా నిర్ణయించుకున్నాను గాబట్టి, అంత నిగ్రహాన్ని చూపగలిగాను. కాని...కాని...నా ఆశల్ని ఒక్కసారి త్రుంచివేశారు. నా హృదయాన్ని బ్రద్దలుజేశారు. నన్ను అనవసరంగా నిందించారు. నా నుండి నిజాన్ని తెలుసుకుందుకయినా ప్రయత్నించకుండా, ద్వేషంతో, కసితో, వుత్తరం రాసి, తెగతెంపులు చేసుకున్నారు మనబంధాన్ని. నా నిర్దోషిత్వాన్ని ప్రకటించుకోవడానికైనా, నాకు అవకాశం లేకపోయింది. ఆరోజు నేను యెంతగా బాధపడ్డానో, మీకు తెలీదు. మౌనంగా యెంతోసేపు యేడ్చాను. చివరికి గుండె దిటవుపర్చుకుని, ఒక నిర్ణయానికి వచ్చాను. నాకోసం, నా అనురాగంకోసం, నా చల్లనిచూపుల కోసం, తహతహలాడుతూవున్న మావయ్యకేసి నా దృష్టిని మరల్చాను. అనురాగాన్ని పెంపొందించుకున్నాను. అతణ్ణి చేపట్టాను. ఇందులో నా పొరపాటు యేముందో మీరే చెప్పండి..." భారంగా, నిట్టూర్చి అంది.

"నువ్వు చెప్పిందంతా నిజమే అంటావా?" సూటిగా ఆమెకేసి చూస్తూ అడిగాడు రాజు.

"నిజం కాదని మీరు అనుకుంటే, అది నా తప్పు కాదు..."

"మీ మావయ్యతో కారులో షికార్లు తిరగడం కూడా నిజం కాదంటావా?"

జలజ చిన్నగా నవ్వింది.

"అదే మీ అపోహ అయ్యుంటుందని నాకు తెలుసు. ఆ రోజే అనుకున్నాను కూడాను. ఆ రోజు ఇంగ్లాండునుంచి ఓ డాక్టర్లబృందం వచ్చిందనీ, వారి గౌరవార్థం పార్టీ యేర్పాటు చేసినట్టూ చెప్పి, మావయ్య నన్ను రమ్మని ప్రోద్బలపరిచాడు. బీచ్‌కి రావాలన్న విషయం, నాకు జ్ఞాపకం వుండి, తప్పించుకోవాలని యెంత ప్రయత్నించినా, ఫలితం లేకపోయింది. తప్పనిసరిగ, వెళ్ళవల్సి వచ్చింది. పార్టీ పూర్తయ్యాక, మావయ్యకారులోనే తిరిగివచ్చాను. అప్పుడే, మీరు చూసివుంటారు. మరునాడు మీరు కని పిస్తే, క్షమాపణ చెప్పుకోవాలనుకున్నాను. కాని, కథ అడ్డం తిరిగింది..." సిట్టూరుస్తూ అంది.

రామరాజు క్షణం ఆలోచనలో మునిగాడు. జలజ చెప్పింది, బహుశా. నిజమైవుంటుందని భావించాడు.

"ఇదంతా నిజమేనా?"

"నమ్మకపోతే, యింక నేనేం చేసేది? అది నా దుర దృష్టమే అనుకుంటాను."

"అయితే, నేనే తొందరపడ్డానా?" సాలోచనగా అన్నాడు.

"అది నిర్ణయించుకోవల్సింది మీరు... ఆ సంఘటన తర్వాత, మీ జీవితంలో యెన్నో ఒడుదుడుకులు వచ్చాయి. మీ నాన్నగారు పోవడం, మీరు మరీ దిగజారిపోయారట. ఇవన్నీ మావయ్య చెప్తూవుండేవాడు. అనుకోకండా మీ జీవితం వ్యథలపాలయ్యిందని, అప్పుడప్పుడూ బాధపడేవాన్ని. అయినా, యేం చేస్తాం? గతానికి వగచి ప్రయోజనం లేదు. మనస్సు కుదుటపర్చుకొని, గతాన్నివిస్మరించి, పూర్వపు వుత్సాహాన్ని, పుంజుకోండి. మీకు నచ్చిన అమ్మాయిని వివాహంచేసుకొని, సుఖంగా జీవించండి."

రామరాజు, నిరాశాపూరితంగా నవ్వేడు. ఆ నవ్వులో యెన్నో అగాధాలు యిమిడి వున్నాయి.

"సలహా అయినా చెప్పావు. సంతోషం..." గంభీరంగా అన్నాడు.

"అంతకంటె నేను చేసుగలిగిందేమీ లేదు రాజుగారూ!" అంటూ అతని చేతిలో వున్న పాకేట్ కేసి చూస్తూ "వేదో చీరతీసుకున్నట్టున్నారు!" ఆసక్తితో అడిగింది.

"ఔను. మా మావయ్య కూతురు పుట్టిన రోజుకి బహుమతిగా యివ్వాలని తీసుకున్నాను."

"మీ మనసుకి నచ్చిన అమ్మాయి ఆమేనన్న మాట...?"

రాజు క్షణం మౌనం వహించి,

"ఇప్పుడు చెప్పలేను..." అన్నాడు.

"ఎవరైతేనేం— మీ వివాహానికి నన్ను ఆహ్వానించడం, మానేయకండి..." నవ్వుతూ అందామె.

రాజు అదోలా నవ్వేడు.

"ఎలా మర్చిపోగలను?"

"మరి, నే వస్తానండీ! కారు అక్కడే వుండి పోయింది"

"మంచిది..." ముక్తసరిలో అనేశాడు.

జలజ వెనక్కి వెళ్ళిపోయింది. ఆమె వెళ్తున్న వేపే చూస్తూ, అదోలా నవ్వుకున్నాడు రామరాజు. తనది కావల్సిన వస్తువు, పరహస్తగతం అయినందుకు యెంతో బాధ పడాడు. అందుకు, కొంత మేరకు తనే బాధ్యుడన్న భావనకు లోనై, యేదో విధంగా సమాధానపడి, ముందుకు సాగిపోయాడు.

♦ ♦ ♦

## 17

సుశీల రాసిన వుత్తరం చదువుకొని, పురుషోత్తమ రావు సంభ్రమంతో క్షణం సేపు స్తంభించి పొయ్యాడు. అప్రయత్నంగా, ఓ నిట్టూర్పు విడిచాడు.

"ఏమిటండీ వుత్తరంలోని విశేషాలు?" అంది దగ్గరే వున్న జానకి. భర్త మౌనమూ, ఆయన నిట్టూర్పు, ఆమెలో ఆతృతను కలిగించాయి.

"చివరకి, ధర్మారావు తన అభీష్టమే నెఱవేర్చుకునేట్టు వున్నాడు జానకీ!"

"అంటే, యేమిటండీ మీ అభిప్రాయం?"

"వాళ్ళ అమ్మాయిని, రాజుకి ముడిపెట్టాలని అతను చేసిన ప్రయత్నం నీకు గుర్తుందా ?"

"ఔను. ఇప్పుడు యేమయ్యిందవుతే ?"

"అప్పట్లో మనం ససేమిరా కాదంటూ, కొట్టి పారేశాం. అప్పటి వాతావరణం మనకి అనుకూలంగా వుండేది. రాజు కూడా యెదురు చెప్పేవాడుకాదు. కాని, యిప్పుడు పరిస్థితులు, తల్లక్రిందులయ్యాయి. ఇప్పుడు రాజు వాళ్ళింట్లోనే భోజనం చేస్తున్నాట్ట. ఎంతగా మారిపోయాడో, చూడు. అప్పట్లో వాళ్ళ మావయ్యనూ, అతని కుటుంబాన్నీ, యెంతగానో అసహ్యించుకునేవాడు. వాళ్ళను నిమర్శించేవాడు. 'ఆ రాజేనా వీడు' అని యిప్పుడు ఆశ్చర్యం కలుగుతోంది."

"ధర్మారావు పన్నాగం వృథా పోలేదన్నమాట! అయితే, రాజు వాళ్ళమ్మాయిని వివాహం చేసుకుంటాడంటారా?"

"వీడు చేసుకోడమేమిటి జానకీ! వాళ్ళే వీడి పెళ్ళి జరిపిస్తారు. రాజు, ధర్మారావు చేతిలో కీలు బొమ్మగా మారిపోయి వుంటాడు. లేకపోతే, వాళ్ళ సంగతి తెలిసి కూడా వాళ్ళింట్లో భోజనమేమిటి?"

"అలాగని మనం వూరుకోవడమేనా? మీరోసారి

వెళ్ళి, అక్కడి పరిస్థితులు పరిశీలించి, వీలయితే చక్కబెట్టు కొని వస్తే, బావుంటుందేమో!"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను జానకీ! పరిస్థితులు చక్కబెట్టగలిగినా లేకపోయినా, నేను అక్కడికి వెళ్ళడం మాత్రం అవసరం. లేకపోతే, సుశీల బాధపడుతుంది. పాపం, యీ లేత వయస్సులో, సుశీల యెన్నో వ్యధలకు గురికావల్సి వస్తుంది. తన వాగ్దానం నిలబెట్టుకోవడానికి పూనుకొని, 'అబల'ననే విషయాన్ని విస్మరించి, రంగంలోకి వురికింది. నిజానికి, యే విధంగా రాజుకి అండగా వుంటాననీ అనుకుందో, అర్థంకాదు."

"అలా అనకండీ! ప్రస్తుత విషయమే వుదాహరణగ తీసుకుందాం. ఈ విషయం సుశీల తెలియబర్చకపోతే, మనకి యెట్లా తెలుస్తుంది చెప్పండి? ఏమైనా సరే— రాజు మాత్రం, ఆ విషవలయంలో చిక్కుకోకండా చూడండి. ఆ కాస్త వివాహం జరిగిపోతే, వాళ్ళంతా రాజు యింట్లోనే తిష్టవేసేసి, అధికారం చెలాయిస్తారు. తప్పదు. చూస్తూ, రాజు భవిష్యత్తుని మంటగలుపుతామా?" అంది జానకి.

పురుషోత్తమరావు ఆలోచించాడు. ఏం చెయ్యడమా అన్నదే, అతని ముందు సాక్షాత్కరించిన సమస్య. ఏదో ఒకటి చెయ్యాలి. తప్పదు... అనుకున్నాడు.

"నువ్వు అన్నది నిజం జానకీ! మనం వుపేక్షించ కూడదు. వెంటనే నేను బైలుదేరి వెళ్ళడం మంచిది." ఒక నిర్ణయానికి వచ్చి అన్నాడు.

"రాజుని నయాన్న నచ్చజెప్పడానికే ప్రయత్నించండి. వినకపోతే, భయాన్న చెప్పండి. అప్పటికీ వినకపోతే, అతడి దురదృష్టానికి అతణ్ణి వదలి వచ్చేయండి. అంతకంటె మనం చేయుగలిగిందేముంది?"

"అంతదూరం రాదేమో జానకీ! నన్ను యెదిరించే ధైర్యం, వాడికి లేదు."

"అలాగైతే మంచిదే! మనం కోరేదీ అదేకదా!"

"అలా వీధిలోకి వెళ్ళివస్తాను... కాస్త పనుంది. ఆ బేగ్‌లో రెండు జతల బట్టలు పెట్టు. ఈవేళే బైలుదేరుతాను." అంటూ లేచి బైటికి నిష్క్రమించాడు పురుషోత్తమరావు.

జానకి లోపలికి వెళ్ళిపోయింది.

* * *

ఆరోజు రామరాజు, ధర్మారావు ఇంట్లోనే వున్నాడు. మధ్యాహ్నం భోజనం ముగించి, విశ్రాంతి తీసుకుంటున్నాడు ముందుగదిలో; శ్యామల కిళ్ళీ తెచ్చి అందించింది. ఇటీవల, వారిరువురికీ సాన్నిహిత్యం పెరిగింది. శ్యామల అందుకు దోహదమిస్తోంది. లేకపోతే, అనుదినం, భోజనానంతరం తాంబూలం ఆమె యెందుకు అందించుతుంది?

రామరాజు హృదయంలో, యిప్పుడు ఒక ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించుకుంది శ్యామల. శ్యామలను చూస్తుంటే, యిప్పుడు అతనిలో అవ్యక్తమైన భావాలు యెన్నో వుద్భవిస్తున్నాయి. అప్పుడప్పుడూ తన్మయుడౌతున్నాడు. జలజ అందంగా వుంటే, వుండొచ్చు. కాని, శ్యామలలో వున్న ఆకర్షణ ఆమెలో లేదనిపించింది. ఆ సమయంలో అతను

ఆకర్షణకే అత్యంత విలువనిస్తున్నాడు. సుశీల విషయం, అతనికి గుర్తుకే రావడం లేదు. ఆమె యే విషయంలోనూ శ్యామలకు దీటు కాదనిపించిం దతనికి. ఒక్క మాటలో చెప్పాలంటే, అతనికి యిప్పుడంతా శ్యామల మయంగా వుంది.

కిళ్ళీ అందించిన శ్యామల చేతిని పట్టుకుని, దగ్గరగా లాక్కోబోయాడు. శ్యామల సిగ్గును అభినయిస్తూ, "అబ్బ! యేమిటిబావా, యెవరన్నా చూస్తారు..." అంది విడిపించు కుందుకు ప్రయత్నమేమీ చెయ్యకుండానే. అంతలోనే సుభద్రమ్మ మాటలు వినిపించాయి. రాజు, శ్యామల చేతిని చప్పున విడిచిపెట్టేశాడు. శ్యామల నవ్వుకుంటూ, అక్కణ్ణించి వయ్యారంగా నడిచి వెళ్ళిపోయింది.

అదే సమయంలో ధర్మారావు, సుభద్రమ్మ, ఏదో విషయాన్ని చర్చించుకుంటూ వస్తున్నారు. రాజు సమక్షా నికి వచ్చేసరికి వారి చర్చ ముగిసింది.

"చూడు బాబూ, ఇక్కడ చికాకుగా వుంటే, అలా వెళ్ళి లోపలి గదిలోని మంచంమీద విశ్రాంతి తీసుకోకూ డదూ?" అంది సుభద్రమ్మ.

"అబ్బే! నాకేం చికాకుగా లేదులే అత్తయ్యా! అదీ గాక, మధ్యాహ్నం పూట విశ్రాంతి తీసుకోవడం, నాకు అలవాటు లేదు" జవాబిచ్చాడు రాజు.

"అయితే, నీ యిష్టం నాయనా! చెప్పడం, మావిధి కదా! డబ్బులో యేముంది బాబూ! అన్నిటికీ ముఖ్యమైనది

ఆదరణ. దానికి వున్న విలువ, యింక దేనికీ లేదు..."
అంది సుభద్రమ్మ. రామరాజు మరేం జవాబివ్వలేదు.

"ఒరేయ్ రాజూ; నీ వివాహ విషయం, మీచిన్నా న్నతో సంప్రదించడం అంత అవసరమంటావా?" అసలు విషయాన్ని కదిపాడు ధర్మారావు.

"ప్రస్తుతానికి, నాకు పెద్దదిక్కు ఆయనే కదా మావయ్యా!"

సుభద్రమ్మ పక్కున నవ్వింది. ఆ నవ్వులో యెగ తాళి సుస్పష్టంగా ప్రతిధ్వనించింది.

"నువ్వు గొప్ప అమాయకుడవురాజూ! మేనమామ కన్న సన్నిహితులు యెవరుంటారు. తలిదండ్రుల తర్వాత, మేనమామ అధికుడు. నిజం చెప్పుకోవాలంటే నీ మంచి చెడ్డలు చూడవలసిన వాళ్ళం మేమేగాని, మీ బాబాయ్ గారుకాదు. ఇంకా నువ్వు యీ అభిప్రాయంతోనే వుంటే, యిప్పుడైనా మార్చుకోవడం; శ్రేయస్కరం. అయినా, నాకు తెలీక అడుగుతాను – నీ వివాహానికి ఒకరి సలహా యెందుకు బాబూ? నువ్వు సర్వస్వతంత్రుడవు. నీకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకుంటావు. పెళ్ళంటే బొమ్మలాట కాదు. నూరేళ్ళ జీవితం. అటువంటి ప్రాముఖ్యతగల నీ వివాహానికి వేరొకరి అభిప్రాయాలకు బానిసవు అయివుండ డానికి నీకేం ఖర్మ!" చిన్న వుపన్యాసం యిచ్చింది. రాజు పౌరుషాన్ని రెచ్చగొట్టేలా మాట్లాడింది.

క్షణం మాట్లాడలేకపోయాడు రామరాజు. అతనిలో అభిమానం తలెత్తింది. అత్తయ్య చెప్పింది అబద్ధం కాదే

మోననిపించింది. ఒకవేళ తను చిన్నాన్న సలహా అడిగాక ఆయన ప్రతికూలంగా జవాబిస్తే?...... అప్పుడు అనవసరంగా లేనిపోని గొడవలు వస్తాయి....అనుకున్నాడు.

"నువ్వు అన్నది నిజం అత్తయ్యా! నావివాహానికి, మరొకరి అనుమతి యెందుకు? సమయానికి మంచి సలహా యిచ్చావు నువ్వు. ఒకవేళ అడిగినా, బాబాయ్ అనుకూలమైన సలహా యిస్తాడని నాకు నమ్మకంలేదు. అందరికి మల్లే ఆహ్వానం కాకుండా నా నిర్ణయాన్ని తెలుపుతూ బాబాయ్‌కి ఓ వుత్తరంరాసి పడేస్తాను. నువ్వేమంటావు మావయ్యా?" ధర్మారావు కేసి చూశాడు రాజు. ఇప్పుడతనిలో స్వతంత్రాలోచన లోపించిందనే చెప్పొచ్చు. అంతగా మారిపోయాడు మరి!

ధర్మారావు ఆనందం, అవధులు దాటింది. అతను భయపడిందంతా, పురుషోత్తమరావు యీ వివాహానికి అంగీకరించడనే! ఇప్పుడు, ఆ భయానికి ఆస్కారం లేక పోయింది. మురిసి పోయ్యాడు.

"అదీ! అలా వుండాలిరా ధైర్యమంటే!" మేనల్లుడి భుజం తడుతూ అన్నాడు.

రామరాజు చిన్నగా నవ్వుకుంటూ కుర్చీ వెనక్కి చేరబడ్డాడు. సుభద్రమ్మ మొహం వికసించింది. ఆమెకు తెలుసు, రాజు యిప్పుడు తను సలహాను యెదురు చెప్పడని!

"మీరు అలా వెళ్ళి శాస్త్రిల్ని కలుసుకుని రాకూడదటండీ?"

"ఔనుకదూ; ఇప్పుడే వెళ్ళొస్తా..." అని బైలు దేరాడు ధర్మారావు.

"నేనూ యింటికి వెళ్ళొస్తా పద మావయ్యా; ఇద్దరమూ రిక్షాలో పోదాం..." తనూ లేచాడు రాజు.

యిరువురూ బైటికినడిచారు; సుభద్రమ్మ వికసించిన ముఖంతో లోపలికి నడిచింది.

## 18

ఆపరేషను గదితలుపులు మూసి వున్నాయి. ఓనర్సు హడావిడిగా లోపల్నించి వచ్చి, యెటో వెళ్ళి తిరిగి వచ్చి వడివడిగా లోపలికి పోయింది.

వరండాలో వున్న బెంచీపై కూర్చున్న ధర్మారావు, ఆ నర్సుని యేదో అడగాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. అతని ప్రక్కనే సుభద్రమ్మ కూర్చుంది. ఎదురుగా వున్న బెంచీమీద, మొహందించుకొని, దీర్ఘాలోచనలో వున్న పురుషోత్తమరావూ, అతని ప్రక్కనే వెలవెలబోతూ, ఆసక్తితో ద్వారంకేసి దృష్టినిలిపి వున్న సుశీలా,వున్నారు.

ధర్మారావు మెల్లగా పురుషోత్తమరావు ప్రక్కకి వచ్చి కూచున్నాడు.

"ఇలా జరుగుతుందని అనుకోలేదు బావగారూ! ఎంతో వైభవంగా వివాహం జరిపించాలనీ, రాజు మనక్లేశాన్ని

మరిపించాలనీ; అనుకున్నాను. కాని; దైవనిర్ణయం యిలా వుంది. ఆ రిక్షాకి బ్రేకులు లేవని మాకు ముందుగా తెలీదు కూడా! ఆ రిక్షా వెధవ చెప్పనేలేదు. లేకపోతే, మరో రిక్షా చూసుకునే వాళ్ళం. పోనీయండీ - రిక్షా యాక్సిడెంటులు జరగడంలేదా! ఏదోనాకు తగిలినట్టుగా, చిన్న చిన్న దెబ్బలు తగిలితే,యింత ఆత్మీత వుండేది కాదు. తలకి దెబ్బతగిలి చూపు పోవడమన్నది, మరీ ఘోరమయ్యింది. అంత బాధలోనూ అరిచాడు బావగారూ! 'మావయ్యా! కనిపించడంలేదు మావయ్యా,'అనిభోరున యేడ్చాడు. నా హృదయం బ్రద్ధలయ్యిందంటే,నమ్మండి. ఈవేళ యెవరి ముహం చూశాడో గాని, యింతటి దుర్దినం మరోటి వుండదు, వాడి జీవితంలో. భగవంతుడి కృపవల్ల, చూపువచ్చేస్తే చాలు...మరేం అవసరంలేదు." బాధపడుతూ చెప్పాడు.

పురుషోత్తమరావు మాట్లాడలేదు. అతనిలో ఆవేదన పరాకాష్ఠనందుకుంది. హృదయపు లోతుల్లో తుపాను చెల రేగింది. రామరాజుకి దృష్టిలోపిస్తే?... ఆవిషయాన్ని తలచు కుందుకే భయంకరంగా వుంది. ఇంక ఆలోచించలేక పోయాడు. 'భగవాన్! వాడి జీవితం నాశనం చెయ్యకు. తల్లీ, దండ్రిని పోగొట్టుకున్న దౌర్భాగ్యుడు. వాడిపై కరుణ జూపు తండ్రీ వాడికి దృష్టిని ప్రసాదించు'...అనుకుంటూ ప్రార్థించాడు.

పురుషోత్తమరావు మౌనం వహించడం, ధర్మా రావుకి విసుగూ,కోపం కలిగించింది.నిప్పులాంటి పురుషోత్తమ రావు.మన స్తత్వం, అతనికి బాగా తెలుసు. మళ్ళీ అతణ్ణి

మాట్లాడించాలని ప్రయత్నించిదితే, అగ్నిపై ఆజ్యం పోసినట్టు అవుతుందేమోనని భయపడి, మెల్లగా తన చోటుకి పోయి కూచున్నాడు. సుభద్రమ్మ మొహం ప్రక్కకు తిప్పుకొని చిట్లించుకుంది.

అక్కడి వాతావరణం యెంతో ప్రశాంతంగా వుంది. కూచున్న వాళ్ళంతా మౌనంగా వున్నారు. ఒక్కొక్కరి మనసుల్లో ఒక్కో విధమైన ఆలోచనలూ, ఆవేదనలూ వున్నాయి. నిముషాలు దొర్లుకు పోతున్నాయి. కొద్దిసేపటికి డాక్టరు బైటికి వచ్చాడు.

“ఎలా వుంది డాక్టర్ మావాడికి? చూపు వచ్చేస్తుందంటారా?” ధర్మారావు మొదటి ప్రశ్న అది. డాక్టర్‌కి ధర్మారావు ప్రశ్న, అతని మాటల ధోరణి, నచ్చలేదు. జవాబు యివ్వకండా, నేరుగా పురుషోత్తమరావు దగ్గరికి నడిచాడు.

“డాక్టర్! ఆపరేషను విజయవంత మయ్యిందను కుంటాను...” అన్నాడు పురుషోత్తమరావు ఆసక్తిగా.

“నా శక్తివంచన లేకుండా ప్రయత్నించానండీ! ఫలితం, అతని అదృష్టంమీదే ఆధారపడి వుంటుంది. కంగారేమీ అధైర్యపడకండి. అన్నట్టు మరో విషయం. అతనికి యిక్కడ యింకేమీ ట్రీట్‌మెంటు లేదు. కాబట్టి హాస్పటల్లో వుంచడ , అంత అవసరం అనుకోను. అంబులెన్సు పంపుతాను, యింటికి తీసుకు వెళ్ళండి. అప్పుడప్పుడూ, మా కాంపౌండరు వచ్చి చూస్తూ వుంటాడు. ఎవరో ఒకరు అతని దగ్గర వుంటూ, అతను లేవకండా జాగ్రత్తగా చూస్తూ

వుండాలి. ఇది చాలా ముఖ్యం. మరి వస్తా..." అనేసి నిష్క్రమించాడు డాక్టరు.

సుశీల హృదయం, విపరీతంగా కొట్టుకోసాగింది. డాక్టరు మాటల్లో యేదో ఆశాజ్యోతి అగుపిస్తున్నా, దాని వెంట నిరాశ కూడా స్ఫురిస్తోంది.

పురుషోత్తమరావు సుశీలను కాస్తదూరం తీసుకుపోయి...

"మరి కొద్ది సేపట్లో ఆంబులెన్సు వస్తుంది సుశీలా! ఇంటికి తీసుకు పోతాం. అంతవరకూ బాగానేవుంది. కాని, వాడి దగర యెవరుంటారో అర్థం కావడంలేదు..." అన్నాడు.

"అలా అడుగుతారేవిటి మామయ్యా! నేనేమయ్యాను? నన్ను పరీక్షిస్తున్నారా!" బాధపడుతూ అంది సుశీల.

"అదేం కాదమ్మా! కొద్దిరోజులపాటు, అదేపనిగ వాడిదగ్గర వుండటమంటే మామూలు విషయం కాదు అందులోనూ, వుద్యోగం చేస్తున్నదానవు—"

"ఉద్యోగం వదులుకుంటాను మావయ్యా! బా కంటే, నా వుద్యోగం యెక్కువకాదు.

"నాకు తెలుసునమ్మా నీ హృదయం! మరొక విషయం అడగుతున్నా. నువ్వుమరోలా అనుకోకు. కీడెంచమేలెంచమన్నారు. ఒక వేళ రాజుకి అంధత్వమే సంప్రాప్తిస్తే ...?"

"మావయ్యా!" రుద్ధస్వరంలో అంది కాస్త పైస్థాయిలో. "అలా అనకండి మావయ్యా! బావకి తప్పకుండా దృష్టి వస్తుంది...."

"అది కాదమ్మా నేను అన్నది. దృష్టి వస్తుందనీ, అలా రావాలనే మనం ఆశించేది కూడాను. ఒకవేళ రాదే అనుకుందాం...అప్పుడు కర్తవ్యం యేవిటి? నీ సేవలకు ఫలితం యేవిటి?" పురుషోత్తమరావు గొంతు బొంగురు పోయింది.

సుశీల గట్టిగా నిట్టూర్చింది.

"ఫలితాన్ని ఆశించి, నేనేమీ చెయ్యడం లేదు మావయ్యా! ఆ విషయం నీకూ తెలుసు. ఏది యేమైనా సరే; బావకి తోడు నీడగానే వుంటాను. అంతకంటె నేనేం చెప్పలేను" అంది.

"చాలునమ్మా ఆ మాటలు..." అన్నాడు పురుషోత్తమరావు తృప్తిగా.

అప్పుడే ఆంబులెన్సు వచ్చింది. ఆపరేషను గదినుంచి రాజుని తీసుకువచ్చి అంబులెన్సులో వేశారు. వెంటనే రాజుకి స్పృహ వచ్చింది.

"మావయ్యా; మావాళ్ళెవరైనా వచ్చారా?" అన్నాడు మెల్లగా రాజు.

ధర్మారావు దంపతులకు, ఆ మాటలు సిగ్గుతో సాహాన్ని కలిగించాయి. ధర్మారావు జవాబిచ్చేలోగా పురుషోత్తమరావు రాజు తలనిమురుతూ;

"నేను వచ్చాన్రా రాజూ! తలవని తలంపుగా రావడం జరిగింది. ఈ సంఘటన జరుగుతుందనే గామోసు, భగవంతుడు నన్నిలా రప్పించాడు. సుశీలకూడా యిక్కడే వుందిరా!" బాధతో కూడిన స్వరంతో అన్నాడు.

"బాబాయ్, నాకు దృష్టి వస్తుందా?..." బావురు మన్నాడు రాజు.

"ఆ అధైర్యమే వద్దురా రాజూ! నీకు తప్పకుండా దృష్టి వస్తుంది" ధైర్యంచెప్పాడు పురుషోత్తమరావు.

"పరవాలేదు లేరా రాజూ! డాక్టరు గారు చూపు వస్తుందన్నారుతే" తాళం వేశాడు ధర్మారావు. తను కలిగించుకోకుండా వుండటం మంచిది కాదేమోననుకున్నాడు.

ఆంబులెన్సులో పురుషోత్తమరావూ, ధర్మారావు కూడా వెళ్ళారు. సుభద్రమ్మ, సుశీల వేరే టాక్సీలో పోయారు. ఇల్లు చేరుకున్నాక, పురుషోత్తమరావు, ధర్మారావుని వుద్దేశించి అన్నాడు; "బావగారూ! వీణ్ణి మనం యింటికి తీసుకు వచ్చాంగాని, వీడిదగ్గర యెవరు వుంటారా అన్నదే యిప్పటి సమస్య. నేను యింటికి వెళ్ళి, వీడికి కట్టు విప్పేసరికి, మా ఆవిణ్ణి తీసుకు వస్తాను. ఇలా యిక్కడే వుండిపోవడం, ప్రస్తుతం నాకు సాధ్యంకాదు. పోతే, యిక ఆప్తులూ, అయినవాళ్లూ మీరే! మీరేమంటారు?"

ధర్మారావు గొంతులో పచ్చివెలక్కాయపడినట్టుగా, అతని నోట మాటరాలేదు క్షణంసేపు. ఏం చెప్పాలో అతనికి అర్థంకాలేదు. భార్యవేపోసారి చూశాడు. ఆమె

యేవిధంగా సాంకేతికాలు యిచ్చిందో గాని, కొంతు సవరించుకున్నాడు.

"నిజమే బావగారూ! ఇటువంటి సమయాల్లోనే మేం ఆప్తులుగా, అయినవాళ్ళంగాగుర్తుకు వస్తూటాం. అయినా, మాకన్న ఆప్తురాలు సుశీల వుందిగా! ఆమె వుంటుంది..." తడబడుతూ, భార్యవేపు దృష్టి నిలుపుతూ, జవాబిచ్చాడు ధర్మారావు.

పురుషోత్తమరావుకి, అతని మీద అంతులేని కోపం వచ్చింది. అయినా తమాయించుకున్నాడు.

"అదేవిటి, అలా అంటారు బావగారూ ? ఇప్పుడు సుశీల పరిస్థితి వుండదు. ఎందుకూ అంటే, మీ అమ్మాయిని రాజుకిచ్చి పెళ్ళిచెయ్యాలన్న తలంపుతో వున్నారు కదా ! అటువంటి పరిస్థితుల్లో సుశీలచేత వాడికి శుశ్రూష చేయించడం యేం సభ్యతగా వుంటుందో ఆలోచించండి..."

ధర్మారావు యిరుకున పడ్డాడు. ఏం జవాబుచెప్పాలో తోచలేదు. అయోమయంగా భార్యకేసి చూశాడు. సుభద్రమ్మ భర్తను రమ్మని సైగజేస్తూ, కాస్తదూరం తీసుకుపోయింది.

"ఏవిటలా దిక్కులు చూస్తారండీ !" విసుక్కుంది.

"మరేం చెయ్యమంటావు ? ఆయన నన్ను యిరకాటంలో పడేశాడు. ఏం చెప్పడమో తోచిందికాదు..."

సుభద్రమ్మ మొహం చిట్లించుకుంది.

"మీా తెలివితేటలు యింతేలెండి. ఏం చెప్తారు? శ్యామలను తెచ్చి, యిక్కడ వుంచుతారా యేమిటి?" విసురుగా అంది.

"అదేమీా నిర్ణయించుకోలేకనే కదా, నేను నీకేసి దృక్కుల్ని సారించాను! ఈ పరిస్థితుల్లో యేం చెప్పడమో బోధపడ్డంలేదు !!"

"నన్నడిగితే యిదో సమస్యేకాదు. ఇంక మనకిరాను రాజు అవసరమే లేదు. మన అమ్మాయికి భర్తే దొరక్కపోడు. మీా మేనల్లుడు, ఖర్మం చాలక, గుడ్డివాడే అయ్యాడనుకోండి—మనమ్మాయి జీవితాంతం కుమిలి కుమిలి యేడవ్వాల్సిందేనా? దాని జీవితం చూస్తూ, మనం దుఃఖిస్తూ కూచోవాలి. అతడికి దృష్టి వస్తుందని, నాకేమీా నమ్మకం లేదు. డాక్టరు యెంత నిరాశగా చెప్పాడో, విన్నారుగా! ఇంక యీా ఆశ వదులుకోవడం శ్రేయస్కరం. ఇంకా నయం—వివాహం జరిగాక యీాసంఘటన జరిగింది కాదు... ఒకవిధంగా మన అమ్మాయి అదృష్టవంతురాలు..." గుక్క తిప్పుకోకుండా చెప్పుకుపోయింది సుభద్రమ్మ.

ధర్మారావు గుటకమ్రింగాడు. భార్య చెప్పడం అయితే, చాలా సులువుగా చెప్పిందిగాని,తనుఎలాసమర్థించుకోవడమోనన్న భయం పట్టుకుంది.

"మరయితే యిప్పుడెలా తప్పించుకోవడం?" అన్నాడు అమాయకంగా.

"ఎందుకండీ అలా భయపడతారు? మనం యెవ

రమూ వుండడానికి వీలుపడదని ఖచ్చితంగా చెప్పేయండి.”

“నువ్వు చాలా సులువుగా చెప్పేశావు సుభద్రా! కాని, నేను చెప్పడమెలా?''

“మీ వంటి పిరికివాళ్ళను యెక్కడా చూళ్ళేదండీ! పదండి... నేనే చెప్తాను'' అంటూ విసురుగా పురుషోత్తమ రావు వున్న చోటుకి వచ్చింది. ఆమెను అనుసరించకుండా ముందుగా నడిచాడు ధర్మారావు.

''ఆలోచించారా బావగారూ ?''అడిగాడు పురుషోత్తమరావు.

ధర్మారావు చప్పున చెప్పలేక, తడబడ్డాడు.

సుభద్రమ్మే అందుకుంది.

''ఆలోచించడానికి యేముంది అన్నయ్యగారూ! మేమే రాజు దగ్గర వుండేవాళ్ళంగాని, వీలుపడదు. అర్జంటుగా వూరికి వెళ్ళవల్సి వచ్చింది. మా తమ్ముడు వుత్తరం రాశాడు రమ్మనమని. తిరిగి వచ్చాక వుంటాం కావాలంటే! ఆ విషయం చెప్పడానికే మావారు తికమకపడుతున్నారు. అందాకా మీలో యెవరో సర్దుకుంటే, బావుంటుంది.అందరికీ కావలసిన వాడే మరి!''

ధర్మారావు మందహాసం చేస్తూ, ఔనన్నట్టుగా తల మాత్రం వూపాడు.

పురుషోత్తమరావుకి వారి అభిప్రాయం సులువుగా అర్థమయ్యింది. వాళ్ళ కట్టుకథకి నవ్వొచ్చింది. కాని నవ్వే సమయం కాదని గ్రహించి నవ్వలేకపోయాడు.

"ఎందుకు బావగారూ ఈ అబద్ధాలు? మీ మన స్తత్వాన్ని ఆకళింపు చేసుకోలేదని అనుకోకండి. రాజుకి దృష్టి రాదేమోనన్న అనుమానం మీ నిర్ణయాన్ని మార్చే సింది. అందుకే యేవో సాకులు చెప్తూ యిలా తప్పించు కుంటున్నారు. వాడి పట్ల మీకు యేపాటి అభిమానం వున్నా యిలా ప్రవర్తించేవారు కారు. కేవలం మీకు కావల్సింది వాడి డబ్బేగాని వాడుకాదు. ఇటువంటి కపట వ్యక్తులు గనుకనే అన్నయ్య మిమ్మల్ని దూరంగా వుంచాడు..." కసిగా అన్నాడు.

ధర్మారావు అభిమానం దెబ్బతిన్నది.

"ఏమిటి బావగారూ, నోరెందుకలా పారేసు కుంటారు?" చిరుకోపంతో అన్నాడు.

సుభద్రమ్మ మొహం చిట్లించుకుంది. కోపంతో ఆమె మొహం యెర్రబారింది. పురుషోత్తమరావు యివేమీ అంతగా పట్టించుకోలేదు. నిశ్చలంగా నవ్వేడు.

'నోరు పారేసుకోవడం కాదు బావగారూ! నిజాన్ని వెల్లడిచేస్తున్నాను. మీకూ మాకూ సంబంధబాంధవ్యాలు తెగిపోయినా మళ్లీ వాటిని పెంపొందించుకోవడానికి ప్రయ త్నించడంలో అర్థం ఏమిటి? మీ స్వార్థం మావాడి అమా యకత్వాన్ని పరిస్థితుల్ని ఆధారంగా చేసుకొని వాణ్ణి మీ యింట్లో వుండేటట్టు ఏర్పాటు చెయ్యడానికి కారణం ఏమిటి? మీ స్వార్థం! వాణ్ణి మీచేతిలో కీలుబొమ్మగా ఆడించి మీ అల్లుడిగా చేసుకోవాలన్న స్వార్థానికి లోన య్యారు. ఇప్పుడు వాడికి ప్రమాదం తటస్థించిందని తప్పుకు

తిరుగుతున్నారు. వాడికి అంధత్వం సంప్రాప్తిస్తుందన్న భయంతో మీ స్వార్థాలన్నీ పటాపంచ లయ్యాయి. నిజంగా వాడిమీద అభిమానమే వుంటే యిటువంటి క్లిష్ట పరిస్థితుల్లో వాణ్ణి ఒంటరిగా విడిచిపెట్టడానికి ప్రయత్నించరు. మీ కపట ప్రవర్తనను వ్యక్తం చేసేందుకు యింతకంటె యింకేం నిరూపణ కావాలో అర్థంకాదు."

ధర్మారావు మొహం యెర్రబారింది.

"ఎదుటివారిపై అభియోగాలుతీసుకురావడం, మీకు అలవాటులా వుంది. మా గురించి మీరలా భావిస్తున్నప్పుడు మేం యిక్కడ ఒక్కక్షణం కూడా వుండటం అనవసరమే! పద, సుభద్రా పోదాం..."అన్నాడు కోపంగా.

"మేం వుండమన్నా వుండరని తెలుసు బావగారూ! వెళ్ళండి..."నవ్వుతూ అన్నాడు పురుషోత్తమరావు.

ధర్మారావు అతనివేపు తీక్షణంగా చూసి వెళ్ళిపోయాడు బైటికి. అతనివెంట సుభద్రమ్మ నడిచిందిచరచరా.

"మా శాపా సుశీలా వాళ్ళ మన సత్వం" పురుషోత్తమరావు అన్నాడు సుశీలతో.

"మొదట్నుంచీ తెలసిన వాళ్ళేకదా మావయ్యా! ఇప్పుడేం కొత్తకాదుగా!" చాలా తేలిగ్గా అనేసి నవ్వింది.

పురుషోత్తమరావు కూడా నవ్వేశాడు.



# 19

ఆరోజు రాత్రి తొమ్మిది దాటింది.

పురుషోత్తమరావు రామరాజు మంచం దగ్గరికివచ్చి, అతని ప్రక్కనే కూచున్నాడు.

"భోజనం అయ్యింది కదరా?"

"లైట్ టిఫిను చేశాను మావయ్యా! కాని, ఓ విషయం అర్థంకావడంలేదు."

"ఏవిటీ?"

"సుశీల తినిపించిందేవిటీ?"

"ఏం - తప్పా?"

"తప్పనికాదు బాబాయ్' ధర్మారావు మావయ్య కూతురు శ్యామల, యేమయ్యింది? ఎలాగూ మా యిరువురి వివాహం నిశ్చయమయ్యింది గాబట్టి, ప్రస్తుతం ఆమె నా చెంత వుండటం మంచిదికదూ? సుశీలకు అనవసరమైన శ్రమ తప్పుతుంది కూడాను."

ఈ ప్రశ్న రామరాజు నోటినుండి యెప్పుడు వెలువడుతుందా అని యెదురు చూస్తున్న పురుషోత్తమరావుకి, సరైన అవకాశం చిక్కింది. గట్టిగా ఓ నిట్టూర్పు విడిచి, చిన్నగా మందహాసం చేశాడు.

"సకాలంలో, సరైన ప్రశ్న వేశావురా రాజూ! నిజానికి యీ విషయాన్ని నేనే చెప్పాలనుకొన్నాను. ఇన్నాళ్ళూ మీ నాన్న మీ మావయ్యను యెందుకు

దూరంగా ఉంచాడంటావు? మీ మావయ్య స్వార్థ పరుడు గనుక! మంచీ,చెడూ విచక్షత అతనిలో లేదుగనుక! ఎలాగైతేనేం – నిన్ను తన చేతుల్లోకితీసుకొని కీలుబొమ్మలా ఆడించాడు. ఆ చాకచక్యం అతనిలో వుంది. నిన్ను అల్లుడిగా చేసుకొని, యీ యింటి ఆధిపత్యాన్ని హస్తగతం చేసుకోవాలని వాంఛించాడు. కాని, దేవుడనేవాడున్నాడు. అతని కుత్సితపుటాలో చనను బైట పెట్టాలనే గామోసు, నీకీ ప్రమాదాన్ని కలిగించాడు. నీకు శాశ్వతంగా అంధత్వం వచ్చేస్తుందేమోనని అనుమానించిన ధర్మారావు దంపతులు, తమ అభిమతాన్ని వుపసంహరించుకొన్నారు. అది చెప్పలేక యేదో సాకుచెప్పి, బైటపడ్డారు. నీ దగ్గర వుండగలిగిన వాళ్ళు యెవరని అడిగితే, తనకి ఆ విషయం సంబంధించింది కాదన్నట్టుగ, తాము యేదో వివాహానికి వెళ్ళాలని చెప్పి తప్పించుకొన్నారు. ఇదిరా, వారికి వున్న అభిమానం. ఆయన అలా తప్పించుకుంటాడని నాకు తెలుసు. అందుకే, ప్రప్రథమంగా సుశీలతో సంప్రదించాను. నీకు శుశ్రూష చెయ్యడమే తన కర్తవ్యంగా భావించింది.''

బాబాయ్ చెప్పిందంతా విని, నిర్విణ్ణుడైపోయాడు రామరాజు మొహం. కోపంతో యెర్రబారింది.

"మీరు చెప్పింది నిజమా బాబాయ్!' అతనిస్వరం గాద్గదిక మయ్యింది. ధర్మారావు ప్రవర్తనకే కోపగించుకొంటున్నాడని అర్థంచేసుకున్నాడు పురుషోత్తమరావు.

"ఆ అనుమానం నీకు యెందుకు కలిగిందిరా? నేను యెప్పుడైనా అబద్ధం చెప్పానా? అసలు, మీ మావయ్యే

అత్తయ్యల మన స్తత్వం తెలిసిన వాళ్ళెవరైనా, వారికి దూరంగా వుండాలనే ప్రయత్నిస్తారు. వాళ్ళ కపటబుద్ధి యిప్పుడు అర్థమయ్యిందికదరా!''

"నాకు దృష్టిరాదని, వాళ్ళు యెట్లా వూహించారు బాబాయ్?"

"అది వారి అపోహరా! తమకి తామే తెలివైన వాళ్ళమని అనుకునేవారు; అటువంటి ఊహలకే లోనవుతారు. అటువంటివారు మంచిని యెప్పుడూ ఊహించరు... ఆశించరు కూడాను."

రామరాజు క్షణంపాటు ఆలోచనలో పడ్డాడు.

"ఎంత స్వార్థపరులు బాబాయ్ వాళ్ళు! ఇటువంటి వాళ్ళను నమ్మడం నాదే తప్పు! వారి పూర్వవృత్తాంతం తెలిసికూడా ఆ వ్యూహంలో యిరుక్కున్నానంటే, అది వారి ప్రతిభయేనని అనుకుంటాను. నాకు అతను మేనమామ అయితేనేం—అతను మనిషికాడు. భార్యకు అనుగుణంగా ఆటలాడే జిత్తులమారినక్క. ఇప్పటికైనా వారి స్వభావం వెల్లడి అయ్యింది. లేకపోతే, ఎంత మోసపోయి వుందును!" పళ్లు కొరుకుతూ అన్నాడు.

పురుషోత్తమరావు మందహాసం చేశాడు.

"ఏదైనా, అనుభవంమీదగాని తెలిసిరాదు మరి!" నవ్వుతూ అన్నాడు.

రామరాజు ఆలోచనల్లో సుశీల మెరిసింది.

"అది సరేగాని బాబాయ్, సుశీలనుమీరు చెప్పారా? లేక ఆమె స్వతహాగా ముందుకు వచ్చిందా?"

సుశీలను నువ్వింకా అర్థంచేసుకోలేదురా రాజూ!" మెల్లగా అంటూ 'ఆమే ముందుకు వచ్చిందిరా!' అన్నాడు.

"ఆమెలో మాత్రం స్వార్థం లేదంటారా!" ప్రశ్నించాడు రామరాజు. అతనికి యింకా ఆ సందేహం తీరలేదు.

"సుశీలమీద నీ కెందుకురా అంత క్రోధం?" అన్నాడు పురుషోత్తమరావు ఓ నిట్టూర్పుతో.

"నాన్న అకస్మాత్తుగా పోవడానికి సుశీలే కారణం బాబాయ్" ఆలోచించకండా చెప్పిన అనేశాడు రాజు.

"ఏదేవిటా?, సుశీల యెలా కారణ మవుతుంది?" ఏదో కొత్తవిషయం వినబోతున్నట్టుగ, సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు.

"సుశీలే మాయింట్లో చేరకపోతే, మా యిరువురి వివాహప్రసక్తి నాన్న మనసులోకి వచ్చేదికాదు. ఆ ప్రసక్తే రానపుడు, నేను నాన్న అభిమతానికియెదురుతిరగడమన్నది, వుండేది కాదు. తన్మూలంగా ఆయన మనసు నొప్పించచడమూ జరిగేది కాదు. తన మనోభీష్టం నెరవేరలేదన్న దిదులుతో, అంతులేని ఆవేదనతో, నాన్న ప్రాణాలు విడిచిపెట్టడమూ జరిగేదికాదు" కాస్త ఆవేశంతో చెప్పుకుపోయాడు రామరాజు.

పురుషోత్తమరావుకి, నవ్వు ఆగిందికాదు. "నీ మనసులో రగుల్తున్న క్రోధం యిదట్రా రాజూ! నువ్వు లేని పోని అపోహాల్ని పెంచుకుని బాధపడుతున్నావు. కాని,

విషయాన్ని సమగ్రంగా తెలుసుకుంటే సుశీలకు యేమాత్రం స్వార్థచింత లేదనీ, మీ నాన్నే స్వార్థంతో ప్రవర్తించాడనీ నమ్ముతావు."

"నాన్న స్వార్థంతో ప్రవర్తించాడా?" విస్తుపోతూ అడిగాడు రాజు.

"ఔనురా! అయితే ప్రతిఫలాపేక్షతో కాదు. నీ మీదవుండే అభిమానంకొద్దీ అలా ప్రవర్తించాడు. తను యీ లోకం వదలిపెట్టాక నిన్ను అన్నివిధాలా సంరక్షించే వ్యక్తి సుశీలేనని భావించాడాయన. అందుకే మీ యిరువురి వివాహానికి ప్రయత్నించాడు. కాని నువ్వు నిరాకరించావు. నిన్ను బలవంతంచెయ్యలేక, అదే దిగులుతో, కృంగిపోయాడు. అవుతేనేం - సుశీల మీ నాన్న అంతరంగంలో అనుభవిస్తున్న బాధను తెలుసుకుంది. ఆయన నోట అన్నీ విన్నది...అన్నయ్యా, అన్నీ ఆమెతో చెప్పకుండా వుండలేకపోయాడు మరి! అంతా విని, ఆమెను వివాహం చేసుకొందుకు, నువ్వు నిరాకరించావని తెలుసుకుని కూడా యెల్లప్పుడు నీకు తోడు నీడగా వుంటానని హామీ నిచ్చింది. యెందుకలా మాటిచ్చిందో తెలుసా! అన్నయ్య హృదయంలో శాంతిని యేర్పర్చడానికే! నిజానికి, ఆ హామీయే అతని హృదయంలోని తుపానును చల్లార్చింది. ఒక విధమైన తృప్తిని యేర్పరచింది. అప్పుడలా మాట యిచ్చింది కాబట్టే, ఈ వూరు వదలకుండా, నీ మంచి చెడ్డలు పరో-

షంగా నైనా తెలుసుకుంటూంది. ఇప్పుడు నేను రావడానికి కారకురాలు" కూడాసుశీలే.

రామరాజు కళ్ళకు కట్టుకట్టబడి వుందిగాని, లేకపోతే అతని కళ్ళల్లో యెంతో ఆశ్చర్యం అగుపించేది. బాబాయ్ రావడానికి సుశీలే కారణమని తెలిశాకనే యీ ఆశ్చర్య మంతాను.

"మీరు రావడానికి కారణం సుశీలా? అదెట్లా?" అడిగాడు రాజు.

"నువ్వు ధర్మారావు యింట్లోనే ప్రస్తుతం వున్నట్లూ బహుశా వాళ్ళమ్మాయితో నీ వివాహంజరగబోతుందేమో ననీ నాకు తెలియజేసింది సుశీలే! నీలోని ఈ మార్పుకు నేను యెంతో ఆశ్చర్యపోయాను. అన్నయ్య నా స్మృతి పథంలో మెదిలాడు. ఆయనలాంటి బాధ్యతే నాకూవున్నట్టు తోచింది. ధర్మారావు పన్నిన వలనుండి నిన్ను ఏ విధంగా నైనా తప్పించాలన్న అభిప్రాయంతో వచ్చాను. కాని, విధి మరోలా వుంది. భగవంతుడు నాకు ఈ సంఘటన చూడమన్నాడు. అది నా దురదృష్టం."

"సుశీల, మీ కెందుకు వుత్తరం రాయాలి బాబాయ్? నా పెళ్ళి శ్యామలతో జరిగిన పక్షంలో, తను నిరాశపాం దాల్సి వస్తుందన్న అసూయతో రాసిందా?"

"కాదురా! అటువంటి అసూయగాని, మరేవిధమైన స్వార్థంగాని, సుశీలలో లేవు. వాళ్ళ వృచ్చులో యిరు కున్నంటే, నీ భవిష్యత్తు యెలా వుంటుందోననే భయం

సుశీలకి. వ్యక్తం చెయ్యలేని ఓ సద్భావంతో అలా ప్రవర్తించింది."

"నేను నమ్మను."

"అదే నీతో చిక్కురా రాజూ! నీ పట్టుదల నీదే! సరే—ఒకవేళ నిన్ను వివాహం చేసుకునే కోరిక దానికి వుందనుకో! అందులో తప్పేముంది?"

"అదీ, అలా దారికి రండి. అదే ఆమె స్వార్థమంటాను. కాని, ఆమె యెంత ప్రయత్నించినా, నేను మాత్రం ఆమెను వివాహం చేసుకోను. ఆమె నాకు సేవ చెయ్యొద్దు. వద్దు బాబాయి – వద్దు. వీరన్న చూసుకుంటాడులెండి." అన్నాడు రామరాజు. సుశీలపైగల ద్వేషాన్నంతా ఆ మాటల్లో ఒలకబోశాడు.

పురుషోత్తమరావుకి కళ్ళనిండుగ కోపంవచ్చింది, రామరాజు మొండిపట్టుదలకి.

"ఒరేయి రాజూ! నువ్వు అర్థంలేకుండా మాట్లాడుతున్నావురా! సుశీల నీకు యేం అపకారం చేసిందని, దాని మీద నీకీ కక్ష చెప్పు? పట్టుదలకు కూడా ఒకహద్దువుండాలి" విసుగుగానే అన్నాడు.

రామరాజు చలించలేదు.

"కారణాలంటూ ప్రత్యేకించి నన్ను అడగకండి బాబాయి. ఆమెను వివాహం చేసుకోవడం, నా మనోభీష్టానికి విరుద్ధం. ఆమె నాకు ఏ విధమైన సేవ చెయ్యనవసరం లేదు. అంతవరకే నేను చెప్పాలిసింది. మీరు ఈ విషయంలో బలవంతం చెయ్యకండి బాబాయి" అన్నాడు.

పురుషోత్తమరావు మొహం రాగరంజితమయ్యింది. కళ్ళు మెరుస్తున్నాయి యెర్రగా.

"రాజూ!" కాస్తంత ఆగ్రహావేశంతో కేకవేశాడు.

అంతవరకూ ద్వారంవెనుక నుంచుని, అంతా వింటున్న సుశీల, అనవసరంగా ప్రళయం వస్తుందేమో ననుకొని, చప్పున ముందుకు వచ్చింది.

"ఆవేశం తెచ్చుకోకండి మావయ్యా! బావ అనుకొంటున్నట్లు నేనేం స్వార్థపరురాలను కాదు. అతణ్ణి వివాహం చేసుకొని భోగభాగ్యాలు అనుభవించాలన్న అత్యాశకూడా నాకు లేదు. కేవలం బావ శ్రేయస్సుకోసం ప్రయత్నించడమే నా ధ్యేయం. అయితే, యీ నా ప్రయత్నాన్ని బావ అపార్థం చేసుకుని, అపోహపడితే నేనేం చెయ్యగలను? అది నా దురదృష్టం. బావకి దృష్టి వచ్చే వరకూ సన్నిక్కడ వుండనీయండి. ఆ తర్వాత బహుశా, ఈ వూళ్లోనే వుండను." అంది బాధను దాచుకుంటూ.

పురుషోత్తమరావు మౌనంగా ఓ నిట్టూర్పు విడిచాడు. సుశీల తమ సంభాషణ వినడం, ఒకవిధంగామంచిదే అయ్యిందనుకున్నాడు.

"విన్నావురా రాజూ! అటువంటి వ్యక్తిని నువ్వు అపార్థం చేసుకొంటున్నావు. లేనిపోని అపోహలు పెంచుకొని, పట్టుదల పెంపొందించు కుంటున్నావు. ఇదేం నాకు నచ్చలేదు. నాకేకాదు - మానవత్వం వున్న యే వ్యక్తీ సహించలేదు." అన్నాడు ఒకింత అసహ్యంతో.

రామరాజు, ఆ క్షణంలో మాత్రం మాట్లాడలేక

పోయాడు. కాని, అతనిలోని ద్వేషం, ఆవేశం, పట్టుదల అంతరించలేదు.

సుశీల మెల్లగా అక్కణ్ణించి నిష్క్రమించింది. పరిస్థితి అదుపులోకి వచ్చినందుకు ఆనందించింది.

సుశీల వెళ్ళిపోయాక పురుషోత్తమరావు అన్నాడు.

"నీకోసం, కేవలం నీ సుఖంకోసం, సుశీల యెంత త్యాగం చేసిందో, యిప్పటికైనా అవగాహన చేసుకోరా రాజూ! సహృదయులకు ఈ రోజుల్లో స్థానం లేదనడానికి, యిదో ప్రబల నిదర్శనం. ఔనులే! అందుబాటులో వున్న వాటిని అసహ్యించుకోవడం, అందనివాటికై అఱ్ఱులు చాచడం, మానవస్వభావం మరి! నీకు మాత్రం ప్రత్యేక గుణం యెలా అబ్బుతుంది? సరే నీ యిష్టం. నీ మనసు నొప్పించడం, నా అభిమతం కాదు. నీకు యేది మంచి మార్గమని తోస్తే, అటే సాగిపో! రేపు నేను వెళ్ళిపోతు న్నాను. మీ పిన్నిని తీసుకుని పదిరోజుల్లో వస్తాను మళ్ళీ."

"బాబాయ్ కట్టువిప్పే క్షణానికి, మీరు దగ్గర వుండాలి. ఎందుకో నాకు భయంగా వుంది." అన్నాడు రామరాజు. తనకి చూపు వస్తుందో, లేదోనన్న భయం అతనిలో యేదోచోట మెదులుతూనే వుంది.

"తప్పకుండా వుంటానురా! నువ్వేమీ దిగులు పెట్టుకోకు, నిరాశపడకు. దృష్టి వస్తుంది. డాక్టరు చెప్పారురా అధైర్యపడొద్దని. ఇప్పటికే చాలావేళ య్యింది. ఇకనిద్రపో!" అనేసి అక్కణ్ణించి నిష్క్రమించాడు పురుషోత్తమరావు.

రామరాజు, నిస్పృహతో నిట్టూర్పు వదిలాడు. అతని

మెదడులో ఆలోచనలు ఢీకొంటున్నాయి. కొద్దిసేపట్లో, సుశీలవచ్చి, లైటార్పి బెడ్‌రూమ్‌లైటు వెలిగించి వెళ్ళిపో యింది. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఇరువురి హృదయా ల్లోనూ, ఏవేవో ఆలోచనలు! ఎన్నో అగాధాలు."

## 20

ఒకే యుగంలో, ఒకే సంఘంలో, ఒకే కాలంలో జీవిస్తున్నా, మనుషులందరూ ఒకేలా వుండరు. అదే సృష్టి కర్త లీల. నాస్తికులు సహితం, దీన్ని ఒప్పుకుంటూ, సృష్టి కర్త లేడని వారు అన్నా, ఏదో మానవాతీతశక్తి వుందని ఒప్పుకోక తప్పదు.

రామరాజు, జలజపట్ల ద్వేషాన్ని పెంచుకున్నా, జలజమాత్రం, అతణ్ణి అసహ్యించుకోవడంలేదు. అతణ్ణి సాను భూతితో అర్థం చేసుకుంది. రామరాజు దైవోపహతుడను కుంది. రామమోహన్ కూడా జలజవలనే, రాజుని అర్థంచేసు కుని, జాలపడ్డాడు. రామరాజుకి ప్రమాదంజరిగినవిషయమూ ఆపరేషను చేసినవిషయమూ డాక్టరు ప్రభాకర్ ద్వారా అతనికి తెలిసింది. రాజుకి ఆపరేషను చేసింది డాక్టర్ ప్రభాకరే! రామమోహన్ ఈ విషయం జలజతో చెప్పాడు.

జలజ యెంతో బాధపడింది. ఒక వ్యక్తిగా తోటి మానవుని బాధ సహించలేకపోయింది. అతణ్ణి చూడ్డానికి

వెళ్దామంది. కాదనలేకపోయాడు రామమోహన్. రాజుపట్ల అతనికి యెప్పుడూ ద్వేషం లేదు.

డాక్టరు రామమోహన్, జలజ, వచ్చేసరికి, సుశీల రామరాజుకి రొట్టె తినిపిస్తోంది. వారిని చూసి నిల్చుండిపోయింది సుశీల. వాళ్ళెవరో ఆమెకి తెలీదు. అయినాసరే, సభ్యత విస్మరించకుండా ఆహ్వానించింది.

"ఎవరా వచ్చింది సుశీలా?" అన్నాడు రాజు.

సుశీల జవాబిచ్చేముందే, జలజ అందుకున్నది—

"మేమండీ రాజుగారూ!" అని జలజ అంది. ఆమె గొంతు, అతనికి సుపరిచితం గాబట్టి, యిట్టే గుర్తుపట్టేశాడు రాజు.

"ఓ! మీరా జలజగారూ! మీ మావయ్యగారు కూడా వచ్చారా?"

"వచ్చానండీ! నమస్తే!" రామమోహన్ అన్నాడు.

"నమస్తే సార్! మీరు మా యింటికి రావడం చాలా సంతోషం కలిగించిందండీ? కూర్చోండి..."

రామమోహన్ దంపతులు సోఫాలో కూర్చున్నారు.

"నాకు ఈ ప్రమాదం జరిగినట్టు తెలిసే వచ్చారా?" ప్రశ్నించాడు రాజు.

"ఔనండీ!"

"ఎవరు చెప్పారు?"

"డాక్టరు ప్రభాకరు చెప్పారండీ! అతనేగా మీకు ఆపరేషన్ చేశాడు. మా యిద్దరమూ మిత్రులం. ఏవో మాటల సందర్భంలో యీ ప్రమాద విషయం చెప్పారుగాని

ఆ ప్రమాదానికి గురైన వ్యక్తి పేరు చెప్పలేదు మొదట. ఎందుకో నాలో ఆసక్తి పెరిగింది. పేరు అడిగాను. మీ పేరు చెప్పాడు. నే నెంతో విచారించాను. జలజతో యీ విషయం చెప్పేవరకూ నా మనసులో ఆరాటం తగ్గలేదు. జలజ మీ సంగతివిని, కంటతడి పెట్టుకుంది. ఎప్పుడు మిమ్మల్ని చూస్తామా, అన్న ఆతృతతో ఇలా వచ్చేశాం'' చెప్పుకుపోయాడు రామమోహన్.

"మీ అభిమానాదరాలకు, ధన్యవాదాలు డాక్టరు గారూ! మీ గురించి జలజద్వారా అప్పట్లో వినేవాణ్ణి. ఇంతకుముందే మీతో కాస్తంత పరిచయం వున్నా ఆరోజు నన్ను మీ కారులో తీసుకువచ్చి మా యింటిదగ్గర దింపిన నాడే, మీహృదయాన్ని అర్థం చేసుకున్నాను. మీ వంటి సహృదయులను, భర్తగాపొందినజలజ అదృష్టవంతురాలు.''

"మరీనన్నంతగొప్పవాణ్ణి చెయ్యకండి రాజుగారూ!మీరు అనవసరంగా జలజను అపార్థం చేసుకున్నారుగాని లేకుంటే ఆమె మీ భార్య అయ్యుండేది. సరేలెండి. ఆ విషయాన్ని మనం యిప్పుడు ప్రస్తావించకూడదు. కాని, గతాన్ని విస్మరించి, ప్రస్తుతాన్ని ఆలోచించడం అవసరం. ఇటీవల మీ హృదయానికి అన్నివిధాలా ఘాతాలు తగిలాయి. వాటన్నింటినీ ధైర్యంగా నిలబడి యెదుర్కొన్నారు. అందుకు మీరు అభినందనీయులు. అవుతే, మీ మనసులో గూడుకట్టుకున్న ఆవేదనను మాత్రం వెలికి పంపలేకపోతున్నారు. ఈ మానసిక దుర్బలత మరీ మంచిదికాదు. గతాన్ని మర్చిపోండి. మీ జీవితంలో సుఖశాంతులు పునరుద్ధరించడానికి ప్రయ

త్నించండి. అందుకు ప్రథమ ప్రయత్నంగా, మీకు నచ్చిన అమ్మాయిని వివాహం చేసుకోండి. అప్పుడు, మీలో కొంత మార్పు రావడానికి అవకాశం వుంది'' అన్నాడు రామ మోహన్.

రామరాజు బాధగా ఓ నిట్టూర్పు విడిచాడు. సుశీల అప్పుడే అక్కణ్ణించి మెల్లగా జారుకుంది. రానున్న ప్రసంగాన్ని అక్కడవుండి వినడం, ఆమెకి యిష్టంలేదు.

"రామమోహన్‌గారూ! నామీద అభిమానంతో యింతగా చెప్పారు. కృతజ్ఞుణ్ణి. కాని, ఒక్క విషయం ఆలోచించండి. ఎవరైనా చేతులారా జీవితాన్ని నాశనం చేసుకుంటారా చెప్పండి? అది యెప్పుడూ జరగదు. నాకూ సుఖంగా జీవితాన్ని సాగించాలనే వుంటుంది. కాని, ప దురదృష్టంవల్ల, పరిస్థితులు నా అభిమతానికి ప్రతికూలంగా యేర్పడుతున్నాయి. ఏం చెయ్యను? మా మావయ్య కూతుర్ని వివాహం చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. ఆ నిర్ణయం జరిగాక, నేనీ ప్రమాదంలో యిరుక్కున్నాను. చూడండి నా దురదృష్టం..." అంటూ వాపోయాడు.

"నిజమే రాజుగారూ! మీరు దురదృష్టవంతులే! అలాగని, మరీ దిగజారిపోతామా? మీరు ఆరోగ్యం కోలుకున్న తర్వాతనే వివాహం చేసుకోండి. మీ మేనమామ కూతురే గాని, వేరెవ్వరూ కాదుగా!" రామమోహన్ అన్నాడు.

రామరాజు అదోలా నవ్వాడు. ఆ నవ్వులో కనిపించని బాధ, యెంతో యిమిడివుంది.

"నాకు మళ్ళీ దృష్టి వస్తే నేకదండీ, ఆ ప్రయత్నం కొనసాగడం?" రాజు స్వరం కంపించింది.

రామరాజు బాధను, భయాన్ని, అర్ధంచేసుకున్నాడు రామమోహన్, డాక్టరుగా తన ధర్మాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు.

"అదిగోండి—ఆ నిస్పృహ, నిరాశ లే వుండకూడదు రాజుగారూ! ఎప్పుడూ మనం సత్ఫలితాల్నే వూహించాలి, ఆశించాలి. అదీగాక, మీకు యీ సందేహం యెందుకు కలిగిందో, అర్ధంకావడంలేదు. డాక్టర్ ప్రభాకర్, నాతో యీ ఆపరేషనుగురించి విపులంగా చెప్పాడు. నాకుమాత్రం సెంట్ పర్సంట్ ఆశాభావం వుంది. మీరేమీ కంగారుపడకండి... సందేహాల్ని పటాపంచలు చెయ్యండి. నిశ్చింతగా వుండటం యెంతో అవసరం." రాజుకి దగ్గరగా వచ్చి, అతని భుజం తడుతూ అన్నాడు.

డాక్టరుగా, రామమోహన్ మాటలు వుత్సాహాన్ని, కాస్తంత ధైర్యాన్ని రేకెత్తించాయి రాజులో.

"ఆ మాత్రం ధైర్యం మీరిస్తే చాలు డాక్టర్!" అన్నాడు వుత్సాహంగా.

రామమోహన్ మెల్లగా నవ్వుకున్నాడు.

"మీధైర్యం మీకు వుండాలిగాని, యిలా దిగులు పడితే యెట్లా చెప్పండి? ఇంతకీ, మీ మావయ్య కూతురంటే, యిప్పుడు మీకు రొట్టె తినిపించి వెళ్ళిన అమ్మాయేనా?" అంది జలజ. ఆ ప్రశ్న వెయ్యాలని చాలాసేపట్నుంచి అనుకుంటోందామె.

"కాదండీ! ఈమె మా మేనత్త కూతురు. పేరు సుశీల. ఎంత వద్దని చెప్పినా, నా సేవలో నిమగ్నురాలవుతూ వుంది."

"చాలా మంచి అమ్మాయిలా వుందండీ! మరి, యీ పిల్లనే వివాహం చేసుకోవడం మానేసి, యింక యెవర్నో చేసుకుంటా నంటా రేమిటి రాజుగారూ ?" మళ్ళీ అంది జలజ.

"అందుకు, అనేక కారణాలు వున్నాయిలెండి." అంతకంటె అధికం చెప్పలేకపోయాడు. చెప్పినా, అవి చాలా సిల్లీ గా వుంటాయేమోనని చెప్పలేదు.

"అయితే, నేను చెప్పవల్సిందేమీ లేదు. నా సలహాను వుపసంహరించుకుంటున్నాను రాజుగారూ !" అనేసింది జలజ.

రామమోహన్ మాత్రం, అంత సుళువుగా వదిలిపెట్టేట్టు కనిపించలేదు.

"మీ స్వంతవిషయంలో జోక్యం కలుగజేసుకుంటున్నందుకు, మరేమీ అనుకోకండి రాజుగారూ! ఒక విషయం నాకు అర్థం కావటంలేదు. మీ మావయ్య కూతుర్నే వివాహం చేసుకోవాలన్న నిర్ణయం జరిగిందన్నారు. అటువంటప్పుడు, మీరీ స్థితిలో వుండగా, ఆ అమ్మాయే యిక్కడవుండి, మీకు సేవలు చెయ్యవల్సింది. కాని, అలా జరగలేదేం? మీరు తెలుసుకోలేని విషయాలు యేవో యిందులో యిమిడి వుండవచ్చు రాజుగారూ ! మనం బాగున్నప్పుడు అంతా ఆప్యాయత చూపుతారు.

వాళ్ళు స్వార్థంకోసం, మనల్ని అందల మెక్కిస్తారు. కాని, మనం కష్టాల్లో వున్నపుడు ఆదుకున్న వాళ్ళే, నిజమైన అప్తులు. వారికే, స్వార్థచింత వుండదు. ఈ అమ్మాయిని వదులుకుంటున్నారంటే, ఆశ్చర్యమేస్తోందండీ! ఇంతటి శాంతమూర్తి, యింట్లో మసలుతూవుంటే, ఆ యిల్లు స్వర్గంకాక మరేమవుతుంది చెప్పండి? అటువంటి అమృతావకాశాన్ని యెందుకు జారవిడుచుకుంటున్నారో బోధపడ్డం లేదు. ప్రతిఫలాపేక్ష యేమీ లేకుండా, తనకు లాభించేది యేమీ వుండదని తెలిసికూడా, యీమె మీకు సపర్యలు చెయ్యడంలోనే ఆమె మంచితనం అర్థం కావడంలేదూ? బాగా ఆలోచించండి...” జలజ అభిప్రాయాన్ని బలపరిచాడు రామమోహన్.

రామరాజు మాట్లాడలేదు. ఏం జవాబు చెప్పగలడు? శ్యామల అయినా, కనీసం మాణిక్యం అయినా యీ సమయంలో యిక్కడ వుంటే, చెప్పడానికి ఒక సందర్భం యేర్పడేది. కానీ, యెవ్వరూ లేరే!...అనుకున్నాడు. వాళ్ళమీద తాత్కాలికంగా కాస్తంత కోపం వచ్చింది.

రాజు యింకా యీ ఆలోచనల్లో మునిగి తేలుతూ వుండే సమయంలోనే ధర్మారావు వచ్చాడు.

“ఎవరా వచ్చింది డాక్టరుగారూ?” అడిగాడు రామరాజు.

“నేనురా రాజూ!” తనే అందుకుని జవాబుచెప్పాడు ధర్మారావు.

"నువ్వా మావయ్యా! శ్యామల వచ్చిందా ?" ఆసక్తితో అడిగాడు.

ధర్మారావు తెల్లమొహం వేస్తూ, గుటకమింగాడు. లేని నవ్వు తెచ్చుకున్నాడు.

"రాలేదురా! అది రావడానికి వీలుపడింది కాదు. ఓసారి నిన్ను చూసి రమ్మని మీ అత్తయ్య నన్ను పంపింది..."

"నేను అడుగుతున్నది శ్యామల గురించిగాని, అత్తయ్య విషయం కాదు. ఏవిఁటా వీలుపడకపోవడం ?" వుద్రేకంతో అడిగాడు.

"ఎలా వస్తుందిరా? దాని వివాహం నిశ్చయమయ్యిందిగా!" తడబడుతూనే అన్నాడు ధర్మారావు.

"వివాహమా? ఎవరితో?" ఆశ్చర్యమూ, కోపమూ మిళితమై, అతనిలో వుప్పొంగి ప్రవహించాయి. పెద్ద షాక్ తగిలినట్టుగ చలించిపోయాడు.

"అబ్బాయి, లైఫ్ యిన్సూరెన్సులో ఫీల్డ్ ఆఫీసరుగా వుంటున్నాట్ట. నీకు యీ ప్రమాదం తటస్థించిందని తెలిసి, వాళ్ళేవచ్చి శ్యామల్ని తమ యింటి కోడలుగా చేసుకుంటామని యెంతో ప్రాధేయపడుతూ కోరారు. ఏం చెయ్యడం? నీ స్థితి చూస్తే యిలా వుంది... అందుకే వారి కోరిక మన్నించక తప్పిందికాదు." అని చెప్పాడు ధర్మారావు.

రామరాజు మొహం యెర్రబారింది. కోపంతో శరీరమంతా కంపించింది. కళ్ళకు కట్టిన కట్టు బిగుసుకుపోయింది.

"మావయ్యా! ఎంత ద్రోహం చేశారు నన్ను!" కోపావేశంతో అన్నాడు.

"ద్రోహం కాదురా! నీకు దృష్టి వస్తుందో, రాదో..." అని యింకా యేమో అనాలనుకున్న ధర్మారావు వాక్ప్రవాహానికి అడ్డువచ్చి వారించాడు రామమోహన్.

"చూడండీ! మీ పేరేమిటో తెలీదుగాని, రక్తసంబంధీకులై వుండి, మీవంటి పెద్దలు యిలా రోగిని నిరుత్సాహపర్చడం, సబబుగా లేదు. రాజుగారికి దృష్టిరాదని, యెవరు చెప్పారు మీకు!" సూటిగా ధర్మారావు ముఖంలోకి చూస్తూ అన్నాడు రామమోహన్.

"అందరూ అనుకుంటున్నారండీ!"

"మీరు అనవసరంగా యేవో కల్పించి చెప్పి, స్వార్థానికి యిదో సాకుగా వుపయోగించుకోకండి. మీ యిష్టం వచ్చినట్టు మీ స్వంత విషయాల్లో ప్రవర్తించండి. కాని, యెదుటివారిని నిరుత్సాహపర్చకండి. అదే నేను కోరేది. రాజుగారికి చూపువస్తుంది తప్పకుండా. డాక్టరుగా నేను చెప్తున్నాను." విసురుగా అన్నాడు రామమోహన్.

ధర్మారావు జవాబు చెప్పలేదు. అతనినోట మాట రాలేదు. తనలో దోషముందన్న బలహీనత అతణ్ణి మరీ కృంగదీసింది.

రామరాజు కోపంతో పళ్ళు పటపట కొరికాడు.

"మావయ్యా! ఎంతటి కపటహృదయులు మీరు! అందుకే, మిమ్మల్ని నాన్నగారు దూరంగా వుంచేవారు. బాబాయ్ మాటల్ని పెడచెవిని పెట్టాను. అందుకే, నాకు

తగ్గ శాస్తి జరిగింది. భగవంతుడు నాపై చిన్నచూపు చూసి, నాకు అంధత్వమే ప్రసాదిస్తే, మిమ్మల్ని నమ్ముకున్నందుకు నాగతి యేం కావాలి? ఛీ! ఛీ! మీరు మనుషులు కారు...ధనాశా పిశాచులు...మీకు హృదయం లేదు. మీ వంటివారు యిక్కడ వుండటానికి అనర్హులు. ఇక్కడ ఒక్క క్షణం వుండొద్దు. ముందు బైటకి నడుమావయ్యా! ఈ రోజునుండి మీకూ, మాకూ యే విధమైన బంధుత్వమూ లేదనుకో!" ఆవేశంతో అన్నాడు.

ధర్మారావు బిక్క మొహం వేసుకుని, చరచరా బైటకి నడిచాడు. రామమోహన్, రామరాజు భుజంతట్టి "ఉద్రేకపడకండి రాజుగారూ! ఈపరిస్థితిలో వుద్రేకం మీకు పనికిరాదు. ఇప్పటికైనా, వారి నిజస్వరూపాలు తెలశాయి... సంతోషించండి. ఇప్పుడు మించిపోయిందేమీ లేదు. మీ నిర్ణయాన్ని మార్చుకోండి." అన్నాడు.

"మా సుశీలకు అన్యాయం చేసినందుకు, నాకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగింది డాక్టరుగారూ! ఆమెను అకారణంగా ద్వేషించి, ఆ లేత హృదయాన్ని గాయపర్చాను." ఆవేదనతో అన్నాడు.

రాజులో అటువంటి పశ్చాత్తాపం వచ్చినందుకు రామమోహన్, జలజ, అపరిమితానంద భరితులయ్యారు.

"ఆపాటి పశ్చాత్తాపం చాలు రాజుగారూ! మీ పొరపాటుని యిప్పుడు సరిదిద్దుకుంటే, న్యాయం చేకూర్చినవారవుతారు..." అంది జలజ నవ్వుతూ.

రామరాజు మాట్లాడలేదు. అతని హృదయాంత రాళంలో యెన్నెన్నో ఆలోచనలు... యేవేవో అను భూతులు, కదులుతున్నాయి.

"మరి, మేం వెళ్ళొస్తాం రాజుగారూ! ఇరవయ్యో తేదీన కట్టు విప్పుతానని డాక్టర్ ప్రభాకర్ చెప్పాడు. ఆ రోజు మేంకూడా వస్తాంలెండి." అన్నాడు రామమోహన్.

"థాంక్స్ డాక్టర్! అంతకంటె కావల్సిందేముంది? ఈరోజు మీరు రావడం, మీరు నాకు ధైర్యం చెప్పడం, నాలో కొత్త అశల్ని రేకెత్తించాయి." వుత్సాహంగా అన్నాడు రాజు.

"ఎప్పుడూ ఆశావాదిగా వుండటం మంచిదండీ! మరి వస్తా..."

"వస్తానండీ!' జలజకూడా చెప్పింది.

"మంచిదండీ!" కృతజ్ఞత వుట్టిపడేలా అన్నాడు రాజు.

వాళ్ళిద్దరూ నిష్క్రమించారు. క్షణం తర్వాత, సుశీల పాలగ్లాసుతో వచ్చింది.

"పాలు తీసుకో బావా!"

రామరాజు పాలు తీసుకొని, ఖాళీగ్లాసు ఆమెకి అందిస్తూ-

"ఇంతసేపూ యెక్కడున్నావు సుశీలా?" అడిగాడు సౌమ్యంగా. బావ స్వరంలో యేదో మార్పు కనిపించి, ఆశ్చర్యపోయింది సుశీల. మనిషిలోని భావాలకు స్వరం ఒక దర్పణం లాంటిదని, ఆమె భావన.

"వంటగదిలో వున్నాను బావా!"

"ఓ! అలాగా!"

"ఏం? ఎందుకలా అడిగావు?"

"ఏమీ లేములే! మావయ్య వచ్చాడుకదా, అతను వచ్చినపుడు, నువ్విక్కడ వున్నావేమోనని..."

"ఆయన వచ్చినట్టు నాకు తెలీనే తెలీదు!"

"సరే! నువ్వు వెళ్ళిక..." అక్కడితో ఆ ప్రసంగాన్ని ఆపేశాడు.

బావ మాటల్లోని భావం సుశీలకు బోధపడలేదు. అతను యెందుకలా అడిగాడో నన్న ఆలోచనలతో, అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

వాతావరణం ప్రశాంతంగావుంది. రామరాజు మెదడు చురుగ్గా పనిచేయ ప్రారంభించింది. అసంఖ్యాకమైన ఆలోచనలు, అతని మెదడుని చుట్టుముట్టాయి. అవన్నీ సుశీలను గురించిన ఆలోచనలే! నిజంగా తను సుశీలకు యెంతో అన్యాయంచేశాడు. ఆమెపట్ల యెహ్యా భావంతో ప్రవర్తించి, యెన్నో సార్లు ఆ సున్నిత హృదయాన్ని గాయపర్చాడు. అయినా, ఆమె యెంతో వోర్పుతో, అన్నిటిని సహించేది. ఇంతకీ, తను ఆమెను అసహ్యించుకోవడానికి, కారణం యేమిటో తనకే తెలీను. తెలసిన కారణం ఒకటే! ఆమె మూలంగా, తనకీ, నాన్నకీ, భేదాభిప్రాయాలు వచ్చాయన్న కోపం వుండేది. అయితే, యీ విషయంలో ఆమెకి యెంత బాధ్యతవుందని, తనెప్పుడూ తరచి ఆలోచించలేదు. నాన్న చేసిన యీ ప్రయత్నానికి, సుశీలను యెందుకు

బాధ్యురాలుగా చెయ్యాలి? ఈ ఆలోచన తనకి అప్పట్లో వుంటే, తన జీవితం మరోలా వుండేది. అనవసరంగా తనూ బాధపడ్డాడు, సుశీలనూ బాధపెట్టాడు.... అనుకుంటూ పరి పరి విధాల ఆలోచించాడు. ఆ ఆలోచనలకు అంతం లేదు. మరి కాసేపటికి నిద్రపట్టేసిందతనికి.

క్షణం పోయాక సుశీలవచ్చి, బావకి నిద్రపట్టిందని గ్రహించి, దుప్పటి కప్పేసి లైటార్పేసి వెళ్ళిపోయింది.

## 21

ఆరోజు ఇరవయ్యో తారీకు—

రామరాజుకి సంబంధించినంత వరకూ ఆ రోజుకి యెంతో ప్రాముఖ్యత వుంది. అతనికి కట్లు విప్పేరోజు అది. అతని హృదయ స్పందన, విపరీతం కాజొచ్చింది. ఒక విధమైనభయం అతణ్ణి ప్రశాంతంగా వుండనీయడం లేదు. తనకి చూపు వస్తుందా? ఒకవేళ తను అంధుడే అయితే! ఇంక ఆలోచించలేకపోయాడు. ఆలోచించడానికే అంత భయంకరంగా వుండే అంధత్వం, అనుభవించడానికి, యెంత ఘోరంగా వుంటుందో!

అతనిభుజంమీద చెయ్యిపడింది. త్రుళ్ళిపడ్డాడు రాజు.

«ఎవరూ?»

«నేనురా రాజూ! ఏమిటాలోచిస్తున్నావు?» అన్నాడు పురుషోత్తమరావు.

"రండి బాబాయ్, కూర్చోండి. ప్రస్తుతం నేను యేవిటాలోచిస్తూ వుంటానో, మీరు అర్థం చేసుకోలేరూ?"

"అర్థం చేసుకోగలనురా? కాని, ఆ ఆలోచనలు వద్దని యెన్నోసార్లు చెప్పానుగా! తప్పకుండా నీకు దృష్టి వస్తుంది. మరేం భయపడకు. అన్నట్టు, ధర్మారావు వాళ్ళు కనిపించరేం?"

"వాళ్ళిక యీ యింట్లో అడుగుపెట్టరు బాబాయ్! వారి కపట స్వభావాన్ని నేను ఆకళింపు చేసుకున్నాను. నాన్న వాళ్ళను యెందుకు దూరంగావుంచేవారో,యిప్పుడు తెలిసింది. మీరు హెచ్చరించినా విననందుకు తగిన శిక్షనే అనుభవించాల్లెండి. ఆ విషయాలన్నీ తర్వాత చెప్తానుగాని డాక్టర్ ప్రభాకర్ వచ్చారా?"

"వచ్చేవేళ అయ్యిందిలే! ఆయన, రామమోహన్ గారూ కలసివస్తారట..."

"ఈ విషయం యెవరు చెప్పారు బాబాయ్?"

"జలజ చెప్పింది..."

"ఆమె వచ్చేసిందన్నమాట!"

"ఇప్పుడే వచ్చిందిరా! సుశీలతో మాట్లాడుతోంది"

"సుశీల అంటే, ఆ దంపతులకు మంచి అభిప్రాయం వుంది బాబాయ్!"

"ఎందుకు వుండదురా! సుశీలవంటి వ్యక్తులు చాలా అరుదుగా వుంటారు. మనసు మంచిదయితే, యెదుటివారి [illegible]లు పొందటం, వారిచేత 'మంచి' అనిపించుకోవడం,

యెంతసేపు? అయితే మంచి మనసు, అలవర్చుకోవల్సింది కాదు. పుట్టుకతో రావల్సిందే!"

రామరాజు మౌనం దాల్చాడు. ఏదో ఆలోచిస్తున్నట్టున్నాడు. కారు శబ్దం అయ్యింది.

"అదుగో కారు వచ్చింది. డాక్టర్లే గామోసు వచ్చారు...."అన్నాడు పురుషోత్తమరావు.

క్షణంలో డాక్టర్ రామమోహన్, డాక్టర్ ప్రభాకర్, యిరువురూ ఆ గదిలోకి వచ్చారు.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు రాజు.

"గుడ్ మార్నింగ్" ఇరువురు డాక్టర్లూ ఒకేసారి అన్నారు.

డాక్టర్ ప్రభాకర్, రామరాజు భుజం తడుతూ:

"రామరాజుగారూ! ఈరోజు డాక్టర్ రామమోహన్ గారు కూడా యిక్కడే వుండటం మీ అదృష్టం. ఓసారి మనసులో భగవంతుని ధ్యానించుకోండి. డాక్టర్లం, మేం ప్రయత్నిస్తాం. ఫలితాన్నివ్వడంలో కొంతమేరకు భగవంతుని సహాయంకూడా వుండాలేమోనని అప్పుడప్పుడూ అనిపిస్తూవుంటుంది. మరో విషయం-కట్టు విప్పగానే ఒక్కసారే కళ్ళు తెరవకండా, మెల్లగా తెరవాలి. మీ మనసుకి నచ్చినవాళ్ళు, మీ కళ్ళముందు వుండటం మంచిది. ప్రప్రథమంగా వారినే చూడ్డంలో కొంత ఆనందం వుంటుంది. ఎవరు మీకు యెదురుగా వుండాలో చెప్పండి" అన్నాడు.

రామరాజు క్షణం ఆలోచించి "సుశీలను వుండమనండి డాక్టర్!" అన్నాడు.

కాస్సేపంత దూరంలో, జలజ ప్రక్కనే నుంచుని ఆసక్తితో చూస్తున్న సుశీల, విస్తుపోయింది. బావలో యీ మార్పు యెప్పుడు వచ్చిందా, అని తలపోసింది. జలజ, సుశీలకేసి చూస్తూ మందహాసం చేసింది. అయితే, సుశీల నవ్వలేదు. కాస్సేపంత సిగ్గుతో మొహం దించుకుంది. "పురుషోత్తమరావుకి రాజు నిర్ణయం, యెంతో ఆనందం కలిగించింది. జానకికూడా మురిసిపోతూ సుశీలకేసి చూసింది.

డాక్టర్లు యిద్దరూ, కట్టువిప్పేప్రయత్నంలోవుండగా, జలజ సుశీలను తీసుకొచ్చి రామరాజుకి యెదురుగా నిల్చోబెట్టింది. ఆ క్షణంలో అక్కడున్నవారందరిహృదయాల్లోనూ లోకరక్షకుడైన ఆ పరమాత్ముడే మెదిలాడు. పిన్నన్న, తాతమ్మకూడా ఆదే ధ్యాసతో వున్నారు.

కట్టు విప్పబడింది. గోడగడియారం శుభసూచకంగా 'టంగ్ టంగ్' మంటూ పదకొండు కొట్టింది. "రాజుగారు మెల్లగా కళ్ళు తెరవండి ..." అన్నాడు ప్రభాకర్, మరో సారి హెచ్చరిస్తూ.

రామరాజు గుండెలు జోరుగా కొట్టుకుంటున్నాయి. మనసులో భగవంతుని ధ్యానించుకుంటూ, మెల్లగా కళ్ళు తెరిచాడు. అంతా మసకగా వుంది.

"మసగ్గా వుంది డాక్టర్!" రుద్ధస్వరంతో అరిచాడు.

సుశీల గుండెలు ఝల్లుమన్నాయి. డాక్టర్లు యిద్దరూ తప్పించి, మిగతా వాళ్ళంతా గాబరాపడ్డారు. "ఏం భయం లేదు రాజుగారూ! మొదట్లో అలానే వుంటుంది" అంటూ

మెల్లగా కళ్ళను నులిమాడు డాక్టరు ప్రభాకర్. "ఇప్పుడు చూడండి"

రామరాజు కళ్ళువిప్పాడు. సుస్పష్టంగా కాకపోయినా యేదో ఆకృతి తన యెదుట నిలచి వున్నట్లు కనిపించింది. క్రమంగా ఆ ఆకృతి స్పష్టమయ్యింది. అతని యెదుట వున్న సుశీల కనిపించింది.

"సుశీలా!" ఆనందం పట్టలేక, అరిచాడు.

సుశీల కళ్ళనుండి ఆనందాశ్రువులు రాలినయ్. హృదయం తాపి పడింది. 'బావా' అంది, వుత్సాహాన్ని అరికట్టలేక. సిగ్గుతో ఆమె మొహం యెర్రబారింది.

అక్కడ వున్న వాళ్ళందరి కళ్ళల్లోను ఆనంద బాష్పాలు గిరుర్న తిరిగాయి. చుట్టూ పరికించాడు రాజు. తనకి ఆప్తులైన వాళ్ళంతా అక్కడే వుండటం, ఆనందం కలిగించిం దతనికి.

"బాబాయ్! నాకు దృష్టి వచ్చింది బాబాయ్" ఆనందాన్ని పట్టలేక అన్నాడు.

పురుషోత్తమరావు, రాజుదగ్గరగా వచ్చి-

"నేను చెప్పానుకదరా! నువ్వు అనవసరంగా అధైర్యపడ్డావు. ముందు డాక్టరుగారికి అభినందనలు తెలుపుకో!" అన్నాడు.

రామరాజు డాక్టరు ప్రభాకర్‌తో కరచాలనంచేస్తూ;

"థాంక్యూ డాక్టర్; నాకు మళ్ళీ దృష్టిని ప్రసాదించారు" అన్నాడు కృతజ్ఞతాపూర్వకంగా.

"దానికేం లెండి రాజుగారూ; అది నా కర్తవ్యం. ...జంగా మీరు అదృష్టవంతులు..." అన్నాడు డాక్టరు ప్రభాకర్ మందహాసంతో.

"రామరాజు గారూ! డాక్టర్ని అభినందించారు, ...నేవుంది. కాని, ఇంతవరకూ మీరు వెలుగులా వుంటూ ...వ చేసిన సుశీలను మర్చిపోయారు." నవ్వుతూ గుర్తుకు ...చ్చాడు రామమోహన్.

"లేదు డాక్టర్ మర్చిపోలేదు. ఆమెకు నేను చేసి... న్యాయానికి ప్రాయశ్చిత్తంగా, ఆమె వివాహం చే... ంటాను."

సుశీల అక్కణ్ణించి జారుకోవాలని ప్రయ... ...ని, ఆమె ప్రయత్నాన్ని వమ్ముచేసింది జలజ.

"మీరు యెక్కడికి వెళ్తారు సుశీలగారూ! మే... ...శ్రా." అంటూ జలజ బైటికి నడిచింది. ఆమె అభి... ...న్ని అర్థం చేసుకున్నట్టుగ, అంతా ఒక్కసారి నవ్వారు.

"మళ్ళీ కలుద్దాం రాజుగారూ!" అనేసి ప్రభాకర్ ...ష్క్రమించాడు.

"వస్తాం రాజుగారూ!" రామమోహన్ కూడా ...ప ...వెంట నడిచాడు.

పురుషోత్తమరావు, జానకి జారుకున్నారు. ...త ...వీరన్నకూడా నవ్వుకుంటూ చరచరాపోయ... ...ందం అంతా యింతా కాదు.

...గదిలో నిశ్శబ్దం తాండవిస్తోంది. సుశీల శిలా... ...లనం లేకుండా నిల్చుంది. రామరాజు ఆమె...



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B148 |
| పుస్తకం పేరు | సుశీల |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 179 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 13,14,21,22,59,60,75,76,83,84 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Sesmitha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |